మిల్సు, జేమ్సు

# హిందూదేశపు పశుపాలకహస్తనిక్షేపము

చెన్నపట్టణం, 1887

Record no. 125

Milsu, Jēms

Hindūdēśapu paśupālakahastanikṣēpamu

Cennapaṭṭaṇaṃ, 1887

Record no. 125

## Bibliographic Record Target

మిల్సు, జేమ్సు.

హిందూదేశపు పశుపాలకహస్తనిక్షేపము / జేమ్సు మిల్సు గారిచే రచియింపబడి, జి. రంగయ్యనాయునిగారిచే దెనిగింపబడినది. - చెన్నపట్టణం : అష్టలక్ష్మీవిలాసముద్రాక్షరశాల, 1887.

xii, 148 p. (4) leaves of plates. ;20 cm.

Record no. 125

Milsu, Jēms.

Hindūdēśapu paśupālakahastanikṣēpamu / Jēms Milsu gāricē raciyimpabaḍi, Ji. Raṅgayyanāyunigāricē Denigimpabaḍinadi. - Cennapaṭṭaṇaṃ : Aṣṭalakṣmīvilāsamudrākṣaraśāla, 1887.

xii, 148 p. (4) leaves of plates. ;20 cm.

Record no. 125

THE

# INDIAN

# STOCK OWNER'S MANUAL.

BY

JAMES MILLS,

M.R.C.V.S., V.S. 1st Class, A.V.D.,

LATE LECTURER ON MATERIA MEDICA, NEW VETERINARY COLLEGE, EDINBURGH; INSPECTOR OF CATTLE DISEASES, MADRAS PRESIDENCY; AND LECTURER ON ZOOLOGY AND VETERINARY MEDICINE AND SURGERY, AGRICULTURAL COLLEGE, SAIDAPET.

*Translated into Telugu*

BY

G. RUNGAYYA NAIDU,

LOCAL CATTLE DISEASE INSPECTOR, NELLORE DISTRICT.

Madras:
PRINTED AT THE A. L. V. PRESS.

1887.

హిందూదేశపు

# పశుపాలకహస్తనిక్షేపము.

అనుపేరంబరగు

నీగ్రంథము

తొలుత యెడింబరోపట్టణ నవీన మృగ వైద్యశాస్త్రపాఠశాలలో ఔషధ
వర్గోపన్యాసకులును, ప్రస్తుతము చెన్నపట్టణరాజధాని పశుజాడ్యముల
యిన్స్పెక్టరుగారును, సయిదాపేట వ్యవసాయపాఠశాలయందు
జంతుశాస్త్ర మృగవైద్య శస్త్రశాస్త్రోపన్యాసకులును,

ఎం. ఆర్. సి. వి. స్., వి. స్. ప్రథమతరగతి., ఎ. వి. డి.,
అనుబిరుదాంకముల వహించిన

**జేమ్సు-మిల్సు**

గారిచే

రచియింపఁబడి

నెల్లూరుజిల్లా లోకల్ క్యాటిల్ డిజీస్ యిన్స్పెక్టరు

అగు

**జి. రంగయ్యనాయునిగారిచే**

తెనిగింపఁబడి

చెన్నపట్టణం

**అష్టలక్ష్మీవిలాసముద్రాక్షరశాలయందు**

ముద్రింపఁబడియె.

---

1887



ధరరూపాయలు. 2.

TO

THE TELUGU SPEAKING CATTLE-OWNERS

OF

SOUTHERN INDIA,

**This translation is dedicated,**

BY

THE AUTHOR.

ఈగ్రంథము

దక్షిణహిందూదేశమందలి

ఆంధ్రభాషాభాషికులగు

పశుపాలకుల పేర

నంకితంబుగా

గ్రంథకర్తచే విరచింపఁబడియె.

# CONTENTS.


Chapter I.

*Page.*

Introduction ... ... ... ... 1-9

Chapter II.

Diseases and their Treatment ... ... 10-40

Chapter III.

Protective Inoculation against Anthrax ... 41-49

Chapter IV.

Surgery ... ... ... ... 50-66

Chapter V.

Medicines and Medicinal Preparations with their Actions and Uses ... ... ... 67-97

Chapter VI.

Breeding and Rearing ... ... ... 98-102

Chapter VII.

Meat and Milk as Food for Man ... ... 103-109

Chapter VIII.

Cattle Poisoning ... ... ... 110-115

Chapter IX.

Cinerators and Sanitation ... ... 116-122

## Appendix No. I.

An Act to amend Madras Act VIII of 1867, so far as relates to Cruelty to Animals ... 123-125

## Appendix No. 2.

An Act for the Prevention of the Spread of Disease among Cattle in the Madras Presidency 126-134

Telugu Index ... ... ... 135-144

Index to English Words Used ... ... 145-151

# విషయసూచిక.

### 1-టి. అధ్యాయము.

పుటసంఖ్య.

ప్రారంభము ... ... 1-9

### 2-వ. అధ్యాయము.

రోగములు-చికిత్స ... ... 10-40

### 3-వ. అధ్యాయము.

దొమ్మరోగమువలన ప్రాణహానిగలుగ నివ్వక సంరక్షణ గలుగజేయు టీకాలు ... 41-49

### 4-వ. అధ్యాయము.

వ్రణచికిత్స ... ... 50-66

### 5-వ. అధ్యాయము

ఔషధములు-వాటిగుణములున్ను ప్రయోజనములున్ను-వాటిని సిద్ధముచేయుపద్ధతులున్ను ... 67-97

### 6-వ. అధ్యాయము.

పశుసంతానప్రవృద్ధి-సంరక్షణ ... ... 98-102

### 7-వ. అధ్యాయము.

మనుష్యులకు ఆహారముగా నుపయోగించెడు మాంసము—పాలు ... ... 103-109

### 8-వ. అధ్యాయము.

పశువులు విషముగొనుట ... ... 110-115

### 9-వ. అధ్యాయము.

శవములను దహనముచేయుటకు నుపయోగించెడు బట్టీలు—ఆరోగ్యవిషయము ... ... 116-122

1-టి. అనుబంధము.

1867 సం॥ చెన్నపట్టణ రాజధాని యెనిమిదో శాసనములో జంతువులయెడల క్రూరత్వమును గురించి నంతవరకు సదరు శాసనమును దిద్దుబాటు చేయగలందులకు పుట్టిన 1879 సం॥ నాలుగో శాసనము ... 123-125

2-వ. అనుబంధము.

చెన్నపట్టణరాజధాని యిలాకా పశువులకు సంభవించే రోగము వ్యాపించకుండా ఆపడము కొరకు పుట్టిన శాసనము ... ... 126-134

తెలుగుశబ్దసూచిక ... ... 135-144

ఇంగ్లీషుశబ్దసూచిక ... ... 145-151

---



దస్కతు జె. మిల్సు. వి. యస్. ఎ. వి. డి.
ఇన్స్పెక్టరు అఫ్ క్యాటిల్ డిసీజెస్.

ఈ నక్షి యొక్క వివరము.

1. మూతి (Muzzle)
2. ముక్కురంధ్రము (Nostril)
3. ముఖము (Face)
4. నొసలు (Forehead)
5. కొమ్ము (Horn)
6. ముచ్చినగుంట (Poll)
7. అజ్జు (Crest)
8. మూపురము ; చెండు ; రుద్రము (Hump)
9. వీపు (Back)
10. నడుము (Loins)
11. ముడ్డి (Croup)
12. తోక (Tail)
13. జబ్బపూస (Round-bone)
14. డొక్క (Stomach)
15. ఉలవకాయలువుండేచోటు (Seat of Kidneys)
16. * డొక్కలోకి బెజ్జము వేయవలసినచోటు (Spot for puncturing the Stomach)
17. పార్శ్వము (Flank)
18. లింగకోశము (Sheath)
19. వృషణములు (Testicles)
20. † [illegible]మ్మమీద పొక్కుమందు వేయవలసినచోటు (Spot on which to apply a blister to the Chest)
21. రొమ్మునకున్ను కడుపునకున్ను మధ్య అడ్డను కనుపరచే గీత (Line shewing the partition between the Chest and the Belly)
22. భుజము (Shoulder)
23. భుజముకొన (Point of the Shoulder)
24. మోచేయి (Elbow)
25. మెడ (Neck)
26. గంగడోలు (Dewlap)
27. ‡ రక్తము తీయుటకుగా మెడయందుండు సర్వరక్త నాడిని చీల్చవలసినచోటు (Spot where to bleed from the jugular vein)
28. దవడ (Cheek)
29. చెవి (Ear)
30. ఆసనము ; మూలస్థానము (Anus)
31. మోకాలు (Knee)
32. పట్టెకాలు (Shank)
33. గిరసకీలు (Fetlock)
34. మడిమెకీలు (Coronet)
35. గిట్ట ; డెక్క (Hoof)

(31–35: ముందరికాలు (Fore-leg))

36. తొడ (Thigh)
37. కొంకి (Hock)
38. పట్టెకాలు (Shank)
39. గిరసకీలు (Fetlock)
40. మడిమెకీలు (Coronet)
41. గిట్ట ; డెక్క (Hoof)

(36–41: వెనుకకాలు (P[illegible])

* ఈకార్యము యెందుకుగా చేయవలసినదన్ని దీనివలని ప్రయోజనమున్ను 17

† పక్కలెల మోకలెల. యీరోగములయందు రొమ్ముమీద పొక్కుమందు వేయవలసియుండును వలయును.

‡ కొన్నిజాడ్యములయందు రోగిదేహమంతటి కొంతరక్తము రెండుగాతెగి పోయిన పక్షమందు ప్రాణిప్రాణాంతము నొందును.

to the Chest)

21 రొమ్మునకున్ను కడుపునకున్ను మధ్య అడ్డను కనుపరచే



ఈ న క్షీ యొ క్క వి వ ర ము.

1. పొదుగు (Udder)

2. చన్ను (Teat)

3. యోని (Vagina)

* 4. వట్ర కాలిమీద వాతలువేయవలసిన గీతలసంఖ్యయున్ను, ప్రదేశమున్ను, రీతిన్ని (Number of strokes, place, and manner for firing the shank).

5. మడిమెకీలుమీద ,, ,, ,, ,, ,, ( ,, coronet).

6. కొంకిమీద ,, ,, ,, ,, ,, ( ,, hock).

7. గిరిసకీలుమీద ,, ,, ,, ,, ,, ( ,, fetlock).

8. భుజముమీద ,, ,, ,, ,, ,, ( ,, shoulder).

9 సడుగుమీద ,, ,, ,, ,, ,, ( ,, hip).

హిందూ దేశపు

# పశుపాలకశాస్త్రనిక్షేపము.

## ప్రారంభము.

హిందూదేశమందలి పశువులు ఆరోగ్యదశయందును రోగదశయందును ఎట్లు జీవించుచున్నవో చక్కఁగా గుర్తెఱిగి అందఱకు తెలియునటుల సులభఫణితి గలిగి శుద్ధఅనుభవపూర్వకముగా వ్రాయబడిన యొకగ్రంథము కేవలము అగత్యమైయున్నది. పశుజాడ్యములగురించి యీదేశమందు వ్రాయబడినగ్రంథములలో ఇదే తొలిగ్రంథముగాకపోయినను అట్టిజాడ్యములలో అప్పుడప్పుడు పర్యాయభేదములు జరిగియున్నట్టు తెలియవచ్చుటచేతనున్ను, ఈవిషయమై జనహితార్థముగా సర్కారువారు చాలాశ్రద్ధబుచ్చుకొనుటచేతనున్ను, పశువులస్వంతదార్లయొక్కయు జిల్లాఅధికారులయొక్కయు సహాయార్థమైయొక నూతనగ్రంథము కావలసియున్నదని చెన్నపట్టణరాజధాని పశుజాడ్యముల యిన్‌స్పెక్టరు అను నా హోదాకు సంబంధించిన పనులను నెరవేర్చునప్పుడంతయు పలుమారునాకు తోచుచువచ్చినది. మరియు, పలుతరగతులుగల వ్యవసాయదారులు, ముఖ్యముగానీకాలపు కుఱ్ఱవాండ్రు, తమపశువులసౌఖ్యమునుఁగోరి వానికిఁగీడులు అంటనివ్వక అడ్డుజేయుటకును అంటినయెడల కుదుర్చుకొనుటకును ఇదివరలో తాముగాని తమవారుగాని చేయుచువచ్చిన దైవారాధనలకంటె ఇంకాయెక్కువగు పద్ధతులుకావలసియున్నట్టు ఇప్పుడిప్పుడు తెలియవచ్చుచున్నారు. ఇందుకుదృష్టాంతము. సయిదాపేటలోనుండు వ్యవసాయపాఠశాలలో చదువుకొనుటకుగావచ్చెడి విద్యార్థులసంఖ్య ప్రతిసంవత్సరము లావుఅయి, పశువులసౌఖ్యవిషయమైనఅంశములయందు వారుచాలాశ్రద్ధపుచ్చుకొనుటయే. అయినను, వ్యవసాయదార్లందరును పాఠశాలకువచ్చి నేర్చుకొనుటకు వీలు ఉండదు గనుక యీపుస్తక

మూలముగా నీరాజధానిలోని ప్రతిపల్లెయందు వసించెడివారికి బోధించినవాడనై నావలనిప్రయోజకత్వము అందరకు గలుగునటుల నీగ్రంథమును రచియించితిని.

ఇదియునుగాక యిటీవల పశువులలో జాడ్యములు ప్రబలమైనంతగా పూర్వమెప్పుడుగాని లేకపోవుటచేతను, ముఖ్యముగా ప్రతిసంవత్సరము చీడలవల్ల అమితముగా పశునాశముకలుగుచున్నదని సర్కారువారికిఁ దెలిసి ఆవిషయమై వారుశ్రద్ధపుచ్చుకొనుటచేతను ఇట్టిగ్రంథము బహుఅగత్యమని నాకుఁ దోచుచున్నది.

క్యాటిల్ యిన్స్పెక్టర్లు తమపనులుచక్కగా నెరవేర్చుకొనుటకొరకు కావలసినసహాయము పశువులస్వంతదారులవలన పొందుటకుకూడా కొంతఅగత్యమైయున్నది. పసులకాపరులు తమపశువులు జబ్బుగానుండు వయినముగాని సుఖముగానుండువయినముగాని, చీడలుఆరంభమైనవెంటనే ప్రబలముగానివ్వక వానిని ఆపుటకు వలయుసన్నాహముల నెఱిగిచెప్పగలిగిరేని అంతటంతటనే అట్టిజాడ్యములను మనస్వశక్తిమీరిపోనివ్వక పూర్ణముగా స్వాధీనపరచుకొనవచ్చును.

పశువులకు తఱుచుగా సంభవించి కొన్నిసమయములందు బహువినాశముగలుగజేసెడి జాడ్యములగురించి ప్రతిగ్రామముయొక్కగాని జిల్లాయొక్కగాని అధికార్లున్ను, పశువులఖావందులున్ను, కొంతగుర్తెఱిగియుండుట యుక్తమనితోచి యీగ్రంథమునువ్రాసితిని.

పశువినాశమును ఆపుట మనతరముగాదని యూరకుంటకంటె వానికిమేతపేయుట, నీడను ఆపాదించుట, శ్రద్ధగలిగి వానిని కాపాడుటమొదలగు అంశములగురించి యీక్రిందవ్రాయబడు నిబంధనలను విడువకఅవలంబించుట మహాఉత్తమము. ఏలననగా, సంరక్షణలోపముచేత జాడ్యముకలుగుననియు చక్కగారక్షింపబడినపశువులు సుఖముగానుండుననియు స్పష్టముగాదెలియుచున్నది.

మనముశ్రద్ధపుచ్చుకొనవలసిన అంశములురెండుకలవు. అవియెవ్వియనిన—మొదటిది. జీవజంతువులకు మంచిమేతను, నీరును, గాలినిచక్కగా అమర్చుట. రెండవది. ఇతరజంతువులయొద్దనుండి తమనాటికి జాడ్యముప్రాకని



వ్వకఆపుచేయుట. ఈరెండుఅంశములు చక్కగా జరుగుటకు పైని దిగువ నుదహరింపబడిన నిర్ణయములను ఖావందుశ్రద్ధాగరిష్ఠుడై గమనించవలయును.

1-ది. మేత.——పశువులకు మేతసాధ్యమైనమట్టుకువానికిచాలినదై చొక్కమయి సారవంతమయి సులభముగా దొరుకునదియై యుండవలయును. ఈదేశమందలి పశువులు చాలామట్టుకు పగటిపూటకంచెలయందు లభ్యములగు మంచి కసవును భక్షించి రాత్రికాలములందు ఇండ్లకడ వరిగడ్డిమొదలగుమేత తినును. పశువులకుస్వాభావికజ్ఞానముకలదు. కావునతమకు యుక్తములగు పచ్చికదినుసులనేర్పరచి భక్షించును. అయినను, పచ్చికదొరకని వరుపుకాలములయందు ఆకలిపట్టజాలక చెట్లతొటను, ముండ్లతుప్పలను, విషవంతములగుమొక్కలను తినును. ఇందుచేతనే అజీర్తి, నాము, మొదలగురోగములు కలుగును. వర్షాకాలములయందు ఏరులు చెరువులు మొదలగుజలస్థానములయోరను కలుకుగడ్డి, తుంగమొదలగునవి అద్భుతముగా పెరుగును. ఇట్టిహానికరములగు కసవులమెసవుటచేత పసులకుకడుపునొప్పిగాని గర్భవాయువుగాని అతిసారముగాని కలుగుటయేగాక విషవంతములగు కొన్నితుంగ దినుసులదినుటచే పశువులునాముగొనును. కాబట్టి మేతజాలనిరోషగాని అధికమైనయొశగాని పశువులకు రోగములుసంభవించును. గనుకవర్షాకాలమందును వేసవికాలమందును ఎచ్చుతక్కువలులేక పశువులమేపుట ఖావందులపనియైయున్నది. వేసవికాలమందును కరువుకాలమందును కసవుచిక్కుటదుర్లభము. గనుక పుష్కలముగానుండునపుడు కొంతమోజాతుచేసి యుంచుకొనుటమహాయుత్తమము.

పశువులు తినెడిమేత సరసమైనదిగానుండవలయును. కరకరలాడు నిస్సారవంతములగు పచ్చికదినుసులను కరడుగట్టిన గడ్డిదినుసులను,కంచెలయందుగాని చేమేపుగాగాని తినుటచే రక్తాతిసారము అనువ్యాధిగలుగును. ఈవ్యాధియీదేశమందంతట తఱుచుగా పశువులకు సంభవించునదియే.

వేసవికాలములందు కంచెలలో పచ్చికదొరుకుట దుర్లభమగుటచే ఎడ్లుమొదలగునవి ఆహారనిమిత్తమై బహుదూరము తిరుగులాడి బలముచెడిపోవుటయేగాని అక్కడక్కడతమకుదొరికినదుంపలు, కరకరలాడు పచ్చికదినుసులచేత ఆకలితీరదు. ఇట్లుద్రిమ్మరులాడుటవలన అవివృద్ధిబొందజాలక బలహీనములై అంటువ్యాధులకులోనగుచున్నవి. పశువులలో చీడలుగానుండునపుడు

అసంరక్షితములగు దుర్బలజంతువులకు అట్టిచీడలు అపాయకరములుగా నేర్పడునుగాని సురక్షితములగు వానియందట్లుదోచవని నమ్మవలయును.

2-ది. నీడ.——వేసవికాలమందు మేతకొరకయి పశువులుకంచెలలో పగలంతాకష్టపడి తిరుగులాడుచుకొంత నేపయినను ఆసోదాతీర్చుకొనుటకుగాని నెమరుపెట్టుటకుగాని వ్యవధిలేకపోవుట అటుండగా మధ్యాహ్నకాలమందెచ్చటనయినను యొకచెట్టునీడనగాని వసారాలోగాని పరుండిబడలికదీర్చుకొని నెమరువేయదలచినంతలో ఆకలి యొకకడబాధించును. ఇట్లువ్యవధిలేకపోవుటచే పశువులుజబ్బుపడి పెక్కుజాడ్యములపాలగును. ఎండతగలనివ్వక పశువులనుకాపాడుకొనుటయేగాక చలిగాలికూడాసోకనివ్వకూడదు. "చలిగాలి ప్రత్యేకముగా పెక్కువ్యాధులకు మూలముగాకపోయినను ఉష్ణముగానుండి తటాలునచల్లనౌటయు చలిగానుండితటాలున ఉష్ణమగుటయే రోగములు జనించుటకు కారణమని దృఢముగానమ్మవలయును" పగటిపూట అత్యుష్ణముగాను రాత్రివేళలయందు అతిచలిగాను ఉండెడిమాసములయందేమి, ఉష్ణకాలము వెళ్లగానే చలిఅరంభమయి చెమ్మగానుండుసమయములలోనేమి పలువిధములగువ్యాధులు ఉత్పత్తియగుట మనముచూచుచున్నాముగదా. కాబట్టిపశువులకు చలిగాలి తగలనివ్వక వానలకు తడియనివ్వక కొట్టములుకట్టి సురక్షితముగావానినికాపాడుకొనినయెడ పశునాశములులేక లాభకరముగానుండును. కొట్టములుకట్టుటకుగా తొలుతకొంతద్రవ్యముపట్టును. అయినను అవిసుఖస్థితిలోనుండి చక్కగాపనులుచేసి లెస్సగాపాలిచ్చి కండబట్టియుండుటయే అందుకుపరిహారము. మరియునిట్టిదశగల పశువులు అసంరక్షితములగు పశువులుతినునంత మేత దినజాలవు. ఇదియునొకలాభమేకదా.

3-ది. నీరు.——అంగ్లేయదేశమందు భారవుపశువులఁబెంచెడివారు తమయెడ్లకు యథేచ్ఛముగా నీళ్లుపెట్టకగాని చక్కగాక్రొవ్వుపట్టవనెడి అంశము వారందరకు తెలిసినవిషయము. ఈదేశములో కాలము వరుపగుటచేతనో లేక నీళ్లుదెచ్చి పోయుటకు అక్కఱపట్టకపోవుటచేతనో ప్రాణాధారమగు నీపదార్థము బహుకొఱతయైయున్నది. త్రాగుటకు చాలినంత నీరులేనియెడల తినినమేత అరుగక అజీర్తిగలుగును. మరియు, వర్షాకాలమందు నీరుకుంటల గట్లమీద మొలిచెడిగడ్డి బహునీరుబుగ్గగా నుండుటవలన అట్టిగడ్డి దినిన పశువులకు పొట్టలుబ్బును. సున్నపురాతినేలలయందూరు జలముగాని నోటికి చేదుగానుండు నీరుగాని త్రాగినయెడల కడుపునొప్పి మొదలగు సంకట



ములుగలుగుటయేగాక అట్టిజలమందుండిన సున్నముగర్భములో ప్రత్యేకించి అచ్చట ఘనీభవించును. ఇందు చేతనే పేగులలోరాళ్లు ఉత్పత్తియగును.

వర్షాకాలములందు జలదారులులేని గ్రామములందేమి యితరప్రదేశములయందేమి అక్కడక్కడ చేరియుండిన పెంట వెల్లువలతోటి చెరువులయందు చేరును. ఇట్టినీరు పశువులకు త్రాగనర్హముగాదుగాని క్రియూటలవలన నూతులలోజేరు జలము శుద్ధమైన దగుటచేత అంతగాహానికరము గాదు. చెరువులు జలపూరితములుగానుండు నపుడు అందులోని అశుద్ధవస్తువులు పరివ్యాప్తిజెందినవై చాలావరకు క్రిందికిదిగి పోవును. శీతలకాలము వెళ్లిపోవునపుడును, గ్రీష్మకాలమంతయును నీరుతగ్గిపోయి కొన్నిసమయములలో యెండి బురదనీరుమాత్రమే నిలిచియుండును. ఇట్టినీరు త్రాగుటచే పశువులకు గొప్ప సంకటములు గలుగుట ఆశ్చర్యముగాదు.

4-ది. గవాక్షలు.——పశువులలో చీడలనుకలుగజేయు హేతుభూతములు మరికొన్ని ముందు ముందు వ్రాయబడియున్నను, జీవకోట్లుబుసపెట్టుటకు కావలసిన శుద్ధమగు గాలిని గురించి కొంతవరకు యిచ్చట చెప్పుచున్నాను. జీవరాశికి నీడను ఆపాదించుట క్షేమకరముగాని, పరిశుభ్రమయిన గాలి వచ్చుటకును, అశుద్ధమయినగాలి బయలు వెళ్లుటకును, తగిన ద్వారములులేని ప్రదేశములలో వానిని బిగుంచుట క్షేమకరముగాదు. ఇట్లుబిగించుటచేత అప్పుడయితేనేమి మరికొన్నాళ్లకయితే నేమి తప్పక రోగములువచ్చును. కాబట్టి ప్రతికొట్టమునకు, పశువులు బుసపట్టుటవలన కాగి కల్మషమయిన వాయువు వెళ్లుటకుపైకప్పులోనున్ను, శుద్ధమయిన గాలివచ్చుటకు అడుగు భాగములోనున్ను, చాలాద్వారములుంచవలయును.

కొట్టములలో పేరుకొనురొచ్చు నెలలపర్యంతము అచ్చటనే కుళ్లికంపెత్తి ఆకొట్టములలోవసించెడి పసులకు అసౌఖ్యమును గలుగజేయును. ఇందువలనగలుగు జాడ్యములు కానలెనని మీదదెచ్చుకొనుటయేగాని యితరముగాదు, పశువులకొట్టములు శుద్ధిచేయక ఆలాగేమరికొంతకాలము జరిపినయెడల భయంకరములగు చీడలు మీమందలమీదబడి పాడు చేయునపుడు మీరు అబ్బురపడవలసినదిలేదు.

ఇప్పుడు చెప్పబడిన స్వల్పకారణములవల్ల జాడ్యములు ఉత్పన్నములగుచే

గాక మరియు నొకజంతువు యొద్దనుండి యింకొక జంతువునకు పారెడి రోగములనుగురించి కొంతజెప్పెద. ఇట్టిజాడ్యములు "ప్రాకెడిజాడ్యములనబడును." (Communicable Diseases).

---

ఈజాడ్యములు మూడువిధములుగా ప్రబలమగుచున్నవి.

1-వ. అంటువలన.—అనగా జాడ్యగ్రస్తమగు జంతువును, కానిజంతువును, ఒకచోట గలసినాసరే లేక జాడ్యగ్రస్తమగు జంతువునకు అప్పుడు వాడుచుండిన సామగ్రులను, కానిజంతువునకు వాడుటచేతగాని సంభవించునది. నక్కలు, బోరువలు, గద్దలు, ఈగలు మొదలగునవి రోగమును పుట్టించెడువస్తువులను ఒకచోటనుండి మరియొకచోటికికొని పోవును. మరియు, తోళ్లుకావలసినవారు జాడ్యగ్రస్తములగు జంతువులు వేసినపేడ మొదలగు దానినిపట్టుకవెళ్లి జాడ్యమంటనిపశువులు మేసెడు కంచెలలో చల్లుచున్నారని క్యాటిల్ యిన్‌స్పెక్టర్లవల్ల తెలియవచ్చినది. ఇట్టిక్రూరకృత్యము చేసెడివారు ఫలాని వారని తెలియవచ్చినయెడల అట్టివారిని చట్టప్రకారముదండింపవలసియుండును. అంటుజాడ్యములు, జబ్బుపడిన జంతువులకు మేతనీరుచూచెడి సేవకులమూలముగానేమి, వాటితోటి కలసిపనిచేయుచువచ్చినట్టియు, మేయుచువచ్చినట్టియు సుఖస్థితిలోనుండిన జంతువులమూలముగానేమి, వాటికిచికిత్సచేయబూనుకొను మనుష్యులమూలముగానేమి, జాడ్యగ్రస్తములగు జంతువులనువేసి తోలుకపోబడిన బండ్లమూలముగానేమి, వాటిపేడపడకగడ్డి మొదలగువాటిమూలముగానేమి, జాడ్యమువలనచచ్చిన జంతువులకళేబరముల మూలముగానేమి ప్రబలముగావచ్చును.

చర్మములుకూడాచాలా అపాయకరములు. పలుమారు పశువులలో జాడ్యములుగలుగుట వీటిమూలముగానే. ఈదేశమందలి జంగిలి పేరపు పశువులకు అంటువ్యాధులు ఏలాగు గలుగుననగా—పగటిపూటమేయ దోలబడిన పశువు యితరపశువులలో కలసికొని తనకున్నజాడ్యము తోటిపశువులకుచుట్టబెట్టి వాటిజాడ్యముదాను దెచ్చుకొనుచున్నది. మరియు కొన్నిసమయములలో ఒకగ్రామపశువు పారబడి మరియొకగ్రామపశువులతోకలిసి యీవిధముగాచాలాదూరము తిరుగులాడితుదకు బందెలదొడ్డిచేరి దాని స్వంతదారుడు వచ్చి విడుపించుకొనేవరకు ఆదొడ్డిలో యెండకు యెండి వానకు తడసి చక్కగా మేత అమరక అల్లాడుచుండును. ఇట్టిపారబడిన పశువునకు సరకు



రోగముగాని మరియితరమైన అంటుజాడ్యము తగిలినయెడల ఆజాడ్యము ఆగ్రామములోని యితరపశువులకుకూడా సంభవించి అపారమైనకీడుగలుగజేయును. బందెలదొడ్లు శుభ్రముగానుంచుటయు, సోకుడుపరిహారద్రవ్యములను అచ్చట చల్లుటగాని కాల్చుటగాని గ్రామాధికార్లయొక్కయు పోలీసువారియొక్కయు పనియైయున్నది. మగ్డౌగల్సుపౌడర్ (Macdougals Powder) అనుపొడినిచల్లుటగాని, ఓడకీలుకాల్చుటగాని, పారయెఱ్ఱగాకాల్చి దానిమీద కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid) అనుద్రవద్రవ్యమును పోయుటగాని, గంధకము పొగవేయుటగాని సోకుడు జాడ్యపరిహారములని యెఱుగవలయును. ఇట్లుచేయకపోవుటచే బందెలదొడ్లుబహుకీడుకు మూలమయి యున్నవి. కాబట్టివారివారి పశువులు ఒకకంచెనుండి మరియొకగ్రామకంచెకు పారబడివెళ్లనివ్వక బందోబస్తు చేసికొనవలయును. పరగ్రామపశువులు తమగ్రామములోనికి వచ్చినయెడలఅట్టివానిని తత్క్షణమే బందెలదొడ్డికి తోలించవలయును.

పశువులు దాహము పుచ్చుకొను నీరుతొంకులుకూడా జాడ్యప్రబలమునకు కారణమగుచున్నవి. నీరుతొంకులయొద్ద పశువులన్నియు గుమిగూడి యొకదాని నొకటిముట్టుకొనుచుండుట సాధారణము. మరియు, పశువుల స్వంతదారుడు అజ్ఞానముచేనేమి, తనపశువులు రోగపీడితములయియున్నవయినను క్యాటిల్ యిన్‌స్పెక్టరుగారికి తెలియనివ్వక మరుగుపెట్టదలచి వాటిని పగలంతయు నీటిలోనుంచుచున్నాడు. ఇందువలన తనకు చెరుపేగాని తనపశువులు సుఖస్థితినిబొందజాలవు. ఇదిగాక, పశువులు రాత్రికాలమందు గ్రామములోనికివచ్చినపుడు ఖావందులు వాటిని దొడ్లయందైనను తామువసించెడియిండ్లలోనొక భాగమందైనను బిగించుటచే నూపిరాడక కదలమెదలనేరక రోగపీడితములయిన పశువులును కానిపశువులును ఒకదానినొకటిముట్టుకొనుచు అచ్చటమెలగుచుండును. మనుష్యులు వసించెడి యిండ్లలో వారి పశువులను రాత్రికాలమందుంచుకొనుట యీదేశమందు సర్వసాధారణమయిన వాడుకయయి యుండుటచే యిది సరికాదని కఠినముగా జెప్పజాలను. ఇట్టివాడుకచే మనుష్యులకును పశువులకును దేహసౌఖ్యము చెడుటయేగాక కొన్ని అపాయకరములగు పశుజాడ్యములు మనుష్యులకు, ముఖ్యముగా స్త్రీలకును బిడ్డలకును తగులును.

ఈదేశమందు పశువులను సంతలకేమి, దుకాణములకేమి, విక్రయమునకే

మి, రస్తామార్గమున ప్రయాసకరములగు నిడుదప్రయాణముల తోలుకపోవుదురు. అవిమార్గమందెచ్చటేని జబ్బుపడినయెడల ఆప్రోవనడ్డపడు జంతువులకున్ను తాముచేరిన సంతయందుగాని దుకానమందుగాని యుండునట్టిజంతువులకును తమజాడ్యమును చుట్టబెట్టును. మీదుమిక్కిలిగా యిట్టిస్థలముల లోనుండి కొనిపోబడిన జంతువుల మూలముగా ఆజిల్లాయందంతట నీజాడ్యము ప్రబలమగును.

పశువులనుతీసుకవెళ్లుటకుగా నిర్ణయమైయుండు పొగబండితొట్లను మిక్కిలి శుచిగానుంచవలయును. అంటుజాడ్యసంబంధమైన పూర్వశేషమున్న యెడల తదనంతరము ఆతొట్లలోకొనిపోబడు పశువులు మేత నీరు అమరకల్పించియుండుటచేత అట్టిజాడ్యములకులోనగును.

పసులకాపరుల అజాగ్రతవల్లను, అజ్ఞానమువల్లను, సోమరితనమువల్లను, అంటుజాడ్యములు ముఖ్యముగా ప్రబలమగుచున్నవి. ఇట్టిజాడ్యములు ప్రబలముగానివ్వక అపుటకయితగిన ఉపాయములు మేము చెప్పగలము. పశులఖావందులు తమపశువులనురక్షితముగా నుంచుకొనుటకై వలయుసహాయముచేయమనేగదా సర్కారువారుమమ్ములపంపించియున్నారు. గనుక పశువులస్వంతదార్లురోగనివారణ విషయమైయెట్లుచేయవలెనో తమకు తెలియదనిచెప్పి తప్పించుకొనుటకు ఇకనువీలులేదు. ఎవరుపశుజాడ్యనివారణకొరకయి తమకుదోచినయుపాయముల పన్నక అశ్రద్ధగాగాని సోమరితనముగాగానియుందురో అట్టివారు శిక్షకుపాత్రులగుచున్నారు. పశువులకేజాడ్యములురానివ్వక రక్షించినానిఖావందులకు నష్టములేకుండాచేయుటకేగదా పశుజాడ్యములనుగురించి శాసనమొకటి పుట్టియున్నది.

2-వ. సోకుడు.——అంటుజాడ్యమునకంటె సోకుడుజాడ్యమును గడచుట బహుదుస్తరము. ఇదగాలిమూలముగా నొకచోటనుండి మరియొకచోటికిగొనిపోబడునదిగాని జాడ్యగ్రస్తములయిన జంతువులను ఆసంబంధమయిన పదార్థమును ముట్టుకొనుటచేతనే గలుగునదికాదు. క్యాటిల్ యిన్‌స్పెక్టర్లురోగముతగిలిన పశువులను తగలనిపశువులను వెవ్వేరుగానుంచవలయునని ఖండితముగాజెప్పుట మీకు విచిత్రముగాదోచునుగదా. ఏలననగా గాలిమూలముగానేమి మరియితరమార్గముగానేమి కొన్నిజాడ్యములు కొంతదూరమువరకు వ్యాపించుచున్నవనుట అనుభవసిద్ధము. రోగముతగిలిన పశువులుండెడుప్రదేశము



యొద్దనుండి తగలనివాటికి గాలివాటము తప్పించి 500 గజములదూరముంచుటక్షేమకరము.

3-ది టీకా.——టీకాలువేయుట మీరుపలుమారుచూచియున్నారుగదా. టీకావేసెడిపాలు ఆవులకు సంభవించెడు ఒకవిధమయినజాడ్యమువల్లనుత్పత్తియయినది. అట్టిపాలు మనుష్యులదేహములోనికి యెక్కించుటవల్ల వారికికూడాకలుగునది ఆజాడ్యమే. గనుకకొన్నిజాడ్యములు అంటువల్లగాని సోకుడువల్లగాని సంభవించవుగాని టీకామూలముగా సంభవించును. టీకామూలముగా గలిగెడుజాడ్యములలో ముఖ్యమయినవిమూడు. అవియెవ్వియనిన. పశువులకుసంభవించెడు దొమ్మ, గుఱ్ఱములకు సంభవించెడి అశ్వక్షయ, కుక్కలకుసంభవించెడి వెఱ్ఱి. ఇంచుమించుగా ప్రాకెడుజాడ్యములన్నియు వానిపూర్ణదశయందుండునపుడు టీకామూలముగా నితరప్రాణులకుసంభవించునవి. దొమ్మరోగమువల్లను (Anthrax), అశ్వక్షయవల్లను (Glanders), చచ్చినట్టి మృగములను ఛేదించునపుడు చేతిమీదవెల్లడి యయిన గాయముండినయెడల అట్టిగాయముగుండా యీరెండుజాడ్యములు మనుష్యులదేహమందుజొచ్చును. మరియునీవిషము గాయముమూలముగా దేహముచొచ్చుటేగాక ముక్కులోనేమి, కంటిలోనేమి, నోటిలోనేమి, యుండునట్టి పలచని పొరలమూలముగా కూడాయెక్కును.

శ్రద్ధగలిగి సుఖస్థితివిషయమయినమార్గముల మీరినడచుకొనక అంటుసంబంధమయినట్టియు, సోకుడుసంబంధమయినట్టియు జాడ్యములను అపుటకయి విధింపబడియున్న నిబంధనలచొప్పున జరుపుకొనినయెడల యెట్టిజాడ్యములయినను తలయెత్తజాలవని తెలియవచ్చెనుగదా. కాబట్టి యెవ్వరేని తమపశువులదేహసౌఖ్యమును రక్షించుకొనుటకై చెప్పబడిన యీపద్ధతులను అసడ్డచేసిరేని అట్టివారు తమగొడ్లనన్నింటినిబోగొట్టుకొని మీదుమిక్కిలిగా చట్టప్రకారము దండార్హులగుదురు.

---

# 2-వ

# అధ్యాయము.

రోగములు - చికిత్స

ఏజంతువైనను తనస్వచేష్టలను స్వరూపమును విడిచి మరియొకతీరుగా కనుపడినయెడల అట్టిజంతువునకు దేహమందెద్దియో కొంతజబ్బు ఉన్నట్టు గ్రహింపవలయును. పసులకాపరిగాని, గొల్లవాడుగాని, తెలివిగలవాడేని తత్క్షణము ఆజబ్బు ఎట్లుగలిగెనో తెలిసికొని అందుకు ఏమిచేయవలయునో అట్టిప్రయత్నముచేయ బూనుకొనును. పశువులు కులాసాగా నుండునపుడు మందలలో కలసిమెలసి యథేచ్ఛగా మేతమేసి కాలమెఱిగి నెమరు పెట్టుచుండును. కన్నులు కాంతి సహితములయి నిర్మలములయి యుండును. మిడిచూపుచూడవు. చెవులు మాటి మాటికి ఆడించుచుండును. ముక్కులు ప్రపసహితములుగానుండును. మూతిచెమ్మగలిగియుండును. చర్మము మృదువుగాను శుభ్రముగాను, మీదివెండ్రుకలు చర్మము మీద పడుకొనియుండును. మరియు ఒకదానినొకటి నాకికొనును. కాలోచితముగా పేడవేయును. ఆపేడముట్టిచూచినయెడల కొంచెము మెత్తగానుండును. నిరాటంకముగా ఉచ్చపోయును. సర్వాంగములు శుభ్రముగాను స్నిగ్ధములుగాను ఉండుటయు, నడకయందేమాత్రము కుంటులేకుండుటయు, మొదలగు లక్షణములు సుఖజీవితమును తెలుపునవి. ఎద్దియేని యొకజంతువు మందముగాను, భారముగాను తోచి మందలోనుండక ప్రత్యేకముగావెళ్లి కఱుకు చర్మముగలిగి నల్లకప్పవేసికొని యుండెనేని అట్టిజంతువు తప్పక జబ్బుగొనినదని యూహింపవలయును. కొమ్ములువేడిగాను ముక్కుయెండి, మూతిమీదచెమ్మలేక యుష్ణముగానున్నయెడల అట్టిపశువునకు జ్వరమువచ్చినట్లు భావించవలయును. మరియుజ్వరముతగిలియున్నపుడు మూత్రము పసిమివర్ణముగలదై కొంచెము కొంచెముగా వచ్చును. పేడ చెమ్మలేక గట్టిగానుండుటయును, పశువుమేత అంటక మిక్కిలి దాహముగొని యుండుటయును గలిగియుండును. "సోకుడు జాడ్యములు మొదలగు అపాయకరములగు సంకటములయందంతట జ్వరము తొలిచిహ్నము గనుక జ్వరముతగిలియున్నదా లేదాయని తెలిసికొనుట మహా



ముఖ్యము." దేహమందెక్కడేనియు నొకభాగము ఉబ్బిగాని మరియొకరీతిగా రోగపీడితమయియుండి అందుచేతజ్వరము గల్గెనేని అట్టిభాగము "వాపు" అనివాడుదురు. ఏభాగములు వాచియుండునో అట్టిచోటు ఎఱ్ఱబారి, వెచ్చనై మెత్తగానుండి కదిలించుటకు కష్టతరమయి యుండును. ఇవి వాపులక్షణములు.

చికిత్స రెండువిధములు- అటంకచికిత్సయనియు, స్వస్తచికిత్సయనియు. జాడ్యముసంభవించిన తదనంతరము కుదుర్చుకొనగలమని నమ్మియుండుటకంటె జాడ్యోత్పత్తికారణములగు వస్తువులు తమపశువులకు సమీపమందు లేకుండునట్లుజేసి వానిని సురక్షితముగ నుంచుకొనుటకయి తగుప్రయత్నములబూని రోగము రానివ్వక ఆపుజేసికొనుట మహాశ్రేష్ఠము. నిస్సారమైన మేత, అశుద్ధవాయువు, కల్మషసహితమైననీళ్లు, అతిపాటు చేయించుట, అంటు జాడ్యముల పాలుచేయుట, మొదలగునవియే హానికరములగు జాడ్యములకు మూలకారణములని యింతకు పూర్వమే చెప్పబడెను.

సాధారణములగు జాడ్యములకును టీకామూలముగా దేహము లోనికి ఎక్కుడివ్యాధులకును తగు చికిత్సప్రత్యేకముగా వ్రాయబడును. తమపశువులను శ్రద్ధతోటి వేళకు మేతయు నీరును పెట్టి కాపాడుకొనువారలు సాధారణములగు రోగములు వాటినంట నివ్వక ఆపుకొననేర్తురు. "ఎప్పుడయినను తమపశువులు తినెడు మేతగాని, వసించెడు కొట్టముగాని మరియితరమయిన దెద్దియేని మార్చవలసి వచ్చెనా తోడనే అట్లుచేయక క్రమక్రమముగాజేయవలయును." వెంటనేఅట్టిమార్పులు జరిగించుటచే పలుమారురోగములకుకారణములగుచున్నది. పశువులకుమంచిమేతపెట్టి, నీడనేర్పరచుట మహానయమయి శ్రేష్ఠమయియుండునుగానివాటియెడ అసడ్డచేయుటమేలుకాను. పశువులచే కాలోచితముగా పాటుచేయించుటయు వానికి మేతవేయుటయు నీడను ఆపాదించుటయు, మహాశ్రేయస్కరములు. ఎప్పుడైననొక ప్రాణి తనసహజప్రవర్తనవిడిచి మరియొకలాగున కనుపడినయెడల అట్టిప్రాణిని చక్కగాపరిశీలించి జాగ్రతగాపోషించుట ధర్మము. "ఏలననగా రోగము దేహమందు పూర్ణముగానాటుకొని కీడుచేయబూనుటకు ముందేదానికి చికిత్స చేయనుద్యోగించుటమహాదొడ్డబుద్ధి." జాడ్యమెంతస్వల్పమైన దైనను స్వల్పమని అశ్రద్ధచేయకూడదు. మోరకౌల (Pleuro-Pneumonia) అనుభ

యంకరమగు జాడ్యము ఆరంభదశయందు మంచువలెవచ్చి అంత్యమునకొండవలె నేర్పడుచున్నది. చికిత్సయనగా పనికిమాలినమందులుతెచ్చి పశువుగొంతులో పోసిపోసి దానినిచంపుటగాదు. పశువును నిమ్మళముగా నొకచోటనుంచి దానిని జాగ్రతగా పోషించుటయే ఘనమైనచికిత్స.

పోషణ.——(I) ఈక్రిందజెప్పబడు అంశములలో శ్రద్ధపుచ్చుకొని రోగపశువునకు సౌఖ్యముగలుగజేయుటే పోషణయనబడును.

(1) మేత.——తేలుకయి సులభముగా జీర్ణమయ్యెడిదయి, చక్కగాతయారు చేయబడినదయియుండవలెను. అట్టిమేతనుపశువు తనకిష్టమైనప్పుడు తినునట్లుగా నొకప్రదేశమందుంచవలెనుగాని బలవంతముగాతినుపించకూడదు.

(2) నీరు.——పలచనిగంజినీళ్లనుగాని, లేకమంచినీళ్లలోకొంచెముసూరాకారపు ఉప్పుకలిపి ఆనీళ్లుగానిరోగికి అందునట్లుసమీపమందుంచవలయును.

(3)నీడ.——రోగినియొకవసారాలోగాని, తోటలోగాని, లాయములోగాని, లేకమరియితరమగునీడగల ప్రదేశమందుంచవలయును. కొన్నిసమయములలో రోగికి కప్పుటకు గొంగడికూడాకావలసివచ్చును.

(4) శుచిత్వము.——రోగియుండువసారావెచ్చగాను శుద్ధమయిన గాలివచ్చునదిగా ఉండవలయును. మరియు వసారా శుభ్రముగానుంచవలయును. ఇట్లుచేయనియెడల జాడ్యముబలిష్ఠమగును. ఇదియునుగాక రోగికిగాయములున్నయెడల అట్టిగాయములనుండికారెడు చీముమొదలగుదానిని, కట్టుగుడ్డలను, తీసిపారవేయుచుండవలయును. అచ్చట దుర్వాసనయున్నయెడలసోకుడుపరిహారద్రవ్యముల జల్లవలయును.

(II) ఔషధములిచ్చుటయు, కట్లు, * పోల్టీసులుకట్టుటయు మొదలగునవి డాక్టరుగారి యుత్తరవుప్రకారము జరుపుకొనుటబహుముఖ్యమయినది. చికిత్సకుడు సమీపమందు లేనియెడల యిప్పుడుచెప్పబొయ్యెడు కొన్నిసులభమయిన పద్ధతులననుసరించి స్వంతదారుడే చేయబూనుకొనవచ్చును. పోషణవిషయమయి యెంతమాత్రము లోపము జరుగకూడదు.

* పిండిముద్దఉడకబెట్టిగాని పచ్చిదిగాగాని కురుపు గాయములకు కట్టుట.



ప్రాణికోట్లయొక్క దేహసంబంధములగు నానాభాగములగురించి యీగ్రంథముచదువువారలకు అంతగా తెలియకపోవుటచేతను, ఆభాగములయొక్క ప్రయోజనములు బొత్తుగా తెలియనందు చేతను, వాపుజాడ్యములన్నింటిని విశదముగా యిచ్చుటదెల్పుటకు సాధ్యపడదు. అయినను, పలుమారుసంభవించెడి హానికరములగు కొన్నివాపుజాడ్యములను, తక్కినయితరజాడ్యములను వాటిలక్షణచికిత్సలతోటి యికవ్రాయనగుచున్నవి.

పాలశెల——(Garget).పొదుగువాచియుండుట పాలశెలయనబడును. దెబ్బతగులుటచేతగాని, పాడిఆవును చలిగాలిలోనుంచుటచేతగాని, గొప్పవానలకు తడియుటచేతగాని, ఆవునువిక్రయమునకు దుకానముయొద్దకు తోలుకవచ్చిపొదుగుగొప్పదిగాకను పడుటకై పాలునేళకుపిండక నిలవరము చేయుటచేగాని యిదిసంభవించును. ఈజాడ్యము ఆంగ్లేయదేశమందు పలుమారు సంభవించునదిగాని యీదేశమందంతగా గలుగదు.రోగికి జ్వరము తగిలియుండుటయు, వెనకకాళ్లుపంగటించుకొని నడచుటయు, పొదుగువాచి తాకినయెడల మెత్తగాగాని గట్టిగాగాని యుండుటయు, ఒత్తినపక్షమందు పశువునకు నొప్పితగులుటయు, ఈజాడ్యలక్షణములయి యున్నవి. మరియు పిండినయెడ పాలురావు. అథవా వచ్చినను చీము నెత్తురు కలిసియుండును.

చికిత్స.——ఒకఅర్థబుడ్డినీళ్లలో ఒకపౌను(38¼రూపాయలయెత్తు)విరేచనలవణమున్ను (Magnesium Sulphate), యెనిమిదివరహాలయెత్తు శొంఠిపొడిన్నికలిపియివ్వవలయును. వేడినీళ్లతోటిపొదుగును చక్కగాకడుగవలయును. ఒకచట్టెడునీళ్లలో నాలుగుడ్రాములు (నాలుగువరహాలయెత్తు) సూరాకారపు ఉప్పుకలిపిదాహాము పెట్టవలయును.

నాలుకశెల.——(Inflammation of the Tongue).నాలుకకుదెబ్బదగులుటచేగాని, ముండ్లతుప్పలను తినునపుడు నాలుకచీలుటచేగాని, యీవ్యాధిగలుగును. జ్వరముఆరంభమయి నోటివెంట జొల్లుకారుచుండును. దెబ్బతగిలినభాగము ఎఱ్ఱనయివాచి జారియుండును. పశువుమేత తినజాలదు. బహుడప్పికొనియుండునుగాని నీళ్లనుకూడా సులభముగామ్రింగజాలదు.

చికిత్స.——వేడినీళ్లునోటబోసిపలుమారు కడుగుచుండవలయును. పాలశెలసంకటమునకు నిర్ణయింపబడిన మందే దీనికిని ఇవ్వనగును. రోగిచక్కగా

మ్రింగజాలియుండదు గనుక బహుజాగ్రతగానివ్వవలయును. పలచని గంజిచే సిత్రాగించుట మేలు.

పక్కశెల.——(Inflammation of the Lungs). ఈసంకటము చలి గాలిసోకుటచేతను శీతగాడ్పులువీచుటచేతను కలుగునది. ఇదిపాటుపడు పశువులకుగాని, బరువుబండ్లను లాగు పశువులకుగాని పలుమారుసంభవించును. జాడ్యముప్రవేశమయినపుడు బహుతీవ్రమైన జ్వరముగలిగి అతినిష్ఠురముగా దగ్గుచుగుఱ్ఱుగుఱ్ఱుయనిబుసపెట్టుచుండును. పడుకొనియుండ నిచ్ఛయేగాని నిలువబడియుండవాంఛ యుండదు. శ్వాసోత్పత్తియగు అంగములకుపలువిధములయిన వాపుసంకటములు సంభవించుచుండునుగాని పశువులస్వంతదార్లువాటిని వివ్వేరుగ దెలియవలయునంతటి అక్కఱయుండదు. అయినను సాధారణముగాజెప్పబడు నురుగుదబ్బలరోగము (Lung Disease) అనునది పశువులకేగాక ఇతరప్రాణులకు సహితముఅంటునదియై మిక్కిలి అపాయకరమయి యుండుటజేసి సాధారణముగా పక్కశెల యనిమాత్రము తెలిసియుండుట చాలును. పక్కశెలకును నురుగుదబ్బలరోగమునకును గలతారతమ్యము ఇకముందు వివరింపబడును.

చికిత్స.——రోగినివెచ్చగానుండు క్రొత్తపాకలోనుంచి వేడినీళ్లతోటి ప్రక్కలుకాచి శైత్యమంటకుండునటుల నొకబట్టచే తడియార్చవలయును. మరియు వలసినయెడ ఆవాలపట్టు అయినను వేయవచ్చును.

| | | |
|---|---|---|
| సూరాకారము | నాలుగువరహాలయెత్తు | |
| మిరియాలు | ఎనిమిదివరహాల ,, | |
| శొంఠి | ఎనిమిదివరహాల ,, | |
| నేలవేము | ఎనిమిదివరహాల ,, | మెత్తగాఖల్వము |

లో నూరి బియ్యపుగంజితోటి ప్రతిదినము యివ్వనగును.

అతిసారము.——(Diarrhoea), రక్తాతిసారము.—(Dysentery). ఇవిపేగులలోని వైకల్యమువలన గలిగెడు రెండువిధములగుజాడ్యములు. ఈరోగములు సంభవించినపుడు పేడ నీళ్లునీళ్లుగానుండును. శుద్ధఅతిసారమందు పశువు పారుకొనుచుండును. రక్తాతిసారమందు మలముతోటి నెత్తురు పడుచుండును. ఈరోగము మేత స్వారస్యము తప్పుటచేతను, బలహీనముచేతను, చలిగాలితగులుటచేతను, మృదుతరమగుమేత మేయుచుండి అదితటాలునమాని కరకరలాడు కసవుదినుటచేతను తటస్థమగును, మంచిమేతదొరకని వేసవికాలములయందు ఆకలిబాధ బట్టచాలక యెండి పనికిమాలిన గడ్డిగేదములభక్షించుటచే రక్తాతిసారము అట్టికాలములయందే సంభవించుట ప[illegible]మారుమనము చూచియున్నారము. ఈజాడ్యమందు జ్వరముఅంతగా దోపదుగాని పశువు నానాటికికృశించి శల్యమైపోవును. పారుకొని వెనకకాళ్లు అసహ్యములుగానుండును. చర్మము బిరుసెక్కి సౌఖ్యముచెడి యెండి బిఱ్ఱుగానుండును. బాధకునోర్వలేక కొన్నిసమయములందు పడుకొనును. పారునపుడు వెన్నుముడుచుకొని పండ్లుగొరుకుచుమూలుగును. పురలోరక్తము కలసినిలువ నింపుగాని కంపువేయును. చర్మముమీద ఈపి పేనుపట్టియుండును. ఇట్లుండి క్షీణించిక్షీణించి అన్యాయపుచావుజచ్చును.

చికిత్స.——(1) మొట్టమొదట అర్ధబుడ్డినువ్వునూనె త్రాగించవలయును. తర్వాత సీమసున్నము, ఇంగువ, నేలవేము, చెఱకుబెల్లము, ప్రతిదినును నాలుగు వరహాలయెత్తుచొప్పున యివ్వవలయును.

(2) ఒకఅర్ధబుడ్డి చిట్టాముదములో ఒకవరహాయెత్తునల్లమందుగాని యిదిదొరకనియెడల నాలుగువరహాలయెత్తు గంజాయిఆకుగాని మిశ్రమముచేసియివ్వనగును.

గొంతుపట్టు.——(Choking). పశువులు తోళ్లముక్కలు ప్రాతచెప్పులు, గుడ్డపేలికలు గొంగడితునకలు మొదలగు తినరానివస్తువుల నందికొనిబహుతమకముతో భక్షించును. ఇట్టివస్తువులు సులభముగా మ్రింగనలవడక ముద్దగానేర్పడి గొంతునబడును. కొన్నిసమయములందు కఱుకయి ముండ్లుగలిగిన పదార్థములు సహితము గొంతునబడుటచేత తిన్న మేత నిరాటంకముగ గర్భములోనికి బోనొపదు. త్రాగుటకు చాలినన్ని నీళ్లులేకపోవుటచేనేమి, రంనా, కర్బ్భి అను హిందూస్థాని పేర్లుగల నిస్సారమగు లావుగడ్డిదినుటచేనేమి గొంతుపట్టుకొనును. అంతటపశువు నోరుదెరచుకొని జొల్లుగార్చుకొనుచుండును. మ్రింగబూనునుగాని మ్రింగజాలదు. ఆవెంటనోలేక మరికొంత సేపటికో కడుపులో గాలిచేరి పొట్టయుబ్బును. ఒకప్పుడు ఎడమవైపున మెడకొంతవాచిపశువుబహుతొట్రుపాటు గలిగిబాధపడుచుండును. ఇట్టిలక్షణములన్నియు దోచినపుడు ఒకబెత్తము చేత బుచ్చుకొనిగొంతులోనికి జొప్పించినయెడల కొంతవరకే వెళ్లునుగాని గర్భములోనికి వెళ్లదు.

చికిత్స.——ఒకబెత్తముగాని లావయినగట్టి పగ్గముగాని చేతదీసికొని చక్కగా ఆముదముపూసి గొంతులో సహితము ఆముదముపోసి మెల్లగ

గొంతులో జొప్పించి అడ్డపడి యుండు వస్తువును కడుపులోబడ నెట్టవలయును. అట్టివస్తువు కదలనియెడల ప్రక్కనుండి చేతివ్రేళ్లతోబట్టి పగల్చవలయును; అట్లుఅడ్డపడియుండు సమయమందు ఔషధము పోయకూడదు. అడ్డు లోపలికేని బయటికేని వెళ్లినదని తెలిసినపిమ్మట బడలిక నివారణకొరకయి మాటిమాటికి అర్ధబుడ్డి సారాయములో శొంఠిపొడి నాలుగు వరహాలయెత్తు చేర్చి అర్ధబుడ్డి నీళ్లలో కలిపి త్రాగించనగును.

ఊదుమట్టలు లేక కడుపుబ్బు—(Hoven or Blown). ఎద్దియేని గొంతున బడినపుడు ఈలక్షణ మగపడును. మరియు నీరుబుగ్గగనుండెడు లేత పచ్చిక మితముతప్పి తినుటచేగాని బహుకాలము మేతలేకుండి యొకనాటికి దొరికనేని యాతురముగ దినుటచేగాని యీసంకటము కలుగును. దుర్బలపరచెడి వ్యాధులయందును విషవస్తువులు తినుట చేతను సహితము ఇది సంభవించును. ఎద్దులు గొఱ్ఱెలు మొదలగు నెమరు వేసెడి మృగములు తిను ఆహారవస్తువులు పెద్దపొట్టలో (Rumen) మ్రగ్గుటచేత గాలి పుట్టి కడుపు పొంగును. ఇట్టి సంకటముగలప్రాణి బహు కష్టతరముగా బుస పెట్టును. (ఈవ్యాధివలన చచ్చెడు ప్రాణులు ఊపిరాడక మృతిబొందును గాని యితరముగాదు) మూతి ముందుకు చాపును. తనకుగల బాధను తొలిగింపమని అభినయించుచూపుగలిగి యెడమ వైపున పొట్ట భేరివలెనుబ్బి యుండును. అట్టియుబ్బుమీద వ్రేలితోవాయించిన యెడల డండం అనిశబ్దించును. కొన్నిసమయములందు పశువులు ఆతురముగా అమిత తిండి తినును. అప్పుడు సహితము కడుపు కొంచెముగా నుబ్బియుండునుగాని డండం అనిశబ్దించదు. మరియు అంతగా నొప్పియు నుండదు. ఊదుమట్టలే పలుమారు పశువులకు సంభవించునది.

ఎద్దులకును గొఱ్ఱెలకును నాలుగు పొట్టలు గలవు. వానిలో నొకటి పుస్తకములో పొరటలుండునటుల పొరలు గలిగియుండును. దీనినే "అరల పొట్ట" యనివాడెదరు. తిన్నమేతయీపొట్టలో నిలిచి ప్రాణులకు బహుసంకటమును నొప్పిని గలుగజేయును. అంతట ఆప్రాణి దీనదశకువచ్చి కొసి కొసి యనిదగ్గుచుండును. ఇట్లుండుటచేత ఇది నురుగుదబ్బలరోగమని విభ్రాంతి పడుదురు. ఏజంతువేని నిజముగా నురుగుదబ్బలరోగము చేతనే బాధపడుచుండినను జాడ్యస్వభావమిట్టిదియని నిర్ణయించుట కష్టతరము. అట్టి



జీవి జీవాన్నంతరము ఛేదించి చూచినమాత్రనే జాడ్యమును నిదానింపనగును. నురుగుదబ్బలరోగమని నిదానింప బడినయెడల ఆజాడ్యము వ్యాపకముగాకుండునటుల తగుబందోబస్తు చేయవలయును. నురుగుదబ్బలరోగమందు సహితము పశువులు దగ్గునుగాని కుక్షిజాడ్యములందు దగ్గినట్లుతఱుచుగాదగ్గవు. పశువులు కొన్నిసమయములందు సూదులు, కమ్మితునకలు, గట్టిముండ్లు మొదలగు వాడియగువస్తువుల మ్రింగును. అవి కడుపులోనుండి కందనగాయ (Heart. రక్తకోశము-హృదయము) లోప్రవేశించి పక్కశెలలోగలిగెడి లక్షణములనేచూపి జీవికి మరణమాపాదించును.

చికిత్స.——ఈజాడ్యము కొన్నిసమయములందు బహుశీఘ్రముగ ప్రాణికి ప్రాణాంతము గలుగజేయును. కాబట్టి ఔషధము సమీపమందు దొరకనియెడల వాయుపూరితమై యుండుటచే పొట్టయుబ్బియుండునుగనుక నొకపేనాకత్తి తోటి ఆస్థలమందు చిన్నద్వారము చేసినపక్షమందు ఆద్వారమునుండి లోపలివాయువు ఉస్సురయని బయలువెడలిపోవును. అంతట పశువునకు కొంత నిమ్మళము గలుగును. కత్తితోటి ద్వారముచేయబడినప్రదేశము గాయముగ భావించి చికిత్స చేయవలయును.

నంజు, లేక ఉబ్బు.——(Dropsy) రక్తములోని నీరు చర్మము క్రింద చేరి యచ్చోటనే నిలిచియుండుటవలన నీజాడ్యము కలుగుచున్నది. రొమ్ము, కడుపు ఈజాడ్యమునకు ముఖ్యస్థానములు. ఇది దుర్బలమువలన గలుగునది. వేసవికాలమందు మేత చక్కగ నమరక పశువులు డస్సియుండి మీదుమిక్కిలిగ తటాలున శీతలకాలము వచ్చుటవలన దేహపటిమ చెడుటచేతను, వర్షాకాలమందు నూతనముగ చిగిరించి నీటిమయమయి యుండెడు పచ్చికదినుసులను తినుటచేతను పలుమారు నీవ్యాధి సంభవించును. కాళ్లుగాని, రొమ్ముమీదగాని, దవడక్రిందగాని, కడుపుమీదగాని, యుబ్బియుండి, నోరును, కండ్లును పాండువు పారియుండుటయు, విరేచనములగుటయు, కాళ్లుచక్కగ గదిలింపజాలక యుండుటయు, చర్మము కరకరలాడుచు ఎండియుండుటయు, వెంట్రుకలు రాలిపోవుటయు, మొదలగు దుర్బలలక్షణములు కలిగియుండును. గొఱ్ఱెలకు నీవ్యాధి కలిగినప్పుడు పొట్టమీది చర్మ

ముక్రింద గౌరవర్ణముగల నీరుచేరియుండి బొచ్చురాలిపోవుట ముఖ్యమగు చిహ్నములు.

చికిత్స.——సూరాకారము నాలుగువరహాలయెత్తు.

| | |
|---|---|
| అన్నభేది | ఒకవరహాయెత్తు |
| నేలవేము | ఎనిమిది వరహాలయెత్తు |
| శొంఠి | నాలుగువరహాలయెత్తు మెత్తగాపొడిచేసి |

యివ్వనగును. బలకరమగు మేతబెట్టవలయును.

ఎండదెబ్బ, లేక తలపిడుగు.——(Sun-Stroke) ఇది యొకవిధమగు మెదటివాపు. బహుతీక్ష్ణమగు యెండయందు చాలసేపు ఉండుటవలన గలుగునది. అత్రిపట్టెడ మెడకు బిఱ్ఱుగ గట్టి పగటిపూటంతయు యెఱ్ఱని యెండలో పాటుచేయించబడెడు ఎద్దులకు ముఖ్యముగ నీజాడ్యము సంభవించును. మెదటి సంబంధులగు పలురోగములయందు లక్షణములు పలువిధములుగ నుండును. అయినను అడ్డులేక కోరినవైపునకు పరుగు- లెత్తుటయు, తీవ్రమయిన జ్వరము గలిగి కన్నులు జొత్తువారి యుండుటయు, లేదా, దేహము మరచి కదల మెదలక కష్టతరముగను తేలుకగను బుసపెట్టుచుండుటయు, ముఖ్యలక్షణములు.

చికిత్స.——ఉద్రేక కారులగు మందుదినుసులను (Stimulants) ఇచ్చుచు, ఘాటుగా భేదికి ఔషధము ఇవ్వనగును. తలపయిన చలినీళ్లుమాటిమాటికి జల్లుచుండవలయును.

చచ్చువాయువు.——(Paralysis) ఈరోగము గలిగినప్పుడు పశువు తనకాళ్లనుగాని మరిదేహమందలి యేభాగమునేని కదిలింపజాలదు. మరియు నాభాగమందు స్పర్శజ్ఞానము తప్పియుండును. తలపిడుగు అనెడు జాడ్యమందు రోగి మైమరచి యుండునుగాని యీజాడ్యమందట్లుగాక పశువు తనదేహ మెఱిగే యుండును. సాధారణముగ నీజాడ్యము వెనకటి కాళ్లకు సంభవించును. నడుముమీద దెబ్బతగులుట చేతను, బూజుపట్టిన మేతగాని తక్కిన విషవస్తువులనుగాని తినుటచేతను ఈరోగము ఉత్పత్తియగును



చికిత్స.——పేగులలోనుండెడు కల్మషము వెళ్లిపోవుటకునయి భేదికి నివ్వవలయును. పిమ్మట ప్రతిదినము అన్నభేది, నేలవేము, ఉప్పు ఔషధప్రమాణముగ చాలాకాలము ఇవ్వనగును.

పసిరికలు, కామెరలు.——(Jaundice) ఈరోగము పశువులకు పలుమారు సంభవించునది. జ్వరము గలిగి యుండుటయు, కన్నులలో ముక్కులలో నోటిలోనుండెడు పొరలు పసిమివర్ణముగలవై మూత్రము, చర్మము నలుపుతోకూడిన పసపుచాయగలిగి యుండుటయు నీజాడ్యలక్షణములనియెఱుగునది. ఈరోగము ప్రాణాంతకమయినది గాదు.

చికిత్స.——ఔషధ ప్రమాణముగ విరేచనలవణమును (Magnesium Sulphate) ఇచ్చి మరునాటినుండి నవాసాగరము నాలుగు వరహాలయెత్తు నేలవేము ఎనిమిది వరహాలయెత్తు చొప్పున ప్రతిదినము మూడుపర్యాయములు ఇవ్వనగును. కుడిప్రక్కన గుండెకాయ యుండెడు ప్రదేశము పయిన ఆవాలపట్టు వేయవలయును.

రక్తమూత్రము.——(Hæmaturia or Red Water) కాలేజము (గుండెకాయ) స్వస్థము తప్పుటచే నీజాడ్యము గలుగుచున్నదని చెప్పుదురు. కదుపులలోనుండు పశువులకన్నింటికి నొక్కమాటుగా నీజాడ్యము సంభవించుట గలదు. ఇందుచే నీజాడ్యము బహుశః అంటుజాడ్యమని తలచకూడదుగాని, మందలోనుండు పశువులన్నియు నిత్యకృత్యముగా చాలాకాలమువరకు నిస్సారమయి కరకరలాడు గడ్డిదినుసుల దినుటచే నన్నింటికి నొక్కమాటుగా నీసంకటము ప్రాప్తించునని యెఱుగవలయును. బడలిక, జ్వరము, మూత్రము ఎఱ్ఱగాగాని నల్లగాగానియుండుట యీజాడ్యలక్షణములు.

చికిత్స.——నంజుజాడ్యమునకు విధింపబడియుండు మందే యీజాడ్యమునకును ఇవ్వనగును. ప్రతిదినము అన్నభేది ఔషధప్రమాణముగా నిచ్చుట మహాప్రయోజనకారియయి యుండును.

వాయువు.——(Rheumatism) ఈజాడ్యము ఎద్దులకు ముఖ్యముగా గలుగునది. ప్రాయముతప్పిన యెద్దులకు నీజాడ్యము సంభవించుట సహజము. చలిగాలి తగులుటచేతను, వానకు తడియుటచేతను, పశువునకు చెమట

పట్టెడు సమయమందు చలిగాలిసోకుటచేతను ఈరోగ ముత్పత్తియగును. రోగిచక్కగా నడువజాలక పోవుటయు, వెన్నుపంగక కట్టెవలె నుండుటయు, కాళ్లుముడుచుటకు సాధ్యపడకపోవుటయు, కీళ్లువాచియుండుటయు, జ్వరము గలిగియుండుటయు నీజాడ్యలక్షణములని తెలియవలయును.

చికిత్స.——చక్కగా విరేచనమగునటుల మందివ్వవలయును. జ్వరము తగ్గుటకై వాహాపునీళ్లలో సూరాకారము కలిపిత్రాగించవలయును. ప్రతి దినము ఎనిమిదివరహాలయెత్తు గంధకమును కడుపులోకి ఇచ్చుచు ఏడున్నర తులము యెత్తుకర్పూరము కాగుచుండెడి అర్ధబుడ్డినూనెలో కరగించి వేడి వేడిగా వాచియుండు ప్రదేశముపైన పట్టించనగును.

మావివేయకపోవుట.——(Retention of Fœtal Membranes) మావివేయక పోవుటవలన పశువునకు అపాయముగలుగునని వాడుకయేగాని యిందుచే నేహానియు రానేరదు. కొన్నాళ్లకయినను బయటబడిపోవును. అట్లుకొన్నిరోజులు లోపలనే నిలిచియున్నను ఏమియు చెరుపుకలుగనేరదు. దానిని బయటదీయ దలచిరేని బలవంతముగా లాగకూడదు. అట్లుచేసినయెడ * యోనికమలములోనుండి (Womb) రక్తముకారనారంభించును. లేదా, కమలముతోకూడ జారిబయటబడును.

చికిత్స.——మావికొనకు నొకదారముకట్టి దారపుచివరన యొకస్వల్పమగు బరువు వ్రేలగట్టుటచే క్రమక్రమముగా మావి పడిపోవును.

బాలింతజన్ని.——(Dropping after Calving) ఇదియొకవిధమగు చచ్చువాయువు. చాలాపాలిచ్చెడి ఆవులకును, మంచిజాతిగల ఆవులకును ముఖ్యముగా నీవ్యాధి గలుగును. సాధారణముగా మూడవయీతకుగాని నాలగవ యీతకుగాని యిదిసంభవించును. ఈదేశపు ఆవులకంతగా నీజాడ్యము రానేరదు. అన్యదేశములనుండి యీదేశములోనికి గొనిరాబడు ఆవులకే నీవ్యాధి తటస్థించును.

చికిత్స.——ఉద్రేకకారులగు మందులను (Stimulants) ఔషధప్రమాణముగా మాటిమాటికి నిచ్చుచు జాగ్రతతోటి పోషించ నగును.

* దీనిని పిండకోశమని సహితము చెప్పుదురు.



బొడ్డువుండు.——(Navel-ill) దూడకును తల్లికిని సంబంధమును తెలియజేయు బొడ్డుత్రాడు జన్మకాలమందు చాలకుండా తెగిపోవుటచేతను, దూడలు ఒకదానిబొడ్డు మరియొకటి చీకుటచేతను, తల్లియొక్క క్షయరోగము దూడకు ప్రాప్తించుటచేతను బొడ్డు వీడిపోయి యీసంకటము గలుగును.

చికిత్స.——దూడకు పాలిచ్చెడి ఆవునకు విరేచన లవణమును (Magnesium Sulphate) యిచ్చి దూడబొడ్డు వేడినీళ్లతో చక్కగా కడిగిపటికిపొడి అద్దనగును.

మష్టుపారుట.——(Scour) పెద్దపశువులలో అతిసారమెట్టిదో దూడలలోనిది అట్టిదని యెఱుగవలయును. పాలుత్రాగునపుడు దూడలకు నీవ్యాధి వచ్చినయెడల మష్టుతెల్లగానుండును. పచ్చిక తిన నారంభించినపుడు సాధారణముగా నీరోగముగలుగును. అప్పుడు మష్టు ఆకుపచ్చవర్ణముగానుండును.

చికిత్స.——సీమసున్నము, శొంఠి, మిరపకాయలు, దినుసువారి ఒక వరహాయెత్తు చక్కగాపొడిచేసి బియ్యపుగంజిలో కలిపి ప్రతిదినము ఇవ్వనగును. దూడను జాగ్రతగా పోషించు కొనవలయును.

క్షయ.——(Tuberculosis) ఇదిబహు అపాయకరమైప్రాణోపద్రవము కలుగ జేయువ్యాధి. ఈరోగము పలువిధములుగా సంభవించునది. నురుగుదబ్బలకుగాని పేగులకుగాని, దేహమందలి మరియితర భాగములకుగాని యీజాడ్యమంటి అట్టిభాగములను క్షయింపజేయును. జాడ్యగ్రస్తమగు భాగమందు మీగడవలె చెమ్మగలిగిగాని, జున్నుగడ్డవలె చెమ్మలేకగానియుండు పదార్థము చేరియుండును. ఈవ్యాధి బహు నిదానముగా ప్రబలమయ్యెడి దగుటచేత యిదియొకమరియొక జాడ్యమని చాలామంది విభ్రాంతిపడుదురు. రోగి బహువేగముగ క్షీణించుచుండును. బహుబాధకరమగు దగ్గుసహజముగా గలిగియుండును. ఈరోగముచే బాధపడుచుండెడి జంతువులమాంసమును తినుటచేగాని, పాలుత్రాగుటచేగాని, యిదిమనుష్యులకు సంభవించును. ముఖ్యముగా నీజాడ్యము సంభవించుట పశువుల

కే. అయినను, తఱుచుగా నితరజంతువులకు సహితము కలుగుట గలదు. పలుమారు మంచిజాతిగల పశువులు ఈజాడ్యమునకు లోనయి వినాశము నొందును. మిక్కిలిగాదూడలు ఈరోగమువలన గతించును. కొన్నితరుణములలో విరేచనములు కలిగియుండుటమాత్రమే యీజాడ్యలక్షణమయియుండును.

చికిత్స.——ఈజాడ్యానుకూలమైన ఔషధము ఇంతటివరకు దెలియవచ్చినదికాదు. రోగియొక్క దేహబలము తగ్గనివ్వక సారవంతములగు ఆహారవస్తువులను లోభితనములేక యిచ్చుచు దేహపటుత్వకారులగు మందులనొసగుచుండ వలయును. హానికరమగు నీజాడ్యము మందలయందు లేకుండునట్లు చేయదలచువారు తమమందకు క్రొత్తఆబోతును, ఆవును తెచ్చియుంచుకొనవలయును.

మారశెల.——(Pleuro-Pneumonia) ఈజాడ్యము తఱుచుగా ఎద్దులకు సంభవించును. అట్టియెద్దులయొక్క నురుగుదబ్బలు స్వస్థము తప్పియుండును. ఇందుచేతనే దీనిని సాధారణముగా నురుగుదబ్బలరోగము (Lung Disease) అనివాడుదురు. ఇదిప్రాణోపద్రవము గలుగజేయువ్యాధి. ఈదేశమందు దొమ్మజాడ్యముగాని, సరకుజాడ్యముగాని, గాలికుంట్లుగాని, పలుమారు పశువులకు సంభవించినట్లు ఈరోగము అంతగాసంభవించదు. సామాన్యములగు పక్కశెల, కుక్షిరోగములు మొదలగు జాడ్యములు పశువులకు సంభవించెనేని అవి యీజాడ్యమేనని చాలామంది భ్రమపడుదురు. అనుభవశాలియగువాడు రోగి జీవముతోటి యుండునపుడే జాడ్యముఫలానిదని విమర్శింపగలడు. పక్కశెలయందు గలుగులక్షణములే యీజాడ్యమందును దోచునవి. ఒకలాటి దగ్గుసహితము గలిగియుండును. రోగిబుసపెట్టునపుడు కొసికొసియని దగ్గును, బుస క్రమముతప్పి కష్టతరమైయుండును. ఈలక్షణములు తిన్నతిన్నగా ప్రబలమయి సహజముగా మరణమును ఆపాదించును. శవమును ఛేదించి చూచినయెడల సాధారణముగా నొకప్రక్కనురుగుదబ్బ రోగపీడితమయి వాచి ఆకుపచ్చ చాయగలిగి దుర్గంధ సహితమయియుండును. దానిని అడ్డముగా కోసి చూచినపుడు చిత్రవర్ణములుగల చలవ బంధవలెనుండును. రొమ్ము జలపూరితమయి యుం



డును. నురుగుదబ్బలయొద్దనుండి ప్రక్కయెముకల పర్యంతము గౌరవర్ణముగల దారములుండును. ఈరోగము బహుతిన్నదనముగా ప్రబలమయి చాలాకాలము వేధించును. ఇది మహాసోకుడు జాడ్యము. అయినను ఎద్దులకున్ను, దున్నలకున్ను, లేళ్లకున్ను మాత్రమే సోకునట్లు తెలియవచ్చుచున్నది.

చికిత్స.——ఉద్రేకకారులగు ఔషధములచేతను (Stimulants) మంచి మేతచేతను రోగియొక్క బలముతగ్గనివ్వక కాపాడి అర్థబుడ్డిసారాయములో రెండువరహాలయెత్తు కర్పూరము కరగించి దానిలో ఎనిమిదివరహాలయెత్తు శొంఠిచూర్ణము, అంతయెత్తుసోపు పొడి చేర్చి రెండుబుడ్లగంజితోటి మిశ్రమముచేసి లోపలికి ఇవ్వనగును. ప్రక్కలయందు ఆవాలపట్టువేసి ఒకగంటసేపుంచి పిమ్మట వేడినీళ్లతో కడిగి వేయవలయును. వెంటనేతడియొత్తి ఆర్చవలయును. ఈపట్టుచేత కొంత నిమ్మళించకపోయెనేని మరునాడు సహితము చేయవలయును.

ధనుర్వాయువు.——(Tetanus) ఇదినాడికా (Nerves) సంబంధియయి ప్రాణోపద్రవకారియగు జాడ్యము. గాయములు తగిలియుండునపుడు ఈజాడ్యము ప్రాప్తించును. కొన్నిసమయములందు ఏకారణములచేత నీజాడ్యము సంభవించునో తెలిసికొననైతిగాదు. ఇట్టి రోగాక్రాంతయగు ప్రాణికదలనేరకయుండును. బలవంతముగా కదిలించ జూచితిమా బహుభారముగా కదిలాడును. నోటివెంట నురుగు జారుచుండును. తలను చేతితో మీదికెత్తితిమా తత్క్షణమె పడకుబుట్టియీడ్పులు గలుగును. జాడ్యము ప్రబలమగు కొలది దవడలు కదియబిగిసికొని పండ్లుగిట్టికొనిపోవును. కాబట్టి యేవస్తువుగాని నోట బోయుట దుర్లభము. జ్వరము తీవ్రమై రోగి బహుశీఘ్రముగాడస్సి మృతిబొందును.

చికిత్స.——ఈజాడ్యమునకు ప్రత్యేకముగా అనుకూలమయ్యెడు మందు లేదు. మరియునిట్టిరోగపీడితములయిన ప్రాణులు స్వస్థపడినట్లువిని యెరుగము. నిశ్శబ్దముగా నుండెడు చీకటి పాకలో రోగిని యుంచి గంజి, అన్నరసము మొదలగు ద్రవరూపములగు ఆహారపదార్థములను ఏవిధముగానైనా పెట్టవలయును. ఈడ్పులను (Spasms) నివారించుటకై నల్లమందును గంజాయాకును ఇచ్చి చక్కగా విరేచనమగునటుల ఘాటయిన

మందును ఇవ్వనగును, అథవా రోగము స్వస్థమయ్యేనేని రోగిని "స్థాయిగా నుంచి జాగ్రతగా పోషించుటచే" నట్లయ్యెనని భావింపవలయునేగాని ఔషధమహిమయని యూహింపకూడదు.

## 1. అంతర్గత చీడపురుగులు.

## INTERNAL PARASITES.

కరిదగ్గు.—(Hoose or Husk) ఇది పెద్దదూడలకు సంభవించెడు అపాయకరమగువ్యాధి. సురుగుదబ్బలలోని గాలిగ్రోవులలో కొన్నిపురుగులు చేరుటచేత సురుగుదబ్బలు వాచి దూడలకు బలహీనము గలుగజేయుచుండును. బహుబాధకరమగు దగ్గు గలిగియుండును. ఒక్కమాటుగానే యీవ్యాధిచాలా దూడలకు సంభవించి కొన్నిటికి ప్రాణాంతమును గలుగజేయును.

చికిత్స.——శక్తికొలది దూడల దేహబలము చెడనివ్వకపట్టి జాగ్రతతోటి పోషింపుచుండవలయును. సురుగుదబ్బలలో నుండెడు పురుగులు చచ్చునటుల మృగరోగచికిత్సకుడు (Veterinary Surgeon) క్లోరైన్ (Chlorine) అనుపేరుగల పొగవాయువును దూడలచేత ఆఘ్రాణింపచేయగలడు. పసులఖావందులు ఇట్లుచేయబూనుకొనిరేని చెరుపు గలుగజేయుదురు.

ఊలతెగులు.——(Rot) ఈజాడ్యము ముఖ్యముగా గొఱ్ఱెలకు సంభవించునది. కాలేజము (గుండెకాయ) లో కొన్ని పురుగులుపుట్టి యీజాడ్యమును ఉత్పాదింపుచున్నవి. ఈపురుగులు కొన్నిసమయములలో పశువులయొక్కయు, గుఱ్ఱపు పిల్లలయొక్కయు గుండెకాయలయందు సహితము జనించును. ఇవిపుట్టుటచేత ప్రాణులు కృశించి శల్యములయిపోవును. కండ్లును, నోరును పాండువర్ణముగాగాని, పసిమి వర్ణముగాగానియేర్పడును. గొఱ్ఱెలకు నీజాడ్యము సంభవించినపుడు బొచ్చులాగితే సులభముగావీడివచ్చును. పొట్టక్రిందను, మెడక్రిందను, కాళ్లను, వాచియుండును. రోగికృశించి శల్యమైచచ్చును. పల్లపునేలల యందుగాని వెల్లువపెట్టిన పిమ్మటగాని మొలిచెడు పచ్చికను తినెడి గొఱ్ఱెగుంపులకు నీజాడ్యముముఖ్యముగా సంభవించుట గలదు.

చికిత్స.——పేగులలోనుండెడు కల్మషమును హరించుటకునై భేదికి నివ్వవలెను. సైంధవలవణము పొడిచేసి రోగితినునంత యివ్వనగును. చెమ్మలేని



కంచెలయందు మేయదోలవలయును. ఇట్టిజాడ్యగ్రస్తములగు గొఱ్ఱెలను మాంసముకొఱకు కోసినపుడు గుండెకాయనుకాల్చి వేయవలయును.

తుట్టెపురుగులు.——(Hydatids) ఇవిఉచ్చుబుడ్డలవలె తెల్లగాను లోపల నీరుగలిగి యుండునవి. ఇంచుమించుగా యీపురుగులు ఈదేశపు పశువులయొక్క కాళ్రజములోను ఉండును. కొన్నిసమయములలో ఇవిఅపరిమితములుగా నుండును. ఇట్టిపురుగులుండుటచే కాలేజమును సురుగుదబ్బలును తమతమపనులు చేయనోపవు. ఒకవేళవానిలో పెద్దదిగా నుండెడు పురుగు చితికెనేని దానియందలి విషద్రవము పశువుయొక్కకడుపులోనయినా రొమ్ములోనయినా పడుటచే అట్టిపశువు మరణము నొందును. ఈపురుగులు లెక్కకెక్కుడుగా నుండునేగాని జంతువునకు సంకటము గలుగజేయునంత గొప్పవిగానుండుటలేదు. మాంసము కొఱకయి ఆరోగ్యముగా గనబడు నొకజంతువును కోసినప్పుడు లోపల నీపురుగుల అంకురములు పెక్కులుగా నుండుట గలదు.

ఈపురుగులుండు జంతువులమాంసము హానికరముగాదు గనుక భక్షణార్హముకాదని వర్జించుట యుచితముగాదు. ఇట్టిపురుగులు కనుబడినభాగములు కోసికుక్కలకు వేయకూడదు. తక్షణమే వాటిని కాల్చి భస్మముచేసి వేయవలయును.

చికిత్స.——ఈపురుగులు హానికరములు గాకపోవుటచేతను, జంతువును భేదించినతరువాతగాని యిట్టిపురుగులుండినవనీ మనకుతెలియకపోవుటచేతను చికిత్స అనావశ్యము. ఈపురుగులుండిన కాలేజమునుగాని సురుగుదబ్బలనుగాని కాల్చిబూడిదె చేసివేయవలయును.

తిరుగుడుజాడ్యము.——(Gid or Turn-sick) మెదటిలో పురుగులు పుట్టుటచేత యీజాడ్యము ఉత్పన్నమగును. ఇది గొఱ్ఱెలకు ముఖ్యముగా సంభవించునది. అప్పుడప్పుడు యెద్దులకుసహితము యీజాడ్యము ప్రాప్తించును. మిడిచూపుచూచు కన్నులుకలిగియుండుటయు, మాటిమాటికి నొకప్రక్కకు గిరగిరతిరుగుటయు నీజాడ్యలక్షణములు. ఈరోగము గలిగిన గొఱ్ఱెల తలకాయలు కుక్కలకు ఆహారముగా పెట్టకూడదు.

చికిత్స.——ఈరోగము కుదురుట దుర్లభము. జంతువుచచ్చినతర్వాత మెదటిని భస్మీకరము చేయవలయును.

## అంతర్గత చీడపురుగులకు సాధారణ చికిత్స.

ఇట్టిపురుగులు పుట్టినపిమ్మట చికిత్సచేయబూనుటకంటె పురుగులు పుట్టనివ్వకయే తగుసాధనమును అవలంబించియుండుట మహానేర్పరితనము. ఏలాటిపురుగులను పుట్టనివ్వక ఆపుజేసెడి పదార్థము ఉప్పు. ఇట్టిఉప్పును ప్రతిదినము హెచ్చుతక్కువలులేక పశువులకు పెట్టుచుండిరేని యీసంబంధములగు జాడ్యములు పశువులనంటవు. ఇట్టిజాడ్యములచే బాధితములగు జంతువులు దుర్బలపడియుండినయెడల అన్నభేది, నేలవేము, శొంఠి, ఉప్పు, యీవస్తువులను ఔషధప్రమాణముగా బలమువచ్చువరకు ప్రతిదినము యిచ్చుచుండవలయును. పిమ్మట ఉప్పునుమాత్రము మానక [illegible]తతోటి పెట్టుచుండవలయును.

## 2. బహిర్గతచీడపురుగులు. (External Parasites)

చర్మగతజాడ్యములు పెక్కులుగలవు. వానిలోగొన్ని బహుబాధకరములయి యున్నవి. చిన్నపురుగులుగాని, పాచిసంబంధులగు పుట్టలుగాని చర్మమునంటి వృద్ధియగుటచే నీసంకటములు కలుగును. అట్టిపురుగులు బెజ్జముచేసికొని చర్మముక్రిందకివెళ్లి అచ్చటవసించుటవలన గలిగెడు సంకటమును సారి (Mange) యనివాడుదురు. ఇట్టిసంకటమే గొఱ్ఱెలకు సంభవించెనేని మేకసారి (Scab) యందురు. సారిపట్టినజంతువులకు బొచ్చురాలిపోవుచు దూలగొనియుండును. ఇందుచేతనే అట్టిజంతువులు రుద్దుకొన వాంఛపడియుండును. ఈసంకటము ఒకగొఱ్ఱెయొద్దనుండిమరియొకగొఱ్ఱెకును, ఒకయెద్దుయొద్దనుండి మరియొకయెద్దుకును చుట్టుకొనును; గాని గొఱ్ఱెసారి యెద్దుకును, యెద్దుసారి గొఱ్ఱెకును అంటజాలదు. సారిసంకటము తఱుచుగా గలిగెడిదయి అంటుజాడ్యమయియున్నది. దీనివలన ప్రాణహాని లేకపోయినను ప్రాణికోటిని బలహీనపరచి తేజస్కరముగా నుండనీయదు.

తామర.——(Ringworm) ఈసంకటము లేతజంతువులకు తఱుచుగా సంభవించునది. చర్మముమీది వెంట్రుకలు మూచికలుపడరాలిపోవుచుం



డును. ఇదిపాచిసంబంధియగు పుట్టచర్మమీద పెరుగుటచే గలుగునది. ఈసంకటము ప్రాణహానికరమయినదికాదు, కాబట్టి అంతముఖ్యమయినదికాదుగాని యితరజంతువులకునువలె మనుష్యులకును అంటునదియైయున్నది.

చికిత్స.——రోగికేవలము బలముచెడియుండినయెడల విరేచనమునకు మందిచ్చి మఱునాడుసబ్బుతోటి దేహమంతయు చక్కగాకడిగి ఆర్చి పిమ్మట యెనిమిదివరహాలయెత్తు గంధకపుపొడిని ఒకఅర్ధబుడ్డి నూనెలో కలిపి దేహముమీద పూయవలయును. ప్రతిదినము ఔషధప్రమాణముగా గంధకము కడుపులోనికి యిచ్చుట బహుప్రయోజనకారియైయుండును.

ఈచెప్పబడిన జాడ్యములన్నియు సాధారణములయినవగుటవలన పసులఖానందులే సాధ్యమయినవరకు నివారించుకొనగలరుగాని యిక వివరింపబడురోగములు మహోగ్రరమయినవగుటచేతవాటిని నివారించుటకు సర్కారువారియొక్కయు వారియుద్యోగస్థులయొక్కయు సహాయమున్ను సలహాయున్ను కావలసియున్నది. మరియునివి రక్తసంబంధమయిన జాడ్యములగుటచే నిట్టిరోగపీడితములగు జంతువులయొక్క రక్తము విషమించిచెడియుండును. ఇట్టిజాడ్యములు ఒకజంతువునుండి మరియొకజంతువునకు యేలాగునప్రాకునది యిదివరకే చెప్పబడెను. కాబట్టి అట్టిమార్గములలో నెద్దియేని నొకమార్గమున దేహముజొచ్చి జీవరాశిని బాధించును. ఈరోగములనే సాధారణముగా చీడలుఅనివాడెదరు.

దొమ్మ.——(Anthrax) అన్నిజాడ్యములకంటె నీజాడ్యము మహాహానికరమయి ఒకజంతువుయొద్దనుండి మరియొకజంతువునకు సంభవించెడిదైయున్నది. ఆవిధముగా మనుష్యులకు సహితముసంభవించును. ఈజాడ్యము కుదురుటమహాదుర్లభము. ఇది పలురూపములుగా ప్రాణిహింసజేయును. ఈక్రిందవచ్చునవి ముఖ్యములగు రూపభేదములు.

(1) చలిదొమ్మ, లేక నెరడిదొమ్మ——(Splenic Apoplexy) పశువు అకస్మాత్తుగాజబ్బుగొని లేవనోపక పడిపోవును. ముక్కు, కనురెప్పలు ఊదావర్ణముగాగాని నల్లగాగాని మారును. రక్తమునలుపుచాయగలిగి పేడతోటి పడుచుండును. ఇట్లుండిమరికొంతసేపటికి జీవమువిడుచును. అట్టిశవమును ఛేదించి

చూచినపుడు రక్తము నలుపై నెరడిగుండె (Spleen) సహజరూప ముఁవిడిచి బహుని స్తరించి యుండును. దానిలోని రక్తము ఓడకీలువలె నల్లనైయుండును. కళేబరము బహువేగముగా కుళ్లిపోవును.

(2) జబ్బవాపు, లేకగుదిపెట్టు.——(Quarter-ill) ఆరంభమందు పశువుసాధారణముగా, వెనకటి కాలుకుంటును.అంతటంతటనే ఆకాలువాపు చూపును.చర్మముక్రింద గాలిచేరియుండుటచే అదిమినయెడలపటపటలాడును. మంచిపచ్చికగలకంచెలలో దూడలను తోలుతమేయ దోలునపుడు దొమ్మరోగము తఱుచుగా వాటికి యీరూపముగా సంభవించును. తక్కిన రూపములయందన్నిటియందు తీవ్రమయిన జ్వరము తప్పక కలిగియుండును. వెంటనే మరణము ప్రాప్తించును.

(3) కుత్తుకవాపు,లేకగురక——(Malignant Sore Throat) పశువుచాలా జబ్బుపడి బలహీనమయి యుండును. గొంతున్ను నాలుకయున్ను వాచి నోటివెంబడి జొల్లుకార్చును. నాలుక వెళ్లబెట్టుకొనియుండును. నోరునలుపుచాయగలిగి యుండును. బుస కొంపుకొట్టుచుండును. వెంటనే మృతిబొందును.

(4) జ్వరదొమ్మ.——(Anthrax Fever) ఇదిగుజ్జములకు సంభవించునది. ఈదేశమందిది తఱుచుగా సంభవించి వినాశముగలుగజేయును. ప్రచండమయిన జ్వరము గలిగియుండుట, గుజ్జము లేవజాలక పడియుండుట, కండ్లలోను ముక్కులలోను నోటిలోను యెఱ్ఱని మచ్చలు యేర్పడియుండుటయు యీజాడ్యలక్షణములు, మరియు మరణము సమీపించునపుడు ముక్కులగుండా నురుగు పడును.

(5) రాచకురుపులు.——(Carbuncles) ఇవిమనుష్యులకు సంభవించునవి. దొమ్మరోగము తగిలియుండు జంతువుయొక్కగాని, అట్టిజాడ్యమువలన చచ్చిన జంతువుయొక్కగాని, రక్తము మనుష్యులదేహము లోనికి కురుపులమూలముగానేమి, యితరమార్గమున నేమి సోకినయెడల యీజాడ్యము ఉత్పత్తియగును. ఎందుతోళ్లమూలముగా సహితము యీభయంకరమగు జాడ్యము సంభవించి ప్రాణహానిగలుగజేయును. కంబళ్లునేయబడు బొచ్చులో దొమ్మజాడ్యమువలన చచ్చినగొడ్లబొచ్చుసహితము కలిసియుండుట



గలదు; కాబట్టి అట్టిసరకును నాణ్యావారిగా విభజనచేయువారు చాలామంది యీజాడ్యమువలన చచ్చియున్నారునుమీ. తోళ్లపరిశ్రమయున్ను బొచ్చుపరిశ్రమయున్ను అంటుజాడ్యములు వ్యాపకమవుటకు మూలములు.

(6) నీరుదొమ్మ.——(Braxy) గొఱ్ఱెలకు సంభవించెడు దొమ్మరోగమును నీరుదొమ్మయనివాడుదురు. గొఱ్ఱెలు యీజాడ్యముచే మందలుమందలుగా మరణించును. ఈజాడ్యము మొదటి మూడురూపములలో నొకరూపముగా గొఱ్ఱెలకు సంభవించును.

దొమ్మజాడ్యముయొక్క ఉత్పత్తియెట్టిదయునది తెలిసికొనుట ముఖ్యము. రక్తములో సన్నపురుగులుచేరి అచ్చటనేయవి పెద్దవై బహువేగముగా సంఖ్య వృద్ధియగును. ఈజాడ్యమువలన నొకజంతువుచచ్చి దానిరక్తము అచ్చటి పచ్చికమీద జారుటచేతగాని, దాని కళేబరము అచ్చటనే పడియుండి అడవిమృగములవల్లను పక్షులవల్లను ఖండములుగా జేయబడినందుచేతగాని రక్తములోనుండిన సన్నపురుగులు (ఈపురుగులు దొమ్మరోగమును ఉత్పాదించిన పురుగులని యెఱుగునది) ఆప్రదేశములయందంతట పడి అచ్చటనేవృద్ధియగును. పిమ్మట నొక సంవత్సరమునకయినా అచ్చోట మొలచిన పచ్చికను యేజంతువేని తినినయెడల అట్టిజంతువునకు తప్పక ఆజాడ్యము సంభవించును. కాబట్టి ప్రాకెడు జాడ్యములవలన (Communicable Diseases) చచ్చెడి జంతువుల కళేబరములను పారవేయక కాల్చివేయవలయును.బట్టీలో (Cinerator) కాల్చివేయుటకంటె క్షేమకరమగు మార్గము మరియొకటికానము.నక్కలు గద్దలు మొదలగు గొప్ప ప్రాణులున్ను,చీమలు ఈగలు ఎఱ్ఱలు మొదలగు చిన్నప్రాణులున్ను, సహితము యీజాడ్యము వ్యాపకమగుటకు కారణములగుచున్నవి. మాంసభక్షణముచే జీవించెడి జంతువులకు నీజాడ్యము సంభవించుట బహు అరుదునుమీ. ఈజాడ్యముచే జచ్చిన జంతువులనుకోసి చూచినయెడల రక్తము ఓడకీలువలె నల్లగాను చిక్కగాను ఉండును. ముఖ్యముగా రోగపీడితములయిన భాగములు వాచి నల్లగానుండును. అవి త్వరగా కుళ్లిపోవును. లోపలంతట యెఱ్ఱని చుక్కలు గలిగి మచ్చలుగా నేర్పడియుండును.

చికిత్స.——జాడ్యప్రారంభదశయందే తగు చికిత్స చేయబూనుకొనవలయునుగాని మించిపోయెనేని దొమ్మజాడ్యముచేగాని, దీనిరూపాంతరములచే

గాని అవరితములగు ప్రాణులను మృత్యువు వాతనుండి మరలించుట దుస్తరము.

గుఱ్ఱములకు.——కార్బాలిక్ ఆసిడ్ అప్పటం (Carbolic Acid Pure) 60బొట్లు, మెత్తగా పొడిచేయబడిన ఉప్పు (Common Salt) నాలుగు వరహాలయెత్తు తుమ్మబంకతోటిన్ని గోధుమపిండితోటిన్ని నూరి మాత్రకట్టుచేసి తక్షణమే యివ్వనగును. స్వస్థచిహ్నములు రోగియందు కనుపించువరకు జామున్నరకు నొకపర్యాయము యీమాత్రకట్టుచేసి యిచ్చుచుండనగును.

పశువులకు.——మీద జెప్పబడిన మాత్రే చేసి ఒకబుడ్డెడు చిక్కని గంజిలో కలిపి త్రాగించుచుండనగును. స్వతహాగా త్రాగనియెడల గొట్టముతో నోటబోయవలయును.

దూడలకు, గొఱ్ఱెలకు——ఈ మాత్రను నాలుగుభాగములుచేసి ఒక్కొకభాగము గంజిలోకలిపి యిచ్చుచుండనగును.

ఈజాడ్యముచే భాధపడెడు జంతువులకు దేహమందెచ్చటైని నొకప్రక్కవాపుజూపును. అట్లువాచినప్రదేశమున ఉడుకు కాపడం (Hot Fomentation), ఉడుకుపట్టు (Warm Poultice), పొక్కుమందులు (Blisters), మొదలగు సాధనములవలన వాపును తగ్గించవలయును. మఱియు వూపిరాడక యుండునట్లుతోచెనేని పీకెక్రిందుగా కత్తితోటి చీల్చిద్వారము చేయుటచేత కొన్ని సమయములలో రోగిబ్రతుకవచ్చును. అయినను యిట్టిఘనకార్యములు మృగరోగచికిత్సకుడు { (Veterinary Surgeon) (వెటర్నరి) (సర్జియన్) } మాత్రమే చేయవలయును.

జాడ్యముయొక్క ప్రచండము తగ్గిన పిమ్మట రోగిని బహుజాగ్రతతోటి పోషింపుచు దేహపటుత్వకారులగు మందులను (Tonics) చాలాకాలము వరకు నిచ్చుచుండవలయును. మలముచక్కగా రాకబద్ధకించుకొని యున్నయెడల మృదువిరేచనమగునటుల మందు యివ్వనగును.

* సరకు, మూసర, పెద్దచీడ.——(Rinderpest) ఈదేశములోని బహుప్రదేశములందు యీ జాడ్యము తఱుచుగా ప్రబలి పశువినాశము జే

* ఈజాడ్యము పశువులకు సంభవించినయెడల "సరకు" రోగమనియు. గొఱ్ఱెలకు అయినయెడల "మూసర" అనియు వ్యవహరింతురు.



యునది. ఏజంతువునకేమి యీ జాడ్యముసోకిన వారందోజులవరకు వ్యాధిలక్షణములు బయల్పడక దాగియుండి పిమ్మట నొకపక్షం రోజులలో జంతువు జబ్బుగొనును. తోడతోడనె మందలోని పశువులకన్నింటికిని ప్రాప్తించును. జాడ్యారంభమందు యిది యిట్టిజాడ్యమని నిదానించుట కష్టసాధ్యము. అటువెనుక జాడ్యస్వభావ నిరూపక చిహ్నములన్నియు బయల్పొంగబూనును. పాలుమాలికయును, ఒకప్పుడు పడుకొని లేవజాలక పోవుటయు, దేహముపైన ఈడ్పులు (Spasms) కలిగియుండుటయు, విరేచనములగుటయు, ముక్కులలోను నోటిలోను దేహముమీదను ఆడుపశువునకు యోనియందును పొదుగుమీదను సహితము బొబ్బలు పొంగి యుండుటయు, సహజముగా నొకలాటి దగ్గుగలిగి యుండుటయును యీజాడ్యలక్షణములయి యున్నవి. మఱియు రోగి పారినపేడ అసహ్యమైన వాసనగలిగి తఱుచుగా రక్తము కలసి యుండును. రోగి మరణించిన పిదప కోసి చూడగా ముఖ్యముగా పొట్టయున్ను పేగులున్ను రోగపీడితములయి యుండును. మఱియు సవ్యరక్తనాడులనుండి (Veins) బయలు వెడలిన నెత్తురు దేహములో అచ్చటచ్చట కూడి మాచికలుగా నేర్పడియుండును. ఈ జాడ్యము పశువులకు సంభవించుటేగాక వాటిమూలముగా గొఱ్ఱెలకు సహితము గలుగును. ఇదియొక జంతువుయొద్దనుండి మరియొక జంతువునకు ప్రాకెడిది (Communicable). నెత్తురు పారుటచేత నీజాడ్యము రక్తవిరేచనమని విభ్రమపడకూడదు. రక్తవిరేచనమయిన యెడల నోటియందు బొబ్బలుండవు. నోటియందు బొబ్బలుండుటచేత గాలికుంట్లు (Epizootic Aphtha) అనిభ్రమయకూడదు. గాలికుంట్లు సరకు జాడ్యమువలె అపాయకరమైనదికాదు.

చికిత్స.——జాడ్యప్రారంభమందే యెద్దియేని అవుషధము విచారింపవలసి యుండునుగాని దినములు గడచినయెడల యెట్టిమందుగాని నిష్ప్రయోజనమగును. దొమ్మ జాడ్యమునకు యివ్వ తగినమందే యీజాడ్యమునకు సహితము యివ్వనగును. ఉద్రేకకరములగు మందుదినుసుల (Stimulants) నిచ్చి చక్కగా పోషింపుచు రోగియొక్క బలముతగ్గిపోనివ్వక కాపాడవలయును. విరేచనములు ఆరంభించిన వెంటనే మాచికాయపొడి వరహాయెత్తు సీమసున్నము నాలుగువరహాలయెత్తు నల్లమందువరహాయెత్తు ఖ

ల్పములో మెత్తగానూరి బుడ్డెడు గంజిలోగలిపి విరేచనమునిలిచిపోవువరకు రోజుకు రెండుపర్యాయములు త్రాగించుచుండనగును.

గాలికుంట్లు, గిరసగాలి.——(Epizootic Aphtha or Foot and Mouth Disease) ఈజాడ్యము సోకుటచేతను అంటుటచేతను సంభవించెడిదయియున్నది. మఱియు నొకప్రాణిమూలముగా సమస్తజాతిప్రాణులకును ప్రాకును. ఏనుగలకును మనుష్యులకును సహితముయీవ్యాధి అంటును. కోళ్లకు నీజాడ్యము ప్రాణహానిగలుగజేయునది. నోటియందయిననుగాని కాళ్లయందయిననుగాని లేక రెంటియందునుగాని బొబ్బలు పొంగుట యీజాడ్యస్వభావమయి యున్నది. చాలాజంతువులకు నీరోగము తగిలినయెడల కొన్నిటికి నోటియందును కాళ్లయందును తప్పక బొబ్బలులేచును. నోటిలో లేచిన గుల్లలు తెల్లగానుండి తోడనే బ్రద్దలయి యెఱ్ఱని మచ్చలు యేర్పడును. ఇవిపొక్కులుబడి అడుగులువాచి జంతువులు కుంటుచుండును. ఈపుండ్లు లేచుటకు డెక్కలసందు ముఖ్యస్థానము. రోగి పలుమారుకాళ్లువిదిలించుచు నోరు పచ్చిపుండుగా నుండుటచేత మేత చక్కగా తినజాలక వేగముగా చిక్కిపోవును. ఇట్టి సమయములయందు మిక్కిలి బలకరమగుమేత పెట్టుట కేవలము అగత్యము. ఈజాడ్యము పాడిపశువులకు సంభవించెనేని పాలు యెండిపోవును. అథవా కొంచెముగా పాలిచ్చినప్పటికిన్ని ఆపాలు చిన్నబిడ్డలకు త్రాగించినయెడల వారికు భేదులుపుట్టును. ఆంగ్లేయ దేశమందు యీచీడవలన పశువులు చచ్చుటఅరుదు. ఈదేశమందు యీరోగముచేత పశువులు చావడమంతా బహుశా వాటికిచక్కగా మేత అమరకపోవుటచేతనేగాని యితరముగాదు.

చికిత్స.——తొలుతమృదువిరేచనమగునటుల అవుషధము యివ్వవలయునుగాని ఘాటుగా యిచ్చినయెడల రోగి కేవలము బలహీనపడును. జ్వరము తగ్గువరకు ప్రతిదినము దాహపునీళ్లలో నాలుగువరహాలయెత్తు సూరాకారము గలిపి నీరుపెట్టుచుండవలయును. బలము చెడనివ్వక ప్రతిరోజు దేహపటుత్వకారులగునేల్లనేము, అన్నభేది మొదలగు వస్తువులను యిచ్చుచు మెత్తని ఆహారవస్తువులు, లేతపచ్చిక పెట్టుచుండవలయును. కాలిబొబ్బలు ఉదయసాయంకాలములయందు చక్కగా సలివెచ్చని నీళ్లతోటికడిగి, ఒకపాలు పటికి యిరువైపాళ్లు వేడినీళ్లలో కరగించిగాని సలివెచ్చగా బొబ్బలమీదబో



యుచుండవలయును. లేదా, కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid) ఒకపాలు, నువ్వుల నూనెగాని, కొబ్బెర చమురుగాని యిరువై పాళ్లు చేర్చి కురుపులకు పూయుచుండవలయును.

బొబ్బలతెగులు.——(Variola Ovina or Sheep-pox) మనుష్యులలో స్ఫోటకమెట్టిదో గొఱ్ఱెలలో నీజాడ్యముఅట్టిది. ఈదేశమందిది తఱుచుగా గలిగెడిదయియున్నది. గజ్జలలోను, పెదిమెలమీదను, నోటిలోను, ముక్కులలోను తిత్తులవలె బొబ్బలులేచును. ఇందుచేతనే యీజాడ్యమును నిదానించుట సులభము. ముక్కులలోనుండి చీమిడికారుటయు, విరేచనములగుటయు, పాలుమాలిక్య,జ్వరము కలిగియుండుటయు నీజాడ్యస్వభావము. బొబ్బలుస్వల్పసంఖ్యగలవై యొకదానికొకటి చాలాదూరముగానైనాయుండును. లేదా, ఒకటితోనొకటిచేరి పెద్దకురుపుగానైనా యేర్పడును- జాడ్యగ్రస్థమైనజంతువులతోటి యితరగొఱ్ఱెలు కలసియుండిన పదిదినములకావల జ్వరము ఆరంభమగును. సరాసరి ఒకపక్షమువరకు యీరోగము బాధించును. పిమ్మట రోగి దుర్బలపడి మరణించును. ఈతెగులు గొఱ్ఱెలలో గొప్పసోకుడుజాడ్యమైయున్నది. ఇది మనుష్యులలోకలిగెడి స్ఫోటకము, ఆవులలో సంభవించెడి అమ్మవారు, అను జాడ్యములకు సంబంధించినదికాదు.

చికిత్స——ఈజాడ్యమునకు అనుకూలించెడు అవుషధములేదుగాని రోగియొక్క దేహబలము చెడనివ్వక నిలుపుటకయి వలయుసాధనముచేయవలయును. కాబట్టి రోగపీడితలగు గొఱ్ఱెలకు లోభత్వముచేయక మంచిమేత వేయుచు పోషించుట గొప్పతనము. తొలినాడు మృదువిరేచన మగునటుల మందివ్వనగును, చల్లైడునీళ్లలో యెనిమిది వరహాల యెత్తు సూరాకారము కలిపి దాహము పెట్టుచు వచ్చినయెడల మూత్రము బహుగా వెడలి జ్వరము తగ్గును. బొబ్బలు చితికినపిమ్మట కర్పూరము ఒకపాలు, నూనె ముప్పయిపాళ్లు మిశ్రముచేసి కోడియీకతోటి తేలుకగా కురుపులకు పట్టించనగును. కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid) చిక్కనెడల ఒకపాలు చేర్చవచ్చును. మందు పూయునెడ కురుపులమీద మోపు తగలనివ్వకూడదు. అట్లు తగిలెనేని అచ్చోటు దండెపడి కురుపులుసులభముగామానక బహుబాధనుకలుగజేయును.

అమ్మవారు——(Variola Vaccina or Cow-pox) ఇదిబొబ్బలతెగులువంటి స్వభావలక్షణములుగలదయి మహాశాంతమగు రోగము. పాడుగు

మీదను, చన్నులమీదను, తిత్తులవలె గుల్లలు లేచి వాటిలోనుండి పలచని ద్రవము జారుచుండును. ఈద్రవమును మనుష్యులరక్తములోనికి యెక్కించిన యెడల (Vaccinating) స్ఫోటకమువలని ప్రాణభయము నొందనివ్వక రక్షించును.

చికిత్స——ఈజాడ్యమునకు ఔషధచికిత్స అగత్యమే లేదు. సాధారణముగా మూడు వారములు మొదలుకొని ఒక నెలలోపల రోగము స్వస్థమగును. మొదట విరేచనలవణమును (Epsom salts or Magnesium Sulphate) ఔషధప్రమాణములో సగభాగముయిచ్చి పిమ్మట అమ్మవారు పుండ్లను శుభ్రముగా కడుగుచుండవలయును. పుండ్లు బలియముగానుండెనేని బొబ్బలతెగులుకు నిర్ణయింపబడిన పూతమందే దీనికిని వాడనగును.

అశ్వక్షయ. ఫార్సి——(Glanders and Farcy) గుఱ్ఱములకును, గాడిదెలకును, కంచరగాడిదెలకును సంభవించెడు అపాయకరమగు జాడ్యసంబంధమగు రెండురూపములు. ముక్కులలో కురుపులు లేచి వాటిలోనుండి జిగురుగల ద్రవము కారుచుండి దవడలసందున గట్టిబిళ్లలు గట్టియుండినయెడల అట్టిజాడ్యము అశ్వక్షయయనియు, చర్మముమీదనంతట కురుపులు లేచి కాళ్లు చాలా వాచియుండినయెడల అట్టిజాడ్యము ఫార్సియనియు చెప్పబడును. ఈరెండుజాడ్యలక్షణములు యేకకాలమందు సహితము తోసవచ్చును. నురుగుబ్బలయందు సహా పుండ్లు లేచియుండును. దేహముమీదగాని, ముక్కులలోగాని లేచియుండెడు కురుపులలోనుండి ద్రవించు రసిక యితరగుఱ్ఱములకు యేమూలముగానేని సోకినయెడల వాటికి సహితము యీజాడ్యములు తప్పక వచ్చును. ఈద్రవము కంటిలోను, ముక్కులోను ఉండెడి పొరలమీదనేమి, గాయములమీదనేమి పడుటచేత యీజాడ్యమే సంభవించి బహుమంది మనుష్యులు మృతిబొందియున్నారనుసుమీ. దీనివలనగలిగెడు మరణము అతి భయంకరమై బాధపూర్వకమయియుండును.

చికిత్స——ఈజాడ్యము కుదురునదిగాదు. కాబట్టి యీరోగమునకు చికిత్స చేయబూనుటగాని, చేయనిచ్చుటగాని యెంతమాత్రమయినను కూడదు. ఏలనగా, చికిత్స చేయబూనుటంతయు యీ జాడ్యసంబంధియగు విషమును భద్రపరచి తక్కినమృగములకు సహితము యీరోగము సంభవించునటుల



చేయుటయేగాని యితరము గాదు. ఈజాడ్యపీడితములగు జంతువులను తక్షణమే చంపి కాల్చి భస్మము చేయవలయును.

వేపివెఱ్ఱి, కుక్కపిచ్చి——(Rabies) ఈరోగము చెన్నపట్టణ పహారులోను, చుట్టుప్రక్కలయందును, బహుతఱుచుగా గలుగునది. ఈ జాడ్యము వలన బహుమంది ఆసుపత్రులయందు చచ్చుటే మనకు దృష్టాంతము. ఆరంభమునందు యీజాడ్యమును తెలుసుకొనుట కష్టతరము. కుక్క తన సహజప్రవర్తన విడిచి యొకతీరుగానుండును. దూరముగా పరుగెత్తి వెళ్లవలయునని కోరికగలిగి దారినడచెడు యేమనుష్యునయినా జంతువునయినా కఱవ నుద్యోగించును. విచిత్రముగా మొఱుగును. ఇట్టి అరుపుచేతనే కుక్కకు పిచ్చియెత్తియున్నదని చెప్పవచ్చును. నోటివెంట జొల్లుకారుచు కండ్లు యెఱ్ఱనయి యుండును. ఆవెంటనే వెనకటికాళ్లు సమముగానుండక జాలక యీడ్చుకొనుచు తిరుగులాడును. తోడనె మృతిబొందును. పిచ్చికుక్కకాటు మహా అపాయకరమైనది. కఱచినతోడనే నోటివెంబడి కారుచుండిన జొల్లుగాయములో పడి విషము లోపల ప్రవేశించును.

చికిత్స.——పిచ్చికుక్క కరచిన తోడనే కీలుగాని చేయిగాని అయినయెడలపైన త్రాటితోటి బిగించి గాయమును చప్పరించవలయును. ఆగాయములో యినుము యెఱ్ఱగా కాల్చి అంటించవలయును; లేదా కారపు ఉప్పు (Caustic Potash), కారపు కడ్డీ (Lunar Caustic) మొదలయిన వాటితోటి ఆగాయమును కాల్చవలయును.

బేవార్సుకుక్కలవలన ముఖ్యముగా నీరోగము వ్యాపకమయి మనుష్యులకు అపాయకరమయి యుండుటచేత అట్టికుక్కలను చంపివేయవలయును. గొప్ప పట్టణములలో యిందుకుగా యేర్పడియున్న నిబంధనలమేరకు పోలీసు ఉద్యోగస్థులుగాని లేక అందుకుగా నియమింపబడు వారుగాని యిట్టి బేవార్సు కుక్కలను చంపి వేయుచున్నారు.

సాధారణ జాడ్యమయినదిన్ని ప్రాకెడు జాడ్యమయినదిన్ని (Communicable Disease) పసుల స్వంతదారుడు స్పష్టముగా గుర్తెఱుగుటకునయి తగు సాధనములను తేటగా యిక వివరింపబడును. చీడలు ప్రారంభమయి ఒకటి రెండు పశువులకు తగులువరకు జాడ్యమిట్టిదియని నిధానించు

ట స్వంతదారునకు కష్టతరమయి యుండును. అయినను తొలుత ఒకపశువు చచ్చినపుడు దానికి తగిలిన జాడ్యము సాధారణ జాడ్యమయినది లేక అంటు జాడ్యమయినది రూఢిగా తెలిసికొనుటకునయి ఆశవమును ఛేదించి చూడవలయును. అట్లు చూచినపుడు యింతకు పూర్వము వివరింపబడిన ప్రకారము అంటు జాడ్య సంబంధములగు గుర్తులు దేహమందలి యేభాగమందయినను కనుపించెనేని తక్షణమే అట్టి జాడ్యమును ప్రబలము కానివ్వక ఆపుటకయి తనశక్తికొలది పాటు పడవలయును. అట్లుగాగ సాధారణ జాడ్యమయిన పక్షమందు తక్కిన పశువులకు యేహానియు రాచాలదని తాను స్థిమితముగా నుండవచ్చును. * మరణానంతర పరిశోధనచేగదా జాడ్యస్వభావమిట్టిదియని నిర్ణయింపనగును. అయినను కొన్నిసమయములందు జాడ్యస్వభావలక్షణములు స్పష్టముగానుండక విభ్రాంతిని గలుగజేయును. అట్టియెడ సమీపమందు కొద్దిదినములక్రిందట ఒకసంతగాని పెద్ద దుకానముగాని పెట్టుటచేతనో, పరగ్రామ పశువులు పారబడి తమపశువులతోటి కలియుటచేతనో, లేక క్రొత్తగా కొని తేబడినపశువులను తమ పూర్వపశువులతోటి ఉంచుట చేతనో గ్రామములో చీడలు పుట్టినవని తెలిసెనేని యీమూలము గావచ్చెడి జాడ్యములు అంటు జాడ్యములని యెఱుగవలయును. అట్లుగాక వర్షాకాల ప్రారంభమందును, కొంతవర్షము కురిసిన తర్వాత తటాలున కావలసినంత పచ్చికపడినయపుడును, చాలా పశువులు నశించుట గలదు. ఇట్లు చచ్చుటంతయు బహుశా ఊదుమట్టలు (Hoven) అనెడు జాడ్యము వల్లనే. మఱియు దీర్ఘమై తీక్షణమైన వేసవికాలము వెళ్లగానే చాలా పశువులకు భేదులుపుట్టి భేదిలో రక్తము పడుచుండి మృతిబొందును. ఇట్లుమృతిబొందుట సాధారణమగు రక్తాతిసారము (Dysentery) చేతనయి యుండును. ఎట్టిజాడ్యముచేతనయినను మరణము అకస్మాత్తుగా సంభవించుటగలదు; కాబట్టి పశువు చచ్చినపిమ్మట శవమును ఛేదించి పరిశోధన చేయుట బహు అగత్యము.

---

* మరణానంతరపరిశోధన (Post-mortem Examination) యనగా జంతువు చచ్చిన తదనంతరము శవమును కోసి లోపలి భాగములను జాడ్యనిర్ణయము కొఱకు శోధించి చూచుట.



## ప్రాకెడుజాడ్యములకు అంటకచికిత్స.

(1). పారబడిన పశువుల తమపశువులలో చేరనివ్వక ఆపుజేసికొనవలయును.

(2). క్రొత్తగా కొని తేబడినట్టిగాని రస్తామార్గమున సఞ్చరుచేసివచ్చినట్టిగాని, ప్రయాణమందేమి సంతయందేమి దుకానమందేమి అన్యపశువులతో చేరియుండినట్టిగాని జంతువులనన్నిటిని తమతాలూకా తక్కిన పశువుల యొద్దనుంచక దూరముగా నుంపవలయును.

(3). ఒక జంతువునకు యెద్దియేని నొకజాడ్యము కలిగినట్లుగుర్తు కనుపడెనా తోడనే సుఖజీవితములగు జంతువులలోనుండి ప్రత్యేకించి దూరముగానుంచి అచ్చటనేదానికి మేతయు నీరును పెట్టవలయును,

(4). ఒక జంతువు యెప్పుడేని ప్రాకెడు స్వభావముగల జాడ్యముచే బాధపడుచుండెనా తక్షణమే తక్కిన పశువులలో నుండి దానినివేరుచేసి ఆనయినము పోలీసు వుద్యోగస్థులకును, జిల్లా క్యాటిల్ యిన్స్పెక్టరుగారికిని తెలియపరచి యితర పశువుల యొద్దనుండి కనీసము నూరు గజములదూరమందుంచవలయును. మఱియునట్టి రోగి సంబంధములగు పడకగడ్డి, కట్టుత్రాళ్లు, పల్లపు సామానులు, పేడ మొదలగు వస్తువులను కాల్చివేయవలయును. జాడ్యముగొనిన పశువుల పోషణార్థమయి ఒకరు యిద్దరు మనుష్యులను అచ్చట నుంపవలయును. అట్టిమనుష్యులను యితర పశువులముట్టుకొన నివ్వకూడదు. సాధ్యమయిన వరకు కుక్కలు మొదలగు జంతువులను ఆసుపత్రి ఆవరణము లోనికి రానివ్వకూడదు.

(5). జిల్లా క్యాటిల్ యిన్స్పెక్టరుగారు విధించిన మేరకు రోగియుండినకొట్టమునుగాని, పాకనుగాని, సోకుడు పరిహారద్రవ్యములచే చక్కగా శుద్ధిపరచవలయును; లేదా అచ్చోటనంతయు గంధకమునుకాల్చి గోడలమీదను, అడుగుచప్పటమీదను, యెద్దియేనినొక సోకుడు పరిహారద్రవ్యమును చల్లవలయును. అడుగుచప్పటత్రొవ్వి నూతనముగా మన్నువేసి దిమ్మిస చేయనగును. ఆకొట్టముయొక్కగాని, పాకయొక్కగాని గుంజలు, దూల

ములు మొదలగు కొయ్యసామగ్రులను శుభ్రముగా తుడిచి గోడలకు సున్నము పూయవలయును.

(6) సోకుడు జాడ్యపరిహారిత్తలగు కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid) గాని,నీళ్లలో కలసెడి ఫీనయిల్ (Soluble Phenyle) గాని క్లోరైడ్ ఆఫ్ జింక్ (Chloride of Zinc) గాని నీళ్లలో చేర్చి అట్టి నీళ్లచే జాడ్యగ్రస్థములగు పశువులతోటి కలసి మెలసి యుండిన జంతువులను శుభ్రముగా కడుగవలయును. ఇట్టిజంతువులను మందలోని తక్కిన పశువులతోటి చేరనివ్వక దూరముగానుంచి జాడ్యసంబంధమగు తొలిచిహ్నములు యేవయినా తోచుచున్నవాయని ప్రతిదినము శోధించి చూచుచుండవలయును. అట్టిలక్షణములు తోచిన పశువులను అప్పటికిజాడ్యలక్షణములను కనుపరచని వాటిలోనుండి ప్రత్యేకించి దూరముగానుంచవలయును.

(7). ఆగ్రామములోని జంతువులలో దేనికిని జాడ్యమంటి యుండలేదని రూఢిగాతనకు నమ్మకము కలిగియుండుట కొరకు పలుమారు ఆగ్రామ పశువులను తనఖీచేయుచుండవలయును.

(8). సబురుచేయవలసియుండు జంతువులను యితరవాటితో చేరనివ్వకూడదు. అట్టిజంతువులచే మిక్కిలి దూర ప్రయాణములుగాని, అతిపాటుగాని చేయింప తగదు. మరియు తీక్షణమయిన యెండలో వాటిచేత సబురు చేయింపక మార్గమున వాటికి చక్కగా మేతయును నీరును విచారింపవలయును.

(9). జాడ్యమునుండి తేరిన పశువులను శుభ్రముగా కడిగి కనీసము ఒకనెలవరకు మందలో కలియనివ్వక ప్రత్యేకముగా మేపవలయును.

(10). జాడ్యపు పశువులకు వాడబడిన సామగ్రులను, పడకగడ్డి, పేడ, చికిత్స సంబంధమయిన వస్తువులు, మృతకళేబరములు మొదలగు వానిని కాల్చివేయవలయును. ఇట్లుకాల్చుటకునేయి యీగ్రంధకర్తవలన వాడుకకు తేబడి సర్కారువారివలన సమ్మతింపబడిన బట్టీలు మహా అనుకూలమయి యుండును. (9-వ అధ్యాయము చూడుడు.)



ఈజాడ్యములన్నియు మందులచేత మనకు సాధ్యపడకవాటి త్రోవన అవి చలింపక వెళ్లుచుండెడివని రూఢిగా తెలియవలయును. సరకు (Rinderpest) రోగము తఱుచుగా కుదురుచున్నట్టు తెలియవచ్చుచున్నది. ఈజాడ్యమును త్రిప్పెడిమందు యింతవరకును తెలిసినదికాదుగాని కొన్నిపశువులు దైవికముగా తేరుకొనుచున్నవి. జాగ్రతగా పోషింపబడి సుఖకరమగు ప్రదేశములయందుంచబడు పశువులకు యీజాడ్యము అంతగా తగులుటయును లేదు కుదురుటయునులేదు.మఱియు జాడ్యములు దినములు జరుగు కొలది స్వతహాగా నశించి పోవును. జాడ్యపుతగ్గుదశయందు తగిలిన పశువులకు రోగము తిరుగవచ్చును. అట్టికాలమందు యివ్వబడిన అవుషధమహిమచే జాడ్యము తిరిగినదని యీరోగస్వభావమును గుర్తెఱుగనివారు తలతురు. ఇదిశుద్ధతప్పు. ఇదిగాక తఱుచుగా ప్రాకెడి జాడ్యములను సాధారణ జాడ్యములని పొరబాటుచే దలచి చికిత్స చేయ బూనుకొందురు. అట్టి సాధారణచికిత్సలచేత అజాడ్యములు వాస్తవముగా సాధారణమైన వగుట వలననే స్వస్థమగుచున్నవి. ప్రాకెడి జాడ్యములు కుదురుట అసాధ్యమయినను అట్టిజాడ్యసంబంధమగు విషమును హరించుటకునయి * దైవము ప్రయత్నించుచుండును. దైవ ప్రయత్నమునకు తోడుగా పురుష ప్రయత్నమున్ను పురుష ప్రయత్నమునకు తోడుగా దైవప్రయత్నమున్ను కార్య సఫలత్వమునకుకావలయునని నీతికోవిదులు వచింతురు.గనుకమనము చేయవలసినపురుషప్రయత్నమెద్దియనగా :— మొదటిది, రోగియొక్క బలము తగ్గిపోనివ్వక పోషించుట. రెండవది; రక్తము శుద్ధియగుటకొఱకు మలమూత్రములు చక్కగా వెడలి, దేహముచమర్చి, పయిత్వము ధారాళముగా ప్రసరించునటుల తగు సాధనములచేయుట. ఒకజిల్లాయందు చీడలు తగులుచుండెనా,లేక ఒక ప్రదేశమందు చీడలు ఆరంభమాయెనా సుఖస్థితియందుండు తమ పశువులకు ఉప్పున్ను, సూరాకారమున్ను అవుషధ ప్రమాణముగా యిచ్చుచుండుట యుక్తము మఱియు నేలవేము, అన్నభేది సహితము యివ్వనగును. ఈదినుసులే చీడలుతగిలిన పశువులకు సహా యీక్రింది నిర్ణయప్రకారము వారము రోజులవరకు రోజునకు ఒకపర్యాయముచొప్పున యెద్దు ఒకటింటికి అర్ధబుడ్డి నీళ్లలోకలిపి త్రాగింపనగును.

* దీనినేతత్వజ్ఞులు ప్రకృతి యందురు.

అన్నభేది ఒకవరహాయెత్తు,
నేలవేము ఎనిమిదివరహాలయెత్తు
ఉప్పు నాలుగు వరహాలయెత్తు
సూరాకారము రెండువరహాలయెత్తు

ఇట్టి జాడ్యములవలన మృతిబొందిన పశువులడొల్లలను సాధారణముగాభూస్థాపనచేయుదురు. ఇది గొప్పతప్పు. స్థాపనచేయునపుడు విరియబోయని సున్నము (Quicklime) శవములమీద చల్లినను అదియునంత తృప్తికరమైన పద్ధతికాదు. ఏలననగా, శవముగోతిలో కుళ్లినపుడు ఆప్రదేశము జాడ్యోత్పత్తికి మూలస్థానముగా నేర్పడుచున్నది. జాడ్యసంబంధమగు విషము అచ్చటనే వృద్ధియై ఆప్రాంత్యములో మొలచిన పచ్చికలనుభక్షించెడు ప్రాణులగర్భములలో ప్రవేశించుటయేగాక వరదలమూలముగా అచ్చోటనుండి చెరువులలోచేరి ఆనీరుత్రాగెడి జంతువులకుసహితము హానికలుగజేయును. భూస్థాపనచేయునపుడు గోతులలో తాళ్లు ముండ్ల తుప్పలు మొదలగువానినివేసి పూడ్చినప్పటికిన్ని మాంసేచ్ఛగల మృగములు మన్నులోడి డొల్లలను పయికిలాగును. మాలమాదిగెలుసహితము మాంసముకొఱకును, తోళ్లకొఱకును శవములను బయిటదీయుదురు. ఇట్టిమాంసముదినుమాలవాండ్రు అపాయకరములగు జాడ్యముల పాలగుదురు. శవముయొక్క చర్మములను చీలికలుగా నొకకత్తితోటి జీల్చిపిమ్మట భూస్థాపనముచేయుపద్ధతి సహితము తృప్తికరమైయుండదు. బట్టీలలో కాల్చివేయుటకంటె క్షేమకరమగు పద్ధతి మఱియొకటిగానము.

రోగపశువులు అనాధలయి స్వయేచ్ఛగా తిరుగులాడుచుండుట పలుమారు చూచియున్నాము. ఇట్లు చేయుటచేతనేగదా అద్భుతముగా పశునాశము కలుగుచున్నది.

---

3 - వ

# అధ్యాయము.

## దొమ్మరోగమువలన ప్రాణహానిగలుగనివ్వక. సంరక్షణగలుగజేయుటీకాలు.

† దొమ్మయనురోగము, జంతువుల రక్తములో భూతాద్ద సహాయముచే మాత్రమే నేత్రగోచరమగు నొకవిధమయిన చిన్నపురుగు పెరుగుటచే గలుగునది. ఈరోగమువలన చచ్చిన జంతువుయొక్క కొన్ని రక్తపు చుక్కలను ఆరోగ్యముగానుండు జంతువుయొక్క చర్మములోనికి యెక్కించిన యెడల యెక్కించిన రెండు మూడు రోజులలో దానికి తప్పక చావుసంభవించును. ఈరోగమునకు కారణభూతములగు పురుగులు అట్టి సమయమందు బహువిష సహితములయి యుండును. గనుక అవి యేరసములో చక్కగా పెరుగునో అట్టి రసమందు వాటెని వృద్ధిపరచినయెడల వాటి విషపటుత్వము తగ్గక యథాస్థితిగానేయుండును. శాస్త్రిసంఘమువారి వర్తమానపత్రికలలో నుదహరింపబడిన సాధకమును అవలంబించి ప్యాస్టియరుదొరగారు, చెంబరుల్యాండుదొరగారు, రౌక్సుదొరగారు వీరు ముగ్గురు వీటెపటుత్వమునుతగ్గించి వారికి యిష్టమువచ్చిన నానా సారములుగల రసములను సృష్టిచేయ గలిగిరి. ఇందుచేత తప్పక చావును కలుగ జేయునంతటి తీవ్రమయిన రసమునుగాని దొమ్మరోగము తగిలినప్పటికిన్ని రోగము తేలిపోవునట్లు చేయునంతటి మధ్యమమైన రసమునుగాని, అధమమై నిరుపాధికమై జాడ్యలక్షణమును కొంచెమయినను కనుపరచని సారముగలిగిన రసమునుగాని వారు ఉత్పత్తిచేయగలరు.

(2). విషపటుత్వము తగ్గించుబడినట్టి పురుగును ఒకజంతువుయొక్క చర్మములోనికి యెక్కించుటచేత నాజంతువునకు శాంతమయిన కాయిలాగలుగును. అట్టిజంతువునకు కనీసపక్షము ఒకసంవత్సరమునకులోగా దొమ్మరోగము సంభవించినప్పటికిన్ని దానిచే ప్రాణహాని యెంతమాత్రము గలుగదు. ఇందునబట్టే దొమ్మటీకాల వలని ప్రయోజనము క్రమక్రమముగా వ్యా

† చలిదొమ్మ, జబ్బతెగులు, కుత్తుకవాపు, జ్వరదొమ్మ, నీరుదొమ్మయనునవి దొమ్మజాడ్యముయొక్క రూపాంతరములని యెఱుగునది.

పించుచున్నది. జంతువినాశకమగు నీజాడ్యమువలన ప్రాణోపద్రవముగలుగనీయక సంరక్షణకారులగు రెండువిధములుగా రసములచేత టీకాలువేయుదురు. మొదటిరసము మిక్కిలిబలహీనముగానుండెడిదగుటవలన దీనిచే టీకావేసినపుడుజంతువునకు కొంచెముగా జ్వరమువచ్చును. రెండవది తీవ్రమయినరసము. దీనిని మొదటిరసము వేసినపదిహేనురోజులకు వెనుక వేయవలయును. మొదటిరసముతోటీకాలువేయక రెండవపర్యాయము వేయవలసిన రసముతోనే తొలుత వేసినయెడల అట్టిజంతువులు కొన్ని మృతిబొందును; కాబట్టి మొదటిరసముచేత టీకాలువేయబడి కొంతవరకూ సంరక్షణను పొందినపిదప రెండవరసమునువేయుటచేత ప్రాణహాని కలుగక కొంచెము జ్వరమువచ్చును. క్రమక్రమముగా మొదటిరెండవ రసములచేత టీకాలువేయబడిన పిదప దొమ్మజాడ్యమువలనిభయములేదు. గొఱ్ఱెలు, మేకలు, యెద్దులు, దున్నపోతులు, గుఱ్ఱములు, గాడిదెలు, కంచెరగాడిదెలు మొదలగుజంతువులకు పయిన చెప్పినవిధముగా టీకాలువేసి రక్షించికొనవచ్చును.

టీకాలవేయునేర్పు.—1. టీకాలువేయురసము చక్కగామూతబెట్టబడినగొట్టములలో నుండును (1-టి బొమ్మనుచూడుము). ఆగొట్టములలో 50-100-200, లేక 300 గొఱ్ఱెలకయినను మేకలకయినను, లేక 25-50-100 లేక 150 యెడ్లకయినను దున్నపోతులకయినను గుఱ్ఱములకయినను టీకాలువేయుటకు చాలినంత రసముండును. ఈగొట్టములపయిన మొదటిరకపు రసమనిగాని, లేక రెండవరకపు రసమనిగాని, విలాసములు వేయబడియుండును. ఈరసములో కొంత రసమును తీసికొని జంతువుల చర్మములోనికి యెక్కింపవలయును. నరరోగ చికిత్సకులవల్లను మృగరోగచికిత్సకులవల్లను మనుష్యుల శరీరమందేమి గృహకృత్య జంతువుల శరీరమందేమి ఔషధముల నెక్కించుటకు వాడుకచేయబడు ప్రావాజు పిచ్చికారీ మూలముగానే యీరసమును సహితము మృగముల చర్మములలోనికి యెక్కింపవచ్చును (2-డో బొమ్మను చూడుము). తొలుత పిచ్చికారినిండా రసమునుతీసికొనవలయును; ఏలాగనగా, పిచ్చికారిసూదియొక్క కన్నము మూసికొని పోకుండునటుల లోపలికి యెక్కింపబడియుండు సన్నతంత్రిని తీసివేసిఆసూదిని పిచ్చికారిగొట్టపుకొనకు తగిలించి పిమ్మట రసగొట్టమును చక్కగా నాడించి పిచ్చికారిసూదిని రసములో ముంచి పిచ్చి



కారిపుడకను మెల్లగా మీదికిలాగుటచేత ఆరసము పిచ్చికారిలోనికి యెక్కును (3-డో బొమ్మను చూడుము). పిచ్చికారి మంచిదయినయెడల పిచ్చికారిగొట్టము చక్కగా రసముతోటినిండి కొంచముగామాత్రము గాలిలోపల నిలిచియుండును. పిచ్చికారి పుడక కొనయందుండే తోలుపొరలు తఱుచుగా యెండిపోయిగాని పిచ్చికారి కొనయందుండు సూది కచ్చితముగా బిగిసికొనక వదులుగాగాని యుండుటగలదు. అట్టిసమయములయందు పిచ్చికారిగొట్టమునిండా రసముయెక్కక అందులో గొప్ప గాలిబుగ్గ యుండును. అంతట విడువక రెండుమూడు పర్యాయములు పిచ్చికారితోటి రసమును లాగుచుండినయెడల ఆతోలుపొరలు తడసి సూది బిగువుగా నుండెనేని పిచ్చికారినిండా రసమెక్కును. ఈమొదటి అంశమును యేమరక చేయుట కేవలము అవశ్యము.

(2). ఏకారణముచేతనయినా పిచ్చికారిపుడక కొనయందుండే తోలుపొరలు యెండిపోయి గాలిలోపలికి పోవుచున్నయెడల ఆతోలుపొరలను నీళ్లలోవేసి మరగబెట్టి పిమ్మట ఆనీరు గోరువెచ్చన అయ్యేవరకు ఆపాత్రలోనే చల్లార్చవలయును తర్వాత ఆతోలుపొరలు ఉబ్బుటకొరకు రెండుమూడుపర్యాయములు పిచ్చికారిలో ఆగోరువెచ్చని నీరే పోయవలయును. మరగబెట్టని నీటినియీపనికి యెంతమాత్రము ఉపయోగపరచగూడదు.

(3). పిచ్చికారిలోని నీరు తోలుపొరలను దాటియున్నయెడల ఆతోలుపొరలు జబ్బువి అనిన్ని వాటిని మార్చవలసినదనిన్ని తెలియవలయును. ఈపనిచేయువానియొద్ద ఒక్కతోలుపొరే యున్నయెడల పిచ్చికారిపెట్టలోనుండెడు చిన్నతాళపు చెవితో దానిని కొంచెము బిగింపవలయును.

(4). గొఱ్ఱెలు, మేకలు.—రసముతోటినింపబడియుండు పిచ్చికారియొక్క పుడకపైనున్న యిత్తడిచక్రమును ఆపుడకపయినవ్రాసియుండు 1-టో అంకెమీద నుంచవలయును; పిమ్మట మరియొకమనిషి 4-గో బొమ్మలో నుండు ప్రకారము టీకాలవేయవలసిన జంతువును కదలనివ్వక దానిముందటికాళ్లను పట్టుకొనవలయును. టీకాలువేయువాడు ఆజంతువుయొక్క కుడిలో తొడమధ్యను చర్మములోనికి పిచ్చికారిసూదిని గ్రుచ్చి యిత్తడి చక్రము పిచ్చికారిగొట్టమునకు తగిలేపర్యంతము పిచ్చికారిపుడకను త్రోయవలయును.

మొదటిజంతువునకు టీకాలువేయుట యింతటితోముగిసెను. ఇక రెండవ జంతువునకు—మొదటిజంతువుయొక్క తొడలోనుండి పిచ్చికారిని పయికిదీసి యిత్తడిచక్రమును తిరిగి 2-వ అంకె మీదికి జరిపి పయిన చెప్పబడినప్రకారమే రెండవజంతువునకును వేయవలయును. ఇట్లుప్రతిపిచ్చికారీ యెనిమిది జంతువులకు సరిపడు రసము బట్టును. పిచ్చికారిలోనుండు రసము వినియోగమయిన పిమ్మట పయిన జెప్పినరీతిగా మరల నింపవలయును. ఈ పనికొంతవరకు అభ్యాసమయిన వెనుక ప్రతి మనిషి ఒకగంటకు 150 గొఱ్ఱెలకు టీకాలు వేయగలిగియుండును. మొదటి రసముతో టీకాలు వేసిన పది పదిహేనురోజులు అయినపిమ్మట రెండవ రకపు రసముతో జంతువుయొక్క యెడమ తొడ (మొదటవేయనితొడ) యందు వేయవలయును.

(5). గుఱ్ఱములు మొదలగునవి.—గొఱ్ఱెలకును మేకలకును ఉపయోగపరచబడు రసవిశేషమునే యెద్దులకును, గుఱ్ఱములకును, గాడిదెలకును, కంచరగాడిదెలకును సహితము వేయనగును—గాని, యివిపెద్దజంతువులగుటచేత వీటికి హెచ్చింపుగా రసమును వేయవలసియుండును—అనగా మొదటిజంతువునకు 2-వ అంకె యొద్దకున్ను, రెండవజంతువునకు 4-వ అంకెయొద్దకున్ను మూడవ జంతువునకు 6-వ అంకెయొద్దకున్ను యిత్తడిచక్రమును జరుపవలయును. ప్రతిపిచ్చికారి యెనిమిది చిన్నజంతువులకుగాని, లేక నాలుగుపెద్ద జంతువులకుగాని సరిపడు రసము బట్టును. టీకాలను తొడలోవేయుటకు మారుగా యెద్దుకు భుజమువెనుకటి భాగమందును, గుఱ్ఱములు, గాడిదెలు, కంచరగాడిదెలు—వీటికి మెడలోని సరజుపట్టీచేత రాపిడిగాని ప్రదేశముగా జూచి మెడయందును, వేయనగును.

(6). పిచ్చికారిసూదిని పెద్దజంతువుల చర్మములోనికి గ్రుచ్చుట బహుకష్టసాధ్యము గనుక రక్కుపడకుండా జాగ్రతతోటి పిచ్చికారిని తిన్నగా గ్రుచ్చవలయును. ఎడమచేతితోటి చర్మమును కొంచెముగా మడచిపట్టుకొని పిచ్చికారిసూదిని సునాయాసముగా యెక్కించుట మంచిపద్ధతి. గొఱ్ఱెలకు వాడుకపరచబడిన సూదిని పెద్దజంతువులకు వాడకూడదు. ఇందుకనే దీనికంటె దృఢమయిన సూది పిచ్చికారితోకూడా భద్రముగానుంచబడి యున్నది.



(7). టీకాలవేయు రసము చర్మములోనికి యెక్కింపబోవునపుడు నిష్కల్మషముగా నుండవలయునన్నది ముఖ్యమగు అంశము. ఆరసము మరగింపబడని నీటితోగాని ధూళితోగాని మరి అన్యవస్తువులతోగాని కలసియున్నయెడల అట్టిరసమును జంతువుచర్మములోనికి యెక్కించినపుడు రసపటుత్వము తగ్గిపోవుటయేగాక చీమునుగాని రక్తదోషమునుగాని కలుగజేయును. లేదా, టీకాలవలనగలిగెడు ఫలము నిరర్థకమగును. ఎచ్చటనుండిఅయితేనేమి పంపించబడినరసము కల్మషరహితమయి యుండును. అట్టి రసమును గొట్టములోనుంచే తీసికొనవలయును. మఱియు పిచ్చికారిని సహితము శుభ్రముగా నుంచుకొనుట అవశ్యము. ఎప్పుడుగాని వాడుకచేయబడని క్రొత్తపిచ్చికారీలు శుభ్రముగానేయుండును. టీకాలవేయుటకుగా నొకపర్యాయము వాడుకపరచబడిన పిమ్మట వాటినిమార్చి వాటికిబదులుగా క్రొత్తవాటిని యుంచుకొనవలయును. టీకాలువేయుట అతిసున్నితమైనపని అగుటచేత పిచ్చికారిని మరియొక పర్యాయము వాడుకపరచుకొనుటకు ముందుదానిని బాగుచేసికొని శుభ్రముగా కడుగవలయును, అనగా పిచ్చికారిని యొకపర్యాయము వాడుకచేసి కొన్నిరోజులు గడచిన పిమ్మట ఆపిచ్చికారిని శుభ్రముగా కడగకగాని రెండవపర్యాయము యెంతమాత్రము వాడుక పరచగూడదు.

(8). సౌఖ్యమైనంతత్వరలో రసమును చల్లనయిన గదిలో నుంచవలయును. ఒకనాడు తెరచిన రసగొట్టము మరుచటిదినములలో వాడుకచేయగూడదు—గనుక ఒకగొట్టములో నుండురసమంతయు ఆరోజుననే వినియోగపరచవలయును. మఱియు యేమాత్రమయినా రసముమిగిలినయెడల సంకోచింపక దానినిపారబోయవలయును.

(9). టీకాలువేయువానికి వ్యవధిలేకయుండినాగాని, లేదా చాలాపశువులకు టీకాలువేయవలసివచ్చినాగాని బహుఅవసరముగా టీకాలవేయవచ్చును. అప్పుడు సూది చర్మములోనికి ఆమూలముగా వెళ్లకరసము బయటవచ్చుటచేతను, పిచ్చికారిపుడకపైనుండు యిత్తడిచక్రమును జరపడము మరచిపోయి పిచ్చికారిపుడకను త్రోసినవెనుక రసము చర్మములోనికి వెళ్లకపోవుటచేతను, బహుఅపాయముసంభవించును. ఇందుచేత మొదటిరసము దేహములోనికి వెళ్లకుండాయుండి రెండవరసమునుప్రయోగించుటవలన యిదిమొదటిదానికంటె తీవ్రమయినందున ప్రాణికి చావునుగలుగచేయును.

(10). మొదటిరసముతో టీకాలవేయునపుడు ఆజంతువులనుపట్టుకొని యుండు వానిచేతిలోనుండి శీఘ్రముగా పారిపోకుండా బహుబందోబస్తుగా పట్టుకొనవలయును. ఈలాగు మొదటి రసముతో టీకాలువేయబడిన జంతువులు మందతో గలసినయెడల మొదటిరసముయొక్క గుణము కొంతమట్టుకు కలుగకమునుపే పొగబాట్లుచేత రెండవరసముతో టీకాలువేయవలసివచ్చును, కాబట్టి యీలాటి యుపద్రవములు సంభవింపనీయక జాగరూకులయి యుండవలయును.

(11). మఱియొక విధమగు విపత్తు సహితముగలుగుట గలదు. అదియెట్టిదనగా—పిచ్చికారీగొట్టములోనుండెడు గాలి సూదియొక్కచివరను చేరియుండినయెడల టీకాలవేయువాడు పిచ్చికారీపుడకను త్రోసినయెడల దానిలోనుండు రసము వెళ్లక గాలిమాత్రముపోవును. ఇందుచేత టీకాలుపడవు ఈయుపద్రవము పలుమారుసంభవించునదియైయున్నది.

(12). ఎడ్లకున్ను దున్నపోతులకున్ను టీకాలు వేసినస్థలముల యందు యిదివరకు యేవిధమయిన కాయలు కనుపించలేదు. గుఱ్ఱములలో ముఖ్యముగా పసిగుఱ్ఱములకు కొంచెము హెచ్చుతక్కువగా కాయలు పుట్టినవిగాని యేవిధమయిన చికిత్సలేకుండా త్వరలో అణగిపోయినవి. పసిగుఱ్ఱములకు దాఖలాచూచుటకయి మొదటి రసముతో రెండుపర్యాయములున్ను రెండవ రసముతో నొక పర్యాయమున్ను టీకాలు వేయబడెనుగాని యేవిధమయిన కాయలుపుట్టలేదు. ఇట్టి దృష్టాంతము లనేకములు వృద్ధియగుచున్నవి. గనుక మృగములకు టీకాలు వేయుట శ్రేష్ఠతరమైన పద్ధతియైయున్నది.

పిచ్చికారీలను శుభ్రముచేయు విధము.——పిచ్చికారియొక్కమీది భాగమును వేరుచేసి దానిపుడక కొనయందుండు మరను ఊడ్చి తోలుపొరల రెంటిని బయటరాదీసి గాజు గొట్టమునకు రెండు కొనలయందుండు తోలుబిళ్లల రెంటిని తీయవలయును.

ఒకపాలు కార్బాలిక్ ఆసిడ్డున్ను నలభై పాళ్లు జలమున్ను చేర్చి దానిలో పిచ్చికారిగొట్టమును దాని సూదినివేసి యిరువై నిముషములవరకు ఊడకనిచ్చి పిమ్మట తీసి పిచ్చికారియొక్క అన్నిభాగములను లోపలనున్ను బయటనున్ను మహాజాగ్రతతోటి ఒకశుభ్రమయిన నారబట్టతో తుడువవలయును. పిమ్మట



రెండుక్రొత్త తోలుబిళ్లలనున్ను రెండుక్రొత్త తోలు పొరలనున్ను వేసి మరబిగింప వలయును.

పిచ్చికారిని అమర్చునపుడు శుభ్రమయిన గొడ్డు కొవ్వులోగాని కొబ్బరిచమురులోగాని తోలు పొరల రెంటిని ముంచి నిక్కల్ వెండి అచ్చులో వాటిని యుంచవలయును. ఇట్లుచేయుటచేత ఆతోలుపొరలు గాజుగొట్టములో వెనుకకు ముందుకు జరుగునపుడు దానికి రాపిడి తగిలి పగిలి పోనేరవు.

గాజుగొట్టముయొక్క రెండు చివరలనుండి గొట్టములోని గాలిని వెలికిపోనివ్వక పిచ్చికారిపైభాగమందుండు మరను బిగింపవలయును. ఇట్లునమ్మకముగలుగు నిమిత్తము పిచ్చికారియొక్కచివరకన్నమును వ్రేలితోమూసి పుడకను పైకిలాగవలయును. అంతటపిచ్చికారీలో ఖాళీప్రదేశము యేర్పడి పుడక తనస్వస్థానముచేరినయెడల పిచ్చికారి కార్యానుకూలమైయున్నదని తెలియవలయును.

నీరునుపీల్చే బ్లాటింగు కాకితముతో పిచ్చికారిసూదులను తుడువవలయును. పిమ్మట కొనకూచి తేలుటకు సానరాతిమీద వాటిని నూరవలయును.

పిచ్చికారీసూదులయొక్క కన్నములు మూసికొని పోకుండునటుల లోహసంబంధమయిన తీగెలను బెజ్జములో నెక్కించవలయును.

సంజ్ఞ.—పిచ్చికారీని వాడుకచేసినప్పుడంతా పయినచెప్పినప్రకారము శుభ్రముచేయుచుండవలయును.

ఇది ఫ్రెంచిభాషలోనుండి కొన్నికొన్ని మార్పులతోటి యీగ్రంథకర్తయగు జేమ్సు - మిల్సుదొరగారిచే యింగ్లీషుభాషలో వ్రాయబడినది.

మద్రాసు మెయిల్ అనువర్తమాన పత్రికలోనుండి గ్రంథకర్తచేత యెత్తివ్రాయ బడినవి:—

(1). పశువులకుసంభవించెడు దొమ్మరోగమువలని విపత్తునునివారించుటకొరకు వేయబడు టీకాలు ప్యాస్టియరుదొరగారివల్ల కనిపెట్టబడి బహుప్రయోజనమును కలుగజేయుచున్నవనుటకు సందేహము లేదు. ఎద్దు

లయందును, పందులయందును, గొఱ్ఱెలయందును పరిశోధన లనేకములుచేయబడి టీకాలు రక్షకములని నిశ్చయపరచడమయినదిగాని యీటీకాలవలన గలిగేఫలము యెంతకాలమువరకు నిలిచియుండునో తెలియవలసియున్నది. మనుష్యులకు వేయబడు టీకాలవలన యెంతకాలమువరకు ఫలమునిలిచియుండునో అంతకాలము పశువులలోనుండ నేరదు. షుమారు దీనిగుణము ఆరుమాసములవరకుండును. ఈవిషయమును పరిశీలన చేయుటకుగాను హేరాల్టువ్యవసాయపు సంఘమువారు ఫ్రాన్సుదేశపు దక్షిణదిగ్భాగమందు ప్రశస్తమయియుండెడు మూడుజాతుల గొఱ్ఱెలకు టీకాలువేసిరి.అందు లాసాకు అనునొకజాతి గొఱ్ఱెలపాలతోటి ప్రసిద్ధమయినరాక్విపోర్టు జున్నునుచేయుదురు. ప్రత్యేకముగా యీటీకాలపరిశోధన నిమిత్తము 1882 సం ॥ మేమాసములో మాంటుపెల్లియరు వ్యవసాయపాఠశాలయొద్ద 36 గొఱ్ఱెలనుఉంచి 1883 సం ॥ మేమాసములో రకానికిరెండేసి చొప్పున 6 గొఱ్ఱెలకు యీవిషసంబంధమయిన రసముతోటి టీకాలువేసిరి.ఆవిషము వాటికిచెరుపుగలుగజేయదాయెను. పిమ్మట నవంబరుమాసమందు వారి 6 గొఱ్ఱెలకు అలాగే టీకాలువేసిరి. వాటికిసహితము హానికలుగదాయెను. తదనంతరము ఆరుమాసములకు మరల 6 గొఱ్ఱెలకు పైనచెప్పినట్లుగానే టీకాలువేసిరి. అప్పుడు సహా యేలాటి హానిన్ని కలిగినదిగాదు. టీకాలువేయబడని గొఱ్ఱెలన్నియు మృతిబొందినవి. గనుక 1882 సం ॥ లో టీకాలువేసిన గొఱ్ఱెలకు 1884 సం ॥ మేమాసమువరకు యీరసపటుత్వము నిలిచియుండెను. ఇందునబట్టిచూడగా రెండు సంవత్సరములవరకు దొమ్మరోగమువలని ప్రాణభయములేదని నిశ్చయింపనయినది.

2. స్విజరుల్యాండుదేశమందలి ఫ్రీబర్గుపట్టణవాసియగు స్ట్రెబెలు అనుపేరవెలసిన మృగరోగశాస్త్రిపండితుడు, ప్యాస్టియరుగారిచేత కనిపెట్టబడిన టీకాలరసము దొమ్మరోగమువలన గలిగెడు కీడును నివారింపజాలినదని రూఢిగాజెప్పుచున్నాడు. స్విజరుల్యాండు దేశములో ప్రతి సంవత్సరము రెండులక్షలరూపాయల విలువగల 2,500 పశువులు దొమ్మరోగముచేత మృతిబొందుచుండును. స్ట్రెబెలుగారు 1884 సం ॥ 2199 సంఖ్యగల పెయ్యలకున్ను యెద్దులకున్ను టీకాలువేసినారు. అందులో 1499 పశువుల సంగతిమాత్రము తెలిసినది ; టీకాలువేయునపుడు సూదిగ్రుచ్చబడినచోట సెత్తురు



కారినందుచేత రెండుపశువులకున్ను,ఉక్కగానుండిననాడు టీకాలువేయుటచేత ఒకపశువునకున్ను, జుమలా మూడుపశువులకు రసముదేహములోనికి యెక్కినదికాదు. ఇట్టుతప్పిపోవుటచేత టీకాలరసము అప్రయోజనమైనదని తోచనివ్వదుగాని ఆరసముయొక్క ప్రభావమెట్టిదోగదా చక్కగాదేహములోనికి యెక్కినపశువులకు మాత్రము దొమ్మరోగమువలన ప్రాణహానిరానివ్వక దేహంలోనికి యెక్కనివాటికి వినాశమును కలుగజేసెనని ఆరసముయొక్క మహిమను తెలుపుచున్నది. చెమ్మగలిగి జిబజిబలాడెడు పచ్చికపట్లు దొమ్మరోగమును ఉత్పాదించుటకు అనుకూలములగు ప్రదేశములని తెలియవచ్చినది. టీకాలువేయబడిన పశువులు దొమ్మబారినుండి తప్పించుకొనినవిగాని టీకాలువేయబడని పశువులకుమాత్రం యీజాడ్యము సంభవించినవి. ఈసంవత్సరము స్విజరుల్యాండుదేశమందు 20,000 పశువులకు టీకాలువేయదలచియున్నారు. టీకాలువేయునపుడు తోకగనుపులలోనికి సూదినియెక్కనివ్వక జాగ్రతతోటివేయవలయును. అట్లుయెక్కినయెడల కొన్నిగనుపులు ఊడిపడిపోవును. మఱియు ఉష్ణకాలములయందు సహితము టీకాలవేయకూడదు.

---

# 4 వ

# అధ్యాయము

## వ్రణచికిత్స.

గాయములు పలువిధములు గలవి. అవియేవిధముగా గలుగుచున్నవో దానిని బట్టియే వాటికి పేర్లుగలిగియున్నవి. వాటిలో ముఖ్యమయినవి అయిదు విధములు. అవియెవ్వియనిన:—

(1) పోటుగాయము ... (Punctured wound)
(2) చీలుగాయము ... (Lacerated wound)
(3) వ్రేటుగాయము ... (Contused wound)
(4) శస్త్రిగాయము ... (Incised wound)
(5) గుంటిగాయము ... (Gun-shot wound)

1. పోటుగాయము.——కత్తి ముల్లు కలబందఆకుకొన మొదలగు పదును గలిగి కొనకూచిగానుండు ఆయుధముతోటి పొడుచుటచే గలుగునది.

2. చీలుగాయము.——పెద్దపులి గోళ్లచే చెక్కుటవలనగాని జంతువు క్రిందపడి కొంతదూరము యీడ్వబడుటచేగాని కలుగునది.

3. వ్రేటుగాయము.——కర్రబోటి ముడిగలసాధనముతోటి మోదుటచే గలుగునది.

4. శస్త్రిగాయము.——మిక్కిలి వాడిగల పేనాకత్తిచేగాని అట్టి యితర ఆయుధముచేగాని చెదరనివ్వక నరుకుట వలన గలుగునది.

5, గుంటిగాయము.——టుపాకిబోటి ఆయుధములో గుండువేసి కొట్టుటచే గలుగునది.

చికిత్స.——రక్తము కారుచున్నయెడల దానిని నిలుపుట మొట్టమొదటి కార్యము. అట్లునిలుపుటకుగా రక్తనాడులను కట్టివేయుట ఉత్తమము.



ఈపద్ధతి వెటర్నరీ సర్జియన్ (Veterinary Surgeon) వల్లతప్పమరి యితరులవల్ల నలనిగాదు. కాబట్టి గట్టిగా కట్టుకట్టుట చేతను, బిరడాపెట్టి కన్నము మూయుటచేతను, చల్లనినీళ్లతో కడుగుటచేతను, దొరికినయెడల మంచుగడ్డచేనంటుటచేతను రక్తము కారుట నిలుచును. మరియు, యినుపకొడుపులు యెర్రగా కాల్చి గాయమునకు అంటించుట బహు ప్రయోజనకారియైయుండును. తదనంతరము, సోకుడు పరిహార-ద్రవ్యము (Disinfectant) చిక్కునెడల చలినీళ్లలోకలిపి ఆనీళ్లతోటి గాయమును కడిగి అందులో యిసుకగాని ముండ్లుగాని కొయ్యముక్కలుగాని యున్నయెడల జాగ్రతగా నేర్పరచి తీసివేయ వలయును. అవిగాయములోనే నిలిచియుండెనేని మంటపుట్టి గాయము మానదు.

గాయము పెద్దదయినయెడల అంచులుచేర్చి సూదితోటి కుట్టవలయును. కుట్టుత్రాడు గట్టిపట్టుదారముగానయిన నుండవలయును. లేదా గట్టియయి స్నిగ్ధమయిన నూలుదారముగా నయిన నుండవలయును. ఈపని గాయము పడిన తోడనే చేయుట యొప్పును. అట్లుచేయక జాగుచేసిన యెడల అంచులు ఒకటిగా చేర్చుటకు లొంగవు. ఇట్లుచేయుట అనుభవపూర్వముగానె రిగియుండవలయును గాని యెఱుగని యెడల కష్టసాధ్యము. కాబట్టి గాయముయొక్క అంచులు జాగ్రతగాజేర్చి కట్టుగుడ్డతోటి సున్నితముగా కట్టివేయుటే చాలును.

వ్రేటుగాయముల్లు.——దెబ్బవల్లనేర్పడునవిగాన కొంచెముగానో గొప్పగానో వాపు గలిగి యుండును. వేడినీరుచేగాని ఉడుకు పొట్టుచేగాని "కాపడం" (Fomentation) చేసి వాపును తగ్గించవలయును. లేదా అలిశెగింజలపిండియైనా కట్టవలయును. అనిగాయములయిన యెడల వగరు నీరు (Astringent Lotion) చేగాని, ఆరునీరు (Healing Lotion) చేగాని శుభ్రముగా కడుగవలయును. గాయము పెద్దదయి పశువులేవలేకపడియుండి కుదురుటకు కొంతకాలము పట్టునెడ తొలుత భేదికి మందిచ్చి మేత తగ్గించవలయును. ఏలననగా సహజముగా తిరిగెడు జంతువులు కదలలేక పడియుండునప్పుడును, అనివాయూలుగా చేయుపాటుచేయించుటకు వీలులేనియపుడును, సాధారణముగావాటికి వేయబడునంత మేతవేయుట మేలుగాదు.

ప్రతిదినము ఉదయకాలమందును సాయంకాలమందును కార్బాలిక్ నీరు (Carbolic Lotion) తోటిగాని మైలతుత్తపునీరు (Copper Lotion) తోటిగాని పటికినీరు (Alum Lotion) తోటిగాని సీసపునీరు (Lead Lotion) తోటిగాని తుత్తపునీరు(Zinc Lotion) తోటిగాని గాయమును చక్కగా కడిగి కార్బాలిక్ నూనె(Carbolic Oil)లోదూదితడిపి గాయముమీదనుంచి అగత్యమైనయెడల కట్టుకట్టవలయును. గాయపుఅంచులు మిక్కిలి యెర్రనయి త్వరగా మాననియెడల అప్పటమయిన కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid) పూసిగాని మైలతుత్తపుపొడి అద్దిగాని మామూలు చికిత్స చేసినయెడల గాయము చక్కగా ఆరును.

గాయముమీద ఈగలు ముసరనివ్వక తగుబందోబస్తుచేయుట ముఖ్యమయిన అంశము. అట్లుముసరినయెడల అవిగాయములో ఈపిపెట్టును. ఆ ఈపి వెంటనే ప్రిదిలి పురుగులుఅవును. గాయమందు పురుగులు పుట్టెనేని అచ్చటిమాంసమును అవి భక్షించుటచే కురుపుమానదు.

మరియుగాయముపడిన భాగము వెల్లడిగానుంచుటచే ఈగలు ముసరిగురదపుట్టి అందుమీద చలిగాలిసోకుటచే "ధనుర్వాయువు" (Tetanus) అను మహాఅపాయకరమగు జాడ్యము సంభవించుటకు కారణమగుచున్నది.

బెణుకుడుసంకటములు.—(Sprains) దెబ్బతగులుటచేత మాంసపిండముగాని (Muscle) గోలుసునరముగాని (Tendon) పట్టుడునరముగాని (Ligament) కొద్దిగానో గొప్పగానో విస్తరించిసాగినయెడల గలుగు సంకటము బెణుకుడుఅనబడును. పట్టుడునరములు తెలుచుగా బెణుకుచుండును. కీళ్లను తొలగనివ్వక కమ్ముకొనియుండు తెల్లనిదారములు పట్టుడునరములుఅనబడును. గిరసకీలు (Fetlock joint) సాధారణముగా బెణుకుచుండును. పశువుకుంటుటచేతను, ఆప్రదేశమువాచి తాకిచూడగా వెచ్చగను మృదువుగను ఉండుటచే బెణికినదని తెలియవలయును.

చికిత్స.——బెణికినతోడనే పశువును స్థాయిగానుంచి చికిత్సచేయబూనుట బహుముఖ్యమయిన అంశము. కాబట్టి మిట్టెజబ్బుగల పశువును ఒకచోటనేయుంచి బెణుకుడుస్వల్పమయినయెడల వాపుతగ్గుటకుపై వేడినీళ్లకాప



డంపెట్టి గట్టిగాకట్టుగట్టి అప్పుడప్పుడు కట్టును తడుపుచుండవలయును. ఈ చికిత్సచేత స్వస్థముగానియెడల పొక్కుమందును ఆప్రదేశముమీద తగిలింపవలయును. దీనివలన సహితములాంగనిపక్షమందు బెణికినస్థానముమీద వాతలువేయుట శ్రేష్ఠము. పశువుపాటుచేయక పూరకేయుండుకాలమందు జీర్ణశక్తితగ్గియుండును గనుక మేతతగ్గించుట యుక్తము

విరుగుటలు లేక వికలత్వములు.—(Fractures) కొమ్ములు, వట్టగాళ్లు, సడుగుఎముక, యివిసాధారణముగా విరిగేభాగములు. ఎచ్చటనయినా ఒక యెముక విరిగినదాలేదాయని తెలిసికొనవలసివచ్చినపుడు సందేహాస్పదమగు ప్రదేశమును వ్రేళ్లతో అణచి కదలించినపక్షమందు విరిగియుండినయెడల ఆముక్కలు ఒకదానితోనొకటి యొరసికొని కిరకిరలాడును. వట్టకాలువిరిగెనా పశువు ఆకాలును నేల మోపక యెత్తికొనియుండును. మరియు ఆకాలిమీద భారముమోపజాలదు. విరిగినచోటు తాకినంత మాత్రనే పశువునొప్పికి ఓర్వజాలదు.

చికిత్స.——కొమ్మువిరిగెనేని విరిగినవరకు రంపముతో కోసివేసి రక్తము కారుచున్నయెడల యింతకుపూర్వము చెప్పబడినప్రకారము నెత్తురును నిలుపవలయును (50-51 వ పుటలు చూడుము). సడుగుఎముక విరిగినయెడల పుడుకుకాపడంపెట్టి పోల్టీసుకట్టవలయును. పశువునుస్థాయిగానుంచుట ప్రధానఅంశము. విఱిగిన యెముకముక్కలు కలిసికొనక అచ్చోటచీముపట్టినయెడల కత్తితోటితెంపుపెట్టి యెముకముక్కలను చీమును బయటతీసివైచి దానిని గాయముగా భావించి అందుకుతగు చికిత్సచేయవలయును. భారీజంతువులకు వట్టగాళ్లు విఱిగెనేని చికిత్సవలన యెంతమాత్రము ప్రయోజనములేదు. కాబట్టి అట్టిజంతువులను చంపివేయుట శ్రేయము. విలువగలిగి యెందుకేనినొక కార్యమునకు అక్కఱపడెడు గొఱ్ఱెలకుగాని మేకపోతులకుగాని వట్టగాళ్లలోని యెముకమాత్రమే రెండుగావిఱిగి పైచర్మము శిధిలముగానియెడల విఱిగిన ముక్కలను ఒకటిగాచేర్చి స్థానము తొలగనివ్వక బద్దలు (Splints) వేసిబిగించికట్టి ఆరువారములుమొదలుకొని రెండుమాసములవరకు ఆలాగేయుంచవలయును. కట్టుచాలా బిగువుగానుండినయెడల కొంచెమువదిలించుటకుగా కట్టును తాకవచ్చునేగాని కట్టుగట్టిన కొన్నివారములవరకు దానినిముట్టగూడదు.

ఇండెతొలుగుట.——(Dislocation) కీలుముడిలోనుండు యెముకలు స్థానభ్రంశమును బొందుటయే యిండెతొలుగుటయనబడును. ఇండెతొలుగుటకు ముఖ్యస్థానము మునుగుముడుసు (Stifle joint). ఇదిసంభవించుటఅరుదు. అథవాసంభవించెనేని పశువు సహజరీతిగా నడువజాలక డెక్కచివరను నేలమీదజారలాగుచూ తిరుగులాడును.

చికిత్స.——స్థానభ్రంశము నొందిన యెముకను పాటున త్రోయవలయును. కాలు స్వస్థానమునకు వచ్చునట్టుల గిరసకీలుకు నొక త్రాడుగట్టి ముందరికాళ్లమధ్యనుండి ఆత్రాడునులాగి మెడకు గట్టవలయును. పిమ్మట ఆకీలుమీద పొక్కుమందువేసి పశువును ఒకచోట స్థాయిగానుంచవలయును.

గాలిబుడ్డ.——(Hernia) దెబ్బతగులుటచేతనేమి, బలవంతముగా ముక్కుటచేతనేమి ప్రేగులుగాని మరియితర భాగములుగాని తమస్థానము విడిచి చర్మసమేతముగా బయల్పొంగుట గాలిబుడ్డయనబడును. ఇదితఱుచుగా సంభవించుటకు పొట్ట ముఖ్యస్థానము. పొట్టమీద మెత్తని కంతివలె నుబ్బియుండుటచే దీనిని సులభముగా తెలిసికొనవచ్చును. దూడలకు నీసంకటము బొడ్డున బుట్టును. దీనినే గాలిబొడ్డు అనివాడెదరు.

చికిత్స.——ఈసంకటముచే నేమియు బాధగలుగదు. కాబట్టి చికిత్స అంతగా నగత్యమైయుండదు. అయినను చికిత్సచేయ దలచిరేని బయల్పొంగియుండు భాగములను చేతితోనెట్టి స్వస్థానముచేర్చి తోడనే దూదిబిళ్లవేసిగాని, కట్టుగట్టిగాని, చిర్తలువేసిగాని మరల బయట రానివ్వక బిగింప వలయును.

కంతులు.——(Tumors) దేహమందెచ్చటనేని పొంగి మెత్తగాగాని గట్టిగాగాని యుండునదే కంతియనబడును. పశువులకు కంతులుపుట్టుటకు ముఖ్యమైనచోటు అఱ్ఱు. అఱ్ఱి మీదికాడి యొరసికొని అచ్చటి చర్మమున్ను చర్మము క్రింది మాంసమున్ను మందగించి క్రమక్రమముగా కాయగాచి ఒకటిగాని పెక్కులుగాని కంతులేర్పడును. తాకిచూడగా బొదబొదలాడుచు నీరుండునట్లు కనపడునది మెత్తనికంతియనియు, వ్రేలితోనొత్తినపుడు క్రిందికి అణగక బిరుగానుండునది గట్టికంతియనియు యెఱుగవలయును.



చికిత్స.——కంతులను శస్త్రమూలముగా కోసితీసివేయుటే మేలుతరమగు పద్ధతి. ముఖ్యముగా గట్టివై బహుకాలమునుండి లేచియుండి వాటిని కోసితీసివేయకవిధిలేదు. అయినను, యిట్లుచేయుటకు సాధ్యపడనియెడల పొక్కుమందు (Blister) వేసిగాని, యినుపకొడుపుకాల్చి అంటించుటచేగాని, కారపుమందుల (Caustics) రుద్దుటచేగాని సాధ్యపరచుకొనవచ్చును. మఱియు కంతిచుట్టు నొక కట్టుదారము (Ligature) చుట్టి ముడివేసి వదిలిపెట్టుటచే కొన్నాళ్లకు ఆకంతి తెగిపడిపోవును. శస్త్రమూలముగా నొక కంతినియెత్తివేయవలసివచ్చెనా ఆసమీపమందలి గొప్పరక్తనాడుల తెగనివ్వక జాగ్రతతోటి కోయవలయును. కాబట్టి * సవ్యరక్తనాడి (Vein) మీదగాని † అపసవ్యరక్తనాడి (Artery) మీదగాని లేక వాటిసమీపమందుగాని లేచియుండెడుకంతులను కోసితీసివేయుటకంటె మఱియొకరీతిగా యెత్తివేయుట ఉత్తమము.

పుప్పి.——(Foul). పశువుల డెక్కలసందున పేరినమన్నును అప్పుడప్పుడు కడుగక అశ్రద్ధచేసిన యెడల యిట్టి సంకటము గలుగును. ఆచోటు వాచి వెచ్చగానుండుటయు, కాలుకుంటుటయు యీరోగలక్షణములు. ఇట్టిలక్షణములు తోచినవెంటనే తగు చికిత్సచేయక పరాకుచేసిరేని ఆప్రదేశమందు చీము కూడి మానుటకు చాలాకాలము పట్టును. మఱియు తఱియొత్తిగి చికిత్సచేయని యెడల రోగి పరలోకప్రాప్తి జెందుట ఆశ్చర్యముగాదు. కొన్నిసమయములందు జ్వరము సహితము కలిగియుండి పశువుక్షీణించుచుండును.

చికిత్స.——డెక్కచక్కగా వేడినీళ్లతోటి కడిగి ఉడుకు పిండికట్టి (Poultice) వగరువస్తువులను సోకుడు పరిహారద్రవ్యములను వినియోగిం

---

* సవ్యరక్తనాడి (Vein). ఈరక్తనాడి అపసవ్యరక్తనాడికి కుడిప్రక్కగానుండును. సవ్యరక్తనాడి యనునది దేహమందుప్రసరించి కల్మషపడి నలుపుఛాయనుపొందిన అశుద్ధరక్తమును కందనగాయలోనికి (Heart=రక్తకోశము) తెచ్చుచుండునది.

† అపసవ్యరక్తనాడి Artery). ఈరక్తనాడి సవ్యరక్తనాడికి యెడమభాగమందుండును. అపసవ్యరక్తనాడి సవ్యరక్తనాడికంటె లోతయి నురుగుబ్బలలో శుద్ధిచేయబడి యెఱ్ఱనిఛాయనుపొందిన శుద్ధరక్తమును తీసుకవెళ్లి దేహమునకు పంచిపెట్టును.

చి యీగల ముసరనివ్వక కట్టుకట్టవలయును. పశువుకు భేదికి మందిచ్చి మెత తగ్గించుటమేలు.

కుళ్లు.——(Foot-rot) ఇది గొఱ్ఱెలకును మేకలకును సంభవించెడు అంటువ్యాధి. ఈజాడ్యసంబంధమగు విషము జంతువునకు సోకిన ఆరురోజులకు రోగము బయల్పడును. తొలుత నీజాడ్యము ఒకకాలియందు కనుపడి వెంటనే తక్కిన కాళ్లకును సంభవించును. జాడ్యారంభమందు ఒకకాలుగాని అధికముగాగాని కుంటుట తొలిచిహ్నము. తదనంతరము కుంటుచుండెడు కాళ్లుచేతనంటి చూడగా వెచ్చనైనొప్పి గలిగియుండును. డెక్కలచుట్టూనుండెడు చర్మముమీద బొబ్బలుపొంగి వాచియుండును. ఆబొబ్బలు శీఘ్రకాలమందే చీముపట్టి చితికి అందులోనుండి దుర్వాసనగల పసిమి వర్ణపు ద్రవము కారుచుండును. పిమ్మట కొన్నాళ్లకు పక్కకట్టి పుండై డెక్కలు కొంతవరకుగాని పూర్ణముగాగాని ఊడిపోవును. ఈజాడ్యము తగిలియుండునపుడు జంతువు మందగించుకొని జ్వరము గలిగి మేతమీద హితవుదప్పియుండును. చక్కగా సంరక్షింపబడని యెడల కండతగ్గిపోయి అంత్యమందు బహు ఆయాస మరణము ప్రాప్తించును.

చికిత్స.——జాడ్యగ్రస్థములగు జంతువులను తక్షణమే వేరుగానుంచి తోడనే చికిత్సచేయ బూనవలయును. రోగము స్వస్థపడుటకు తగు సదుపాయముల నన్నింటిని చేయవలయును. అశ్రద్ధచేసిరేని జాడ్యము కుదురుననెడి ఆశను విడువవదగును. వేడినీళ్లతోటి కాళ్లను చక్కగా కడిగి స్పోకుడు పరిహారద్రవ్యమును పూయవలయును. ఊడిపడిపోయిన గిట్టలను దూరముగా తీసివేయనగును. మైలతుత్తపునీరు (Copper Lotion) తోటి కాళ్లను కడుగుట ప్రయోజనకారియైయుండును. ఈగల ముసరనివ్వక గిట్టలకు ఓడకీలు (Tar-తారు) పూయుట యుత్తమము. ప్రతిరోగికి వెవ్వేరుగా చికిత్సచేయుటకు సాధ్యపడని సమయమందు నేలమీద ఒక అంగుళముయెత్తున విరియబోసిన సున్నము (Slaked lime) పరచి దానిమీదవారమునకు రెండు పర్యాయములు వాటిని నడపించుటమేలు. ఈజాడ్యము సంభవించియుండునపుడు రోగిని తడినేలమీద నడిపించ కూడదు.

కాయ లేక కదుములేక పుండు.—(Gall) అన్యపదార్థముతోటిచర్మము ఒరసికొనుటచేతగలుగునది, అత్తిమీది కాడియొక్క రాపిడిచేత గలిగెనేని



అత్తిపుండు అనియు పగ్గపు రాపిడి వలన గలిగెనేని రాపుండు అనియు వాడుదురు. సాధారణముగా సంభవించునది అత్తిపుండు. కాడి శుద్ధమయినది కాకపోవుటచేతను, అత్తిమీద ఆనెడు భాగమునకు వెలపటి ప్రక్క నక్కగా చెక్కి నునుపుచేయక పోవుటచేతను, ముందు వెనకలయందు భారము సమానముగా వేయక పరాకుచేయుటచేతను అత్తిపుండు బడును. అందుచేత నచ్చటి చర్మము లేచిపోయి దండె (Abrasion) పడును ; ముట్టినయెడల పశువుకు నొప్పిగలుగును. దీనిని అంతగా యోచింపక పాటుచేయించుటచేత పశువుపనరాని బాధపడును.

చికిత్స.——దండెపడుటకు హేతుభూతమయిన పదార్థమును తొలిగించి పశువుచేత పాటుచేయించక ఒకచోటనుంచి ఘాటయినపటికి నీరుతోటి (Strong Alum Lotion) అద్దుగడగవలయును. పటికినీరునకు బదులుగా కార్బాలిక్ నూనె (Carbolic Oil) పూసి యీగలచేరనివ్వక ఆచోట గుడ్డగప్పవలయును.

## విషపురుగులకాట్లు, (Bites of Venomous Animals).

పాముకాటు—(Snake-bite) విషజంతువులలో త్రాచుపాము మహాభీతిని అపాయమును కలుగజేయునది. దీనికాటు మనుష్యులకును మృగములకును ప్రాణహాని గలుగజేయును. దీనివిషమును హరించుటకు అనుకూలపడు అవుషధమును యింతవరకు కనిపెట్టినవారు యెవ్వరును లేరు.

కాటులక్షణములు.—త్రాచుపాము కరచినవెంటనే కాళ్లలో లివ తప్పి ప్రాణితనదేహమును భరింపజాలదు. మఱియును కాళ్లు తొట్రుబడుచుండును. కాటుపడిన జంతువు మైకముగొనినట్లు క్రిందబడి పొర్లాడును ; అమితముగా నోటజొల్లుకారుచు గుటక మ్రింగజాలక వాంతివచ్చినట్లుండి యూపిరాడకయుండును. సర్వాంగములయందు యీడ్పులు కలిగియుండును. స్మారకము తప్పి మెల్లమెల్లగా బుసపెట్టుచుండి తోడనే మృతిబొందును. మృగములకు దేహమందు వెంట్రుకలు మెండుగానుండుటబట్టి సర్పదష్టమయినపుడు కోరసోకిన చోటును నిదానించుట కష్టతరము ; అయినను కాటుపడిన ప్రదేశము కొంచెముగా వాచియుండును గనుక కనుగొనవచ్చును.

చికిత్స.——విషము రక్తములో ప్రవేశించి తనదుర్గుణమును చూపుటకు

ముందే నిమిషమయినను కాలయాపనము చేయక చికిత్స చేయబూనుకొనవలయును. అవుషధమూలముగా చికిత్స చేయుటకు నేమియు లేదు గావున కాటుపడియుండు స్థలము కాలు అయినయెడల కాటుకుమీదుగా గట్టిపగ్గముతోటిగాని నాడాతోటిగాని బిగియగట్టి పూర్ణముగా సారాయము మొదలగు ఘాటయిన ఉద్రేకకరములగు వస్తువులను (Stimulants) త్రాగించి యొక కత్తితోటి ఆప్రదేశము చీల్చి అచ్చటి విషరక్తమంతయు కారిపోనివ్వవలయును. మింగుటకు శక్తిగలిగియుండు పర్యంతము సర్పదష్టమయిన ప్రాణికి మాటిమాటికి సారాయము నిచ్చుచుండవచ్చును. పిమ్మట యినుపకొడువును యెర్రగా కాల్చి గాయముమీద లోతుగా అంటింపనగును, లేదా కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid) గాని తక్కిన కారపు మందులనుగాని (Caustic Agents) వేయవచ్చును. సర్పదష్టమయి విషము యెక్కుటకు పూర్వమే యిట్లు చేయుటవలన యెద్దియేని కొంత ప్రయోజనము కలదు గాని కాలయాపనము చేసినయెడల ప్రయత్నములన్నియు నిరర్థకములగును. కాటుబడిన భాగములు నరికివేయుటకుగాని కోసివేయుటకుగాని అనుకూలమగు ప్రదేశములు అయినయెడల విషముయెక్కుటకు పూర్వమే ఆట్టిభాగములను ఖండించివేయుట బహులాభకారియయియుండును.

తేలుకుట్టుట—.(Scorpion Sting) క్షుద్రమృగములకు తప్పతక్కిన జంతువులకు తేళ్లుకుట్టుటచేత ప్రాణోపద్రవముగలుగుట అరుదు. తేలువిషము అపాయమయిన మంటను నొప్పిని గలుగచేయును. కుట్టినచోటు నాచి వెచనయి నొప్పిగలిగి బల్లెముతోటి పొడిచినట్లుండును. కాబట్టి ఆప్రదేశమును సులభముగా కనుగొనవచ్చును. కాలు గుట్టినయెడల పశువు కుంటుచునడుచుటే చిహ్నము.

చికిత్స ——కుట్టినచోటికిమీదుగా నూలదారముతోటి గట్టిగాబిగించికట్టి ఉద్రేకకారులగు పదార్థములను (Stimulants) త్రాగించి ఇపికాక్ పొడిని (Ipecacuanha Powder) అమ్మోనియాద్రావకమునున్ను (Liquor Ammonia) చేర్చి పెళాస్త్రిగాచేసి కుట్టినచోట నంటించవలయును; కుట్టినజాము సేపటికి విరేచనమగునటుల మందివ్వనగును.

పురుగులు లేక క్రిమి—(Maggots) ఈగలుమూగి యీపిపెట్టునటుల గా



యములను కురుపులను వెల్లడిగానుంచుటచేత అచ్చటి యీపి ప్రిదిలి నూలుదారములవలెనుండు తెల్లని పురుగులు ఉత్పత్తియగును. ఇవే క్రిమియనబడును.

ఇట్లుపురుగులుపుట్టుట పశువుయొక్క స్వంతదారునకు అక్కఱలేనితనపు చేతగాని శ్రద్ధపుచ్చుకొనునెడల నిట్టి దురవస్థ నివారితమగుటకు సంశయములేదు. గాయమందుగాని కురుపునందుగాని పురుగుపట్టినయెడల దురదబుట్టి అచ్చోటిమాంసము చెడి ఆభాగమంతయు వాచి మహాఅపాయమును కలుగజేయును.

చికిత్స.——గాయములమీదగాని కురుపులమీదగాని బట్టగప్పి ఈగల మూగనివ్వక ఉంచుటముఖ్యము. బట్టతోటి మూయుటకు వీలుగానియెడల విసనకఱ్ఱతోటివీచిగాని, ఘాటయినమందు కురుపుగాయములకు పట్టించిగాని యీగలవాలనివ్వక బందోబస్తుచేయవలయును. పురుగులుపట్టినయెడల సాధ్యమయినంతవరకు చేతితోగాని చింటాతోగాని వాటినియెత్తివేసి పిమ్మట కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid) ఒకపాలు కర్పూరము పంద్రెండు పాళ్లుగాని, కార్బాలిక్ ఆసిడ్ ఒకపాలు వేపచమురు యిరువై పాళ్లుగాని కలిపి పుండుకుపట్టించవలయును. కర్పూరతయిలము (Turpentine) ప్రత్యేకముగాగాని, నూనెతో చేర్చిగాని పట్టించినయెడల పురుగులు చచ్చును.

పుండ్లు, లేక కురుపులు—(Ulcers) దేహమందెచ్చటనయినా వాచుటచేత కురుపులు యేర్పడును. ఇవి పలువిధములయియుండునవి. ఎరుపురంగుగలిగిన కురుపులు త్వరగా మానును, తెలుపు వర్ణముగలయవి జాడ్యమూలముగా సంభవించునవి యని యెఱుగవలయును. ఇట్టికురుపులు బాధకరములయిన యెట్టిచురుకుగల మందులుపట్టించినను మానుటకు కొంతకాలము చెల్లును. కురుపులేచినతోడనేదాని విషయమై శ్రద్ధపుచ్చుకొనని యెడలదానిచే దేహసౌఖ్యము చెడుటయేగాక అదిపెద్దదై అల్లుకొని ఆప్రదేశమందలి మాంసమును కుళ్లజేయును. తొలుత ఒక కురుపు దద్దుగాలేచి క్రమేణ గుండ్రముగా విస్తరించుకొని తనచుట్టూనుండు మాంసము చెడక సుస్థితియందే యున్నదని రూపింపవలెనోయనునట్లు అంచుయేర్పడి మిక్కిలియెర్రనై రసికారుచుండును. ఈరసిక దుర్వాసన గలిగియుండుటయు గలదు, లేకుండుటయుగలదు. దుర్బలపడియుండు జంతువులే పుట్టమారు కురుపులచే బాధనొందుటకు మిగుల లోనయి యుండునవి.

చికిత్స.——ఒకనాడు కారపు మందులను (Caustics) మరునాడు వగరుగలమందులను (Astringents) మార్చిమార్చి కురుపునకు పట్టించుట కంటె శ్రేష్ఠతరము మఱియొద్దియునులేదు. కారపు మందుల సేవచే కురుపు ఉద్రేకమునొంది వగరు వస్తువులచేత ఆరిపోవును. కారపుమందులు చిక్కనియెడల యినుపకోడుపు కాల్చి కురుపుమీద జాగ్రతతోటిపైపైననే అంటించవలయును. రోగి బలముచెడి యుండునెడల యీచికిత్సచేయుటేగాక దేహపటుత్వకారులగు మందులను (Tonics), సారవంతమైన మేతను, సహితము యిచ్చుచుండవలయును.

బీజనిర్మూలనము.——(Castration) * అండకోశమును (Scrotum) కత్తితోటి చీల్చి అందులోని బీజములను వేర్లువరకు గోసి తీసివేయుట బీజనిర్మూలనము అనబడును. ఇట్టికృత్యమును బొందిన జంతువునకు ఆడుపశువుమీద వాంఛయుండనేరదు, అథవా కామప్రేరితమైదాటినను అట్టి ఆడుపశువు చూలాలుగానేరదు. లేగప్రాయమపుడే బీజములదీసివేయుట యుత్తమము - ఇట్లుచేయుటకు కాలము అత్యుష్ణముగాక, అతిశీతలముగాక, సమశీతోష్ణముగానుండునపుడు మంచి తరుణము - సాధ్యమయ్యేనేని బీజనిర్మూలనముచేయుటకు ముందటిరోజున లేగకు భేదిమందు యివ్వవలయును. బీజముల దీయు పద్ధతులు పలువిధములయి యుండినను యీదిగువ నుదహరింపబడు మార్గము బహుకాలపు అనుభవమువలన నాపసమ్మతిగ్గై యుండునది.

పశువును క్రిందబడద్రోచి కాళ్లుకట్టి వెన్నునేల నానునట్లు పరుండబెట్టి ముందుగా నొక వృషణమును యెడమచేతనప్పళించి పిమ్మట మీదిచర్మమును వెనుకకుబోనెట్టి బిఱ్ఱుగాబట్టుకొని బీజము బయటవచ్చుటను వలయునంతమాత్రము చర్మమును చీల్పవలయును- ఎడమచేతనే, బయల్పడిన బీజమును విడువకపట్టుకొని చర్మమును మీదికిజార్చి బీజముయొక్క † మూలనర

* బీజములపయిన కప్పుకొని యుండెడు చర్మము. ఈభాగమందలి చర్మము తక్కిన ప్రదేశమందుండు చర్మమునకంటె సున్నితమైరోమవిరహితమైయుండును.

† మూలనరము - రక్త, శుక్లనాడులు అన్యోన్యముగా నీమార్గమున ప్రసరించును - ఇదియొక త్రాడువలె నేర్పడి బీజము దీనికి వ్రేలుచుండును.



మును తడవి కనుగొని యినుపచిర్తల (Clams) సందున ఆనరమును నొక్కిపట్టి చిర్తలు చెదరనివ్వక యొకదారముతోటి కొనలు బిగియగట్టి అర్ధవద్దును గలిగియుండు యినుపకోడుపులను కాల్చి ఆనరమును వాటిచే మెల్లమెల్లగా కోయవలయును - కోసినవెనుక ఆమూలనరములో నుండినరక్తనాడులయొక్క ద్వారములు మూసికొని నెత్తురుకారుట పూర్ణముగా నిలిచిపోయిన అంశమును ముందుగా చిర్తలను కొంచెముగా సడలించి రూఢిపరచుకొని పిమ్మట చిర్తలను సడలించవలయునుగాని తటాలున వదిలింపగూడదు - రక్తము కారుచుండెనేని చిర్తల బిగించి అగ్నితప్తమైన యినుపకోడుపుచే రక్తము నిల్చిపోవుపరకు మూలనరమును చక్కగా కాల్పవలయును. పిదప చిర్తలను వదిలించి గాయమునకు లోపల వెలపల వేపచమురు బూయుచుండవలయును. దొరకు నెడల కార్బాలిక్ ఆసిడ్ ఒకపాలున్ను వేపచమురు 40- గాని 50-గాని పాళ్లున్ను మిశ్రమము చేసి వేడినీళ్లతోటి గాయము చక్కగా కడిగి రోజునకు రెండుపర్యాయములు పూయవలయును- బీజములు తీసిన వెనుక ఆప్రదేశము కొంచెముగానో గొప్పగానో తప్పక వాచును, కాబట్టి యొకచట్టిలోనీళ్లుపోసి అందులో వేపాకువేసి మరగబెట్టి అచట్టిని వాచియుండు భాగమునకు క్రిందుగా పట్టినయెడల నీటి ఆవిరి గాయమునకు లెస్సగా తగిలి వాపు తగ్గిపోవును - ఉదయసాయంకాలములయందు అర్థగంటసేపు తిన్నగా ఆపశువును కాలుసాగ నడిపించుట మేలు. తొలివారమంతయు సులభముగా జీర్ణమగు మేతను పెట్టవలయును- పిమ్మట క్రమక్రమముగా మామూలు మేతనే వేయవచ్చును.

ప్రస్తుతము వాడుకలో నుండునట్టి బుడ్డగొట్టు, లేక కాలుపట్టు, లేకవట్టగొట్టుపద్ధతి మహాక్రౌర్యము. మఱియు కొన్నిసమయములందు బీజములు చక్కగా నలుగకపోవుటచే కార్యము అపూర్ణమైయుండును - అయినను వృగవైద్యశాస్త్ర) సంబంధమగు విద్యప్రబలమైయిట్టి క్రూరకృత్యమును అడగద్రొక్కగలదని నమ్ముచున్నాము.

వాతలువేయుట.——(Actual Cautery) ఇనుపకోడుపులు కాల్చి పలుబాధ్యములకు పలువిధములుగా చర్మముమీద గీట్లువేయుదురు - తలచినచోట్లనంతట కాల్పక మితముగా వాతలు వేయుట, బెణుకుడు ఝొముక నెమగుట కుంట్లు మొదలగు సంకటములయందు బహు సహాయకారిగ్గై

యుండును - కొందరు అలంకారార్థమై దేహమంతట వాతలు వేయుదురు. ఇట్లు చేయుటచే పశువునకు కొరతపాలిన బాధకలుగుటయేగాని ప్రయోజనమేమియు లేదు. కొడుపులు (Firing Irons) యెర్రగాగాల్చి వాతవేయుటచే నచ్చటి చర్మము తెగి రక్తనాడులు విచ్ఛిన్నములయి ఆప్రదేశము చూపునకు వికారముగా నుండును, కాబట్టి కొడుపులను మధ్యమముగా కాల్చి బహులాఘవముతోటి చర్మముమీద తేలికగా గీతలువేసి, వెంటనే వాటిమీద ఓషకిలుబూసి పశువుపండ్లతోటి గీరుకొనకుండునటుల కొన్నాళ్లు మెడను కట్టియుంచవలయును - ఒకవారము జరిగిన పిమ్మట మాడిన చర్మము మృదువెక్కరాలి పోవుటకునై క్రొవ్వుదెచ్చి వాతలమీద మెల్లగా బూయవలయును. మరియునట్టి ప్రదేశమందు దుర్మాంసము పెరుగుచుండు నెడల పటికిపొడిగాని మైలతుత్తపు పొడిగాని అద్దనగును.

పొక్కుమందులు.—(Blisters) మృగవైద్యమందు యీమందులు బహువిస్తరించి వాడబడుచున్నవి. దేహమందలి యేభాగమైనను వాచినొప్పిగలిగి యుండెనేని అట్టివాపును, నొప్పిని హరించుటకు యీమందులు బహుతరముగా అనుకూలించును. కుంటుసంకటములను స్వస్థపరచుటయందు సహితము వాడెదరు. ఈమందులు పలుదినుసులతోటి తయారుచేయబడును. అయినను చీనాదేశపు పొక్కుటీగలు (Chinese Fly), స్పెయినుదేశపు పొక్కుటీగలు (Spanish Fly), ఆవాలు, కర్పూరతైలము, యివి- మహాశ్రేష్ఠములు. పొక్కుమందులు ఘాటుగాగాని శాంతముగాగాని యుండవలయునని తలఛితిమా తలచినట్లే చేసికొనవచ్చును. పొక్కుమందువేయవలసివచ్చినపుడు వేయదలచిన ప్రదేశమందలి వెంట్రుకలను కత్తెరచేతగాని మంగలకత్తిచేతగాని ఖండించి ఆచోటు శుద్ధిపరచి చర్మముయొక్క లావును బట్టి యిరువదినిముషములు మొదలుకొని ముప్పది వరకు మందును చక్కగా రుద్దవలయును. కడుపుమీదగాని రొమ్ముమీదగాని పొక్కుమందు వేయవలసివచ్చెనా ఆప్రదేశమందంతట పూయక కొంతభాగమున మాత్రమే ప్రయోగించనగును. లేనియెడల మఱియొక పర్యాయము యిట్టిమందును వేయవలసివచ్చినపుడు తొలుత తగిలించబడిన ప్రదేశమందే పూయవలసియుండును. ఇట్లు చేయుటచేత కార్యము నిరర్థకమగును; కాబట్టి కొంతస్థలమును వదిలి ఔషధము బూయుట క్షేమకరము. పొక్కుమందు వేయబడిన కొంతసేపటికి అది తన ఔషధగుణమును కనుపర



చబూనును. అట్టిసమయమందు పశువు మందువేయ బడియుండు ప్రదేశమును కఱచికొనుటకును రుద్దుకొనుటకును ప్రయత్నించును. కాబట్టి అట్లు చేసికొన నివ్వక తగుసాధకము చేయవలయును. అజ్ఞానముచేతగాని అజాగ్రతచేతగాని యెవరకున్న యెడల యీఔషధము అంటినప్రదేశములందు స్థిరమయిన మచ్చలు యేర్పడి వికారముగా గనుపడును. పొక్కుమందుల వలన గలుగు బొబ్బలకు సహితము చికిత్స అగత్యము. రెండుమూడురోజులు అయిన పిమ్మట కోమలముగానుండెడి ఆప్రదేశముమీద క్రొవ్వునుగాని నూనెనుగాని తిన్నగా రుద్దవలయును. తదనంతరము వేడినీళ్లు, సబ్బు, వీటితోటి శుభ్రపరచి ఆరినపిమ్మట మరల క్రొవ్వు బూయవలయును.

పొక్కుమందు వేయబడిన స్థలమందుగాక ప్రక్కల సహితము యీమందు అంటినట్లు గుర్తులు కనుపడినయెడల అట్టిచోట్లయందును క్రొవ్వునుగానినూనెగానిపూయవలయును.

కీలుముడిమీద పొక్కుమందు రెండుమూడు పర్యాయములు వేయవలసివచ్చెనేని మొదటిపర్యాయమునకును రెండవపర్యాయమునకును అథవా నెలరోజులకు మూడువారములు మధ్యవ్యవధిగలుగజేయవలయును.

కట్లు.—(Bandages) నారగుడ్డలతోగాని ఫ్లానల్ (Flannel)తోగాని యేర్పరచబడిన కట్టుగుడ్డల్లు, కాళ్లకు దెబ్బతగులుట బెణుకుట మొదలగు సంకటములయందు బహుప్రయోజనకారులయియుండునవి. కట్టు కేవలము బిఱ్ఱుగానుండకూడదు, మఱియు చెదిరిపోనూ కూడదు. కట్టుగుడ్డలు ముఖుగు మొదలు ఆరు అడుగుల పొడవును మూడు మొదలు నాలుగు అంగుళముల వెడల్పును గలిగియుండవలయును. గుడ్డనంతయు కాలిచుట్టూచుట్టిన పిదప ముడివేయుటకుగా నొకకొనను యెనిమిదిగాని లేకపదిగాని అంగుళముల పొడవున చీల్చియుంచవలయును, కట్టుగట్టుటకు ముందుగా చీల్చబడియుండుకొన మొదలుకొని గుడ్డను చుట్టగా జుట్టవలయును, కాలికి బిగించినపుడు చీల్చినచివర చేతమిగులును. తడికట్టుగాని ఉడుకుకట్టుగాని కట్టవలసివచ్చినపుడు ఫ్లానల్ గుడ్డయిన యెడల నీరు అధికముగా కావలసినచ్చును కాబట్టి ముందుగా దానిని నీటిలో నానవిచ్చి పిమ్మట కట్టినపక్షమందు చెమ్మ చాలాకాలము వరకు ఆగియుండును.

కాపడం.—(Fomentation) దేహమందలి యేభాగమునకైనను ఉష్ణమునుగాని శీతలమునుగాని ప్రయోగించుట కాపడం అనబడును. బహురోగములయందు యీకార్యముచేగలుగు ప్రయోజనము జెప్పనలవిగాదు. ముఖ్యముగా వాపుసంబంధములగు జాడ్యములయందును, సద్యోనొప్పులను (Acute pains) నివారించుటయందును, కాపడం యిచ్చుట అత్యంతలాభకారిగాయుండును. కాపడం యిచ్చుటకు నుపయోగింపబడు నీళ్లలో అగత్యమయినయెడల అవుమగమును సహా మిశ్రమము చేయనచ్చును. ఇట్టికార్యమును నిర్వహించునపుడు అజాగ్రతగా ప్రవర్తించిరేని రోగికి మేలుగలుగనేరకపోవుట అటుండగా మీదుమిక్కిలిగా కీడుచేకూరక తప్పదు. కాబట్టిరోగి చలిగాలి సోకనివ్వక యొకయింటియందో వసారాయందో యుంచి ఒకచట్టిలో జలముపోసి పొయిమీదనునిచి చక్కగా మరగబెట్టి మరగుచుండగా నొకగొంగడినిగాని ఫ్లానల్ (Flannel) చాకమునుగాని అందులోముంచి మెలిపి నీరును పోగొట్టి రోగి ఓర్వదగినంత వేడియుండగాదానినీ వాచినప్రదేశముమీదనుంచి ఆవిరిపైకివెళ్లనివ్వక యొకపొడిబట్టతోటి. మూయవలయును గొంగడి చల్లనగు కొలది కోరినన్నిమార్లుయీవిధముగానే చేయనగును.

చిర్తలు.——(Clamps or Clams) బీజములను, కంతులను నిర్మూలనము చేయునపుడు వాడబడేడుసాధనము చిర్తలనబడును. ఇవికొయ్యతోటిగాని యినుముతోటిగాని చేయబడును. ఈ యాధ్యాయమందు జెప్పబడినచొప్పున బీజనిర్మూలనము చేయుటయందు ఉపయోగించెడు చిర్తలు యినుముతోటిచేయబడునవి. వీటియొక్క లోయంచులు పదునులేకయుండుట యొక్కటేగాని తక్కినఅంశములయందు యీదేశమందంతట వాడుకైయుండు పోకవత్తిబోలియుండును.

కట్టుదారము.—(Ligature) పట్టు, గోగునార, వెంట్రుకలు, నూలు— వీనితోటి యీదారముచేయబడునది. కంతులను పోగొట్టుటయందును, తెగినరక్తనాడులను బంధించుటయందును, విషపురుగు కరచినభాగములచుట్టూ కట్టుచేయుటకును, యీదారముమిగుల నుపయుక్తము. కార్బాలిక్ నీటిలో (Carbolic Lotion) నాననిచ్చి యెండబెట్టి అటుపిమ్మట అగత్యమయినకార్యములకు వినియోగించుకొనుట శ్రేయము.



*పోల్టీసులు.—(Poultices) ఇవిచేతనంటిచూచినయెడ మృదుతరములయి యుండు చికిత్సాసాధనములు. ఇట్టిసాధనములు పలుసంకటములకు పలువిధములగు పదార్థములతోటి తయారుచేయబడుచున్నవి. వీటి ప్రయోగముచే నొప్పినివారితమై వాపుతగ్గి కురుపులు పైకితేలి వచ్చును. గోధుమతవుడునుగాని అలిసెగింజలపిండినిగాని వేడినీళ్లతోటి పిసికిమెత్తనిముద్దచేసి సంకటపడిన స్థలముపైగట్టుట బహు ఉపయుక్తము. మఱియునట్టి ప్రదేశమందలి యుష్ణమును పైకివెళ్లనివ్వక ఆపవలసివచ్చినపుడు ఉడికిన ఉలవలను మెత్తగా ముద్దజేసి పలచని బట్టలోవేసి కట్టుటమహాశ్రేష్ఠము.

కురుపులకును, దుర్గంధముగలగాయములకును మీదనుదహరింపబడినట్లు పిండికట్టునపుడు ఆపిండితోటి బొగ్గుపొడిజేర్చి కట్టుట అనుకూలమయియుండును.

కారపువత్తులు.—(Setons) బద్దపాటుగల కారపుసూది (Seton Needle) మూలముగా చర్మముక్రిందనుండి దూర్పబడెడు నాడాముక్కలుగాని, దారములుగాని, కారపువత్తులనబడును. ఘాటయినపొక్కుమందులు యెట్టిప్రయోజనమును సంపాదించునో అట్టిప్రయోజనమునే కారపువత్తులవలన సహితము సాధింపనచ్చును. కారపువత్తినెక్కించుట మహాసులభమైన విషయము. కారపుసూదికి దారముగూర్చి ఒకఅంగుళముపొడవున చర్మమును కత్తితోటిచీల్చి తద్వారముగుండా యెంతదూరము వత్తిపారవలయునో అంతవరకు సూదినియెక్కించి ఆకొనయందు సహితము చర్మమును చీల్చి సూదిని బయటలాగి కారమును అచ్చటనిలుపవలయును. దారపుకొనలయందు బెండ్లుకట్టవలయును, లేదా కొనలు వేర్వేరుగా ముళ్లువేయుటచాలును. కారపువత్తియెక్కించుటకు పూర్వము ఆవత్తికి యెద్దియేని నొకపొక్కుమందును పూయుట యుత్తమము. మఱియుదినదినము నట్లుచేయుచుండుటయేగాక వత్తినిక్రిందికి జార్చి శుభ్రముగా కడుగుచుండవలయును, అగత్యమయినయెడల క్రొత్తవత్తినెక్కింపవచ్చును. కంతులను మాన్పుటయందును, దుశ్శల్యవృద్ధిని (Bony Enlargements) నివారించుటయందును కారపువత్తులు బహుఅనుకూలములు.

---

బియ్యము, నువ్వులు మొదలగువానిపిండిని ముద్దగాచేసి కురుపులకు గట్టుట. ఈపద్ధతినే సాధారణముగా "సట్టు" అనివాడెదరు.

బద్దలు లేక పేడులు.——(Splints). వికలమయిన యెముకను స్వస్థానమందుంచుటకయి యుపయోగింపబడెడు సాధనములు బద్దలు అనబడును, ఇవికొయ్యతోటిగాని, తగరముతోటిగాని, తోళ్లతోటిగాని చేయబడునవి. వికలత్వము నొందిన చోటు బద్దలువేసి బిగించుటకు పూర్వము బద్దలక్రింద బోరెము (Pad) వేయవలయును, లేనియెడల చర్మమునకు చెరుపు కలుగును.

కుట్లు.——(Sutures) గాయముయొక్క అంచులనుచేర్చి యుంచుటకయి అచ్చటచ్చట కుట్లువేయబడును. కుట్టుదారములు పట్టు, తంతినరములు, లోహము, నూలు- వీటితోటి చేయబడును. కుట్లువేయుటకు మిక్కిలి అనుకూలించునది కుట్టుసూది (Suture Needle) అయినను సాధారణమైన గట్టి దబ్బణమే చాలును. కుట్టువేయుటకు పూర్వము కార్బాలిక్ నీరు (Carbolic Lotion) చిక్కనెడల దారములను ఆనీటియందు తడుపుట శ్రేయము.

ఆసనప్రయోగములు.——(Enemas) కొన్ని చికిత్స సాధనములను ఆసనమూలముగా ప్రయోగింపబడుటచే నవి ఆసనప్రయోగములనబడును. ఇట్టి చికిత్సాసాధనము సాధారణముగా శుద్ధనేడినీరు. తఱుచుగా సబ్బుగాని చమురుగాని నీళ్లలో కలిపి ప్రయోగించుట గలదు. మందును నోటిగుండా కడుపులోనికిచ్చుటచేత ఆమందు యెట్లు గుణియగునో ఆసన మూలముగా నిచ్చుటచేత సహితము అట్టిప్రభావమునే కనుపరచును; కాబట్టి కొన్నిసమయములందు అవుషధములను నీళ్లలో గలిపి గుదద్వార మూలముగా నివ్వబడును. మలబంధము (Constipation) అనుసంకటమందు యిట్టి ప్రయోగము బహు అనుకూలించును. ముఖ్యముగా భేదిమందును యిచ్చుటకు పశువు తాలియుండనపుడు పేగులలోని కల్మషమును విరేచించుటకు నిది మంచి పద్ధతి. పిచికారిచేగాని, పొన్నలి (Funnel) మూలముగాగాని నీరును ఆసనములోనికి యెక్కింపవచ్చును. ఈసాధనములు దొరకనియెడల పశువుయొక్క ఉచ్చబుడ్డను సంపాదించి దాని ద్వారమునకు వెదురు గొట్టముకట్టి దానిని గట్టి సధ్యాఉపయోగపరచు కొనవచ్చును.

5-వ

# అధ్యాయము.

## ఔషధములు

## వాటిగుణములున్ను ప్రయోజనములున్ను

## వాటిని సిద్ధముచేయుపద్ధతులున్ను.

ఈగ్రంథములో యింతకుముందు వివరింపబడిన అవుషధములకుతోడుగా మరికొన్నిటిని సహితముచేర్చి విస్తరించి మరల విశదముగా యీ ఆధ్యాయమందు నుదహరింపబడియున్నవి. మఱియు పలువిధములగు అవుషధపట్టీలు సహా యీఆధ్యాయమందే గలవు. అవి పశువుల స్వంతదారులకు మిగుల సుపయుక్తములుగానుండుటకు సంశయములేదు. ఇదిగాక యింగ్లీషు తులామానములున్ను కొలమానములున్ను అందుకు సరియైన స్వదేశతూనికెలున్ను కొలతలున్ను యిచ్చోట వ్రాబడియున్నవి.

ఈ ఆధ్యాయమందు ఉదహరింపబడిన అవుషధప్రమాణములు పూర్ణవయస్సుగల పశువులకున్ను గుఱ్ఱములకున్ను అని యెఱుగవలయును. అర్ధవయస్సుగల పశువులకుగాని గుఱ్ఱములకుగాని యీప్రమాణములో సగమున్ను దూడలకున్ను గొఱ్ఱెలకున్ను పాతికభాగమున్ను యివ్వవలయును. ద్రవరూపముగల అవుషధములను జంతువుల వయోభేదమునుబట్టి విభజించునపుడు కొలుచుటకు పాత్రలులేనిపక్షమందు తూచిభాగించుకొనవచ్చును. అందువలన యేహానియుంగలుగనేరదు. ఇచ్చటవివరింపబడిన అవుషధములలో కొన్నితప్ప తక్కినవన్నియు యీదేశమందు ఉత్పత్తియయ్యెడి వగుటచేత యేదుకాణములోనయినా సులభముగా చిక్కును. గొప్పపట్టణములయందుపాపులలో సమస్తవస్తువులు విక్రయింప బడుటవలన కోరినదినుసులు అచ్చట నిరభ్యంతరముగా దొరకగలవు.

ముష్టి, పాషాణము మొదలగు విషవస్తువులను అనుభవపూర్వకముగా వాడుకచేయువారు తప్పయితరులు యెంతమాత్రము వాడకూడదు. ఆ అవుషధములుగల సీసాలమీద స్వభాషలో గొప్పఅక్షరములతోటి "విషము" అని వ్రాసి చీటీముక్కలను అంటించి కుర్రవాండ్రకు అందని ప్రదేశములయందు ఉంచవలయును.

ఆఘ్రాణద్రావకము (అమ్మోనియా) గల సీసాలను నూతనముగా తెరువవలసి వచ్చినపుడు అంతకు పూర్వము ఆ సీసాకు శైత్యోపచారము చేసి (అనగా చల్లని నీళ్లలో ఆసీసాను ఉంచిగాని లేక తడిబట్టచుట్టి అప్పుడప్పుడు నీళ్లుచల్లుటగాని శైత్యోపచార మనబడును.) పిమ్మట బిరడా తీయవలయును. అట్లుచేయక షాపులోనుండి కొనితెచ్చుకొన్న సీసాను తెచ్చుకొన్నట్లుగానే బిరడా విప్పిన యెడల ఆసీసాలో చేరియుండు వాయుబలిమిచేత బిరడా తీసిన తోడనే అందలి ద్రావకము మీదికెగసి ఆబుడ్డిని తెరచిన మనిషి యొక్క కండ్లయందుగాని యితర భాగమందుగాని పడి చెరుపు గలుగజేయును.

---

ఇంగ్లీషు తులామానమునకు సరియయిన స్వదేశపరిమాణము.

| | | | |
|---|---|---|---|
| 1 | గ్రైను (Grain) | = | ½ (అర్థ) గురిగింజయెత్తు |
| 1 | డ్రాము (Drachm) | = | 1 వరహాయెత్తు |
| 1 | ఔన్సు (Ounce) | = | 2½ రూపాయలయెత్తు |
| 1 | పౌను (Pound) | = | 38½ రూపాయలయెత్తు |

స్వదేశతులామానమునకు సరియయిన యింగ్లీషు పరిమాణము.

| | | | |
|---|---|---|---|
| 1 | గురిగింజ | = | 2 గ్రైనులయెత్తు |
| 1 | బండిగురిగింజ | = | 4 గ్రైనులయెత్తు |
| 1 | వరహా | = | 1 డ్రాము |
| 1 | రూపాయ | = | 3 డ్రాములు |
| 1 | పలము | = | 9 డ్రాములు |

ఇంగ్లీషు కొలమానమునకు సరియైన స్వదేశ పరిమాణము.

| | | | |
|---|---|---|---|
| 1 | మినిం (Minim) | = | 1 బొట్టు |
| 1 | డ్రాము (Drachm) | = | 60 బొట్లు |
| 1 | ఔన్సు (Ounce) | = | ½ చటాకు |



స్వదేశకొలమానమునకు సరియైన యింగ్లీషు పరిమాణము.

| | | | |
|---|---|---|---|
| 1 | చటాకు | = | 2 ఔన్సులు |
| 1 | శేరు * | = | 32 ఔన్సులు |

స్వదేశకొలమానము.

| | | | |
|---|---|---|---|
| 1 | శేరు | = | 2 అర్థశేర్లు |
| 1 | శేరు | = | 8 నవటాకులు |
| 1 | శేరు | = | 16 చటాకులు |

ఈ యధ్యాయమందు ముఖ్యముగా ఔషధ గుణములను వివరించునపుడు కొన్ని నూతన శబ్దములు ప్రయోగింపబడియున్నవి. వాటిని తేటముగా యీక్రింద వ్రాయబడినది గనుక ఔషధములను చదువు వారు ముందుగా యీభాగమును చూడవలయును.

ఆమ్లవైరి.—(Antacid). పులుసు వస్తువులను విరిచి వాటియొక్క పుల్లదనమును పోగొట్టునది. ఉదాహరణము. సున్నపునీరు, ఆఘ్రాణ ద్రావకము (అమ్మోనియా).

ఉద్రేకకారులు.——(Stimulants). మాంద్యమును పోగొట్టి విజృంభణగలుగ జేయునవి. వీటిని ఉద్దీపనకారులు అని సహితము చెప్పుట గలదు. ఉ॥ సారాయము, శొంఠి.

జ్వరహారులు.—(Febrifuges). జ్వరమును హరించునవి. ఉ॥ సింకోనాచెక్క.

---

* ఇది 80 తులముల శేరు అని యెఱుగవలయును.

సంజ్ఞ. ఒక్కరూపాయను మూడుసమభాగములుగా ఖండించిన యెడల ఒక్కొకఖండము ఒక్కొక్కవరహాయెత్తు గలదియగును, కాబట్టి ఒకరూపాయయెత్తు మూడువరహాలని తెలియవలయును.

ఈగ్రంథమందుకొన్నిచోట్ల "బుడ్డి" అనెడు కొలపాత్రను వాడుకచేయబడియున్నది. ఈబుడ్డి అర్థవీశెనూనెపట్టెడు సాధారణముగా దొరకు ఖాళీ బ్రాందిబుడ్డి అనియెఱుగవలయును.

కారపుమందులు.—(Caustics=దాహకములు). ఇవి ప్రయోగింపబడిన ప్రదేశమందు మంటపుట్టించి ఆభాగమునుకాల్చునవి. ఉ ॥ క్షారపు కడ్డీ (Lunar Caustic), వాతలువేయుట.

దేహపటుత్వకారులు.—(Tonics) జీర్ణశక్తిని వృద్ధిచేసిదేహమునకు బలము గలుగజేయునవి. ఉ ॥ అన్నభేది, నేలవేము.

నిర్గంధకారులు.—(Deodorizers). దుర్వాసనలను పోగొట్టునవి. ఉ ॥ కార్బాలిక్ ఆసిడ్, బొగ్గులు.

మూత్రవర్ధనులు.—(Diuretics). దేహమందు విస్తరించిచేరియుండు నీరును మూత్రరూపముగా బయటవెడలించునవి. ఉ ॥ సూరాకారము.

మృదువిరేచనకారులు.—(Laxatives). శాంతముగా మలమును వెడలించునవి. ఉ ॥ రసభస్మము (Calomel).

వాయుహారములు.—(Carminatives). కడుపులోచేరియుండుగాలిని బయటవెడలించునవి. ఉ ॥ ఇంగువ, లవంగాలు.

సుఖస్థాపకములు.——(Alteratives) దేహమందుండిన నలిని తొలగించి దేహసుఖమును స్థాపించునవి. ఉ ॥ రసభస్మము (Calomel), నేలవేము.

సోకుడు పరిహారులు.——(Disinfectants). సోకుడు అంటుజాడ్య సంబంధములగు అంకురములను స్తబ్ధుపరచునవి. ఉ॥కార్బాలిక్ ఆసిడ్, గంధకపుపొగ.

~~~~~~~~~~~~~~~~~

## ఔషధములు.

అన్నభేది.———ఇది బలకారియగుటచేత జ్వరకాలమందున్ను నిస్త్రాణయందున్ను నంజు సంకటమప్పుడున్ను మరియు యేజాడ్యమయినా నివారణకాబోవుతరుణమందున్ను దీనిని బహుతరముగా వాడుక పరతురు.

అవుషధప్రమాణము.——రెండు మొదలు మూడు వరహాలయెత్తు.

అభిని.——రోగి నొప్పిచేత బాధపడుచుండు సమయమందు అభిని మిగుల ప్రయోజనకారిదైయుండును. అతిసారము, రక్తాతిసారము, కడుపునొప్పి మొదలగు సంకటములయందు దీనిని మిక్కిలిగా వాడెదరు.



అ ॥ ప్ర. అర్ధ మొ ॥ ఒకవరహాయెత్తు, అగత్యమయిన యెడల జాముకొకపర్యాయము యీచొప్పున యిచ్చుచుండవచ్చును.

అలిశెనూనె.—(Linseed Oil). ఇది మలశుద్ధిచేయునది కాబట్టి నిర్భయముగా సమస్తజంతువులకున్ను భేదికావలసిన అన్నిరోగములయందునూ యివ్వవచ్చును. దీనిని విరేచనలవణముతోటి మిశ్రమముచేసి పలుమారువాడుదురు.

అ ॥ ప్ర. అర్ధ మొ ॥ ఒకబుడ్డెడు.

అలిశవిత్తులు.—(Linseed). మూత్రరోగములచేత బాధపడుచుండెడు జంతువులకు యీగింజలతోటి ఒక విధమగుపానమును తయారుచేసి యిత్తురు. ఈగింజలను పిండిగొట్టి వేడినీళ్లచెమ్మతో పిసికి ముద్దజేసి కురుపులకున్ను గాయములకున్ను కట్టుదురు. దూడలను బలపరచదలచువారు యీగింజలను కొంతకాలమువరకూ మేతతోటిచేర్చివాటికి బెట్టుచుండిరేని అవిచక్కగా కండబట్టును.

అమ్మోణద్రావకము లేక శృంగద్రావకము.—(Ammonia Liquor Strong or Spirits of Hartshorn). కడుపులోనికి యిచ్చుటచేత ఉద్రేకకారియు ఆమ్లవైరియునైయుండును. చర్మలేపనము చేయుటచేత దురదయు మంటయు గలుగును. కుడుపుబ్బు మొదలగు సంకటములయందు ఒకానొకప్పుడు దీనినివాడుదురు. ఆవాలపెళ్లాస్త్రితోటి దీనినిచేర్చినయెడల పెళ్లాస్త్రికి బలముగలుగును. ఈ ద్రావకమును కడుపులోనికి యివ్వవలసివచ్చినపుడు చాలినన్ని నీళ్లుపోసి గాటును తగ్గించి పిమ్మట త్రాగింపవలయును.

అమ్మోణలవణము.—(Ammoniæ Carbons). ఇది నిముషాధికమయిన ఉద్రేకకారియగుటచేత బడలిక, నిస్త్రాణకలిగియుండెడు ప్రతి జాడ్యమందున్ను దీనినివాడుకచేయవచ్చును.

అ ॥ ప్ర. రెండు మొ ॥ నాలుగువరహాలయెత్తు.

ఆవాలు.—వాచియుండుప్రదేశములపైన వీటిపిండితోటి పట్టువేయుటచేత వాపులుతగ్గును. కాబట్టి నురుగుదబ్బలు రోగపీడితములయినప్పుడు రెండు
~~~~~~~~~~~~~~~~~

ప్రక్కల మీదను, కడుపునొప్పియెత్తునపుడు పొట్టమీదను, గుండెకాయగాని పేగులుగాని వాచియుండునపుడు ఆయాప్రదేశములమీదను ఆవాలపట్టు వేయబడును.

ఇంగువ.—ఇది మేలుతరమగు ఉద్రేకకారి. కడుపునొప్పి, కడుపుబ్బు—ఈ సంకటములయందు దీనిని యిచ్చుటచేత కడుపులోని వాయువును బయటవెడలించి నిమ్మళపరచును.

అ ॥ ప్ర. ఒకటి మొ ॥ మూడువరహాలయెత్తు.

ఇపికాకు.—(Ipecacuanha). దీని వేరును చక్కగా యెండనిచ్చి చూర్ణముచేసి రక్తాతిసారమందు వినియోగింపనగును.

అ ॥ ప్ర. రెండువరహాలయెత్తు.

* ఉప్పు.—ఇది రక్తశుద్ధిచేయునది. సుఖస్థితియందేమి అసుఖస్థితియందేమి దీనినిపశువులకు వినియోగపరచుటచేత మలమూత్రములు ధారాళముగా వెడలి చీడపురుగులు హరింపబడును. గొర్రెలకు ఊలతెగులు అనువ్యాధి రానివ్వక ఆపుజేయుటకు యిదిముఖ్యసాధకము.

అ ॥ ప్ర. ఒకటింపాతిక మొ ॥ రెండున్నర రూపాయయెత్తు.

ఉప్పెత్తు.—ఇది నొప్పులను నివారించునది. ముఖ్యముగా నురుగుడబ్బల సంబంధమగురోగములవల్లనున్ను జలుబువల్లనున్ను బాధపడుచుండెడు జంతువులచేత యీ ఆకుపొగను ఆఘ్రాణింపజేయవలయును ; లేదా, ఒకవరహాయెత్తు మొదలు మూడువరహాలయెత్తు ఆకును కడుపులోనికి యివ్వవలయును.

ఓడకీలు.—(Tar=తారు) ఇదిరెండువిధములయియుండును. ఒకవిధము కర్రలలోనుండి తీయబడునది ; మరియొకటి బొగ్గులోనుండి తీయబడునది. కర్రలలోనుండి తీయబడు కీలుచమురు శ్రేష్ఠమయియుండును. చర్మరోగమందున్ను గోరిసెసంకటమందున్ను కొమ్మువిరిగినప్పుడున్ను గాయములను ఉద్రేకపరచి వాటిపైన యీగలు ముసరనివ్వక ఆపుచేయుటకున్ను యీచమురు ఉప

* కూరలలోవాడబడే ఉప్పు అని తెలియవలయును. దీనిని సముద్రలవణమందురు.



యోగించును. ఓడకీలును కాల్చుటచేత గలిగెడుపొగ దుర్వాసనలను అణచి పదార్థములను కుళ్లిపోనివ్వక కాపాడును. పశువులలో చీడలుగానుండునప్పుడు ముఖ్యముగా ఓడకీలును కొట్టములలో పొగవేయుటచేత సోకుడు పరిహారమగునని నమ్మవలయును.

ఓమము. లేక వాము } ఈ వస్తువు జీర్ణకారియగుటచేత స్వదేశ వైద్యులు దీనిని అతిసారము, కడుపునొప్పి, అజీర్ణి మొదలగు రోగములయందు బహుతరముగా వాడుక పరతురు. కడుపులో నులినొప్పి గలిగినా అట్టినొప్పిని శాంతిపరచుటకునై భేది మందుతోటి ఓమమును చేర్చి యిచ్చెదరు.

అ॥ ప్ర. రెండున్నర మొ॥ పదిరూపాయలయెత్తు.

కర్పూరము.——ఇది ఉద్రేకకారి. జలుబు, దగ్గు యిత్యాది సంకటములయందున్ను కడుపునొప్పిచేతగలుగు యీడ్పులను (Spasms) నివారించుటయందున్ను యీమందు బహు ఉపయుక్తము. దీనిని నూనెలో మిశ్రమించి పుచ్చిన పుండ్లకు పట్టించుటచేత అందులోని పురుగులు చచ్చును.

అ॥ ప్ర. రెండు మొ॥ నాలుగు వరహాలయెత్తు.

కర్పూరతైలము.——(Turpentine) ఇది ఉద్రేకకారియు పురుగులను చంపునదియునైయున్నది. దీనిని ఆవాలపిండితోటి చేర్చి పెళాస్తిరిచేయుదురు. పేగులు, నురుగుదబ్బలు వాచియుండునపుడు యీపెళాస్తిరిని ఉపయోగింతురు.

కాచు.——ఇది బహు వగరుగా నుండుటచేత జ్వరరహితమైన అతిసారములయందు దీనిని మిక్కిలి ఉపయోగింతురు.

అ॥ ప్ర. రెండు మొ॥ ఆరువరహాలయెత్తు.

కాడీపులుసు.——(Vinegar). దీనిని ఔషధముగా అంతగా వాడుటలేదుగాని బెణికిన ప్రదేశములమీద పూయుటచేత ఆభాగములు ఉద్దీపితములయి అచ్చటి నొప్పితగ్గిపోవును.

కార్బాలిక్ ఆసిడ్.—(Carbolic Acid) ఇది వగరుగాను, దాహకముగాను, శోకుడు పరిహారిగాను ఉండును. కురుపులు, గాయములు, సమస్త చర్మరోగములు, కుళ్లుసంకటము (Foot Rot), కాళ్లపుప్పి (Foul) వీటికి లేపనము చేయుటకు మిగుల నుపయోగించును. మఱియు సరకు, దొమ్మరోగములయందున్ను కడుపుబ్బు సంకటమందున్ను దీనిని గర్భములోనికి యివ్వతగియుండును.

అ॥ ప్ర. అరవై మె॥ నూటయిరువై బొట్లు.

కారపుకడ్డీ.—(Lunar Caustic). దీనినిసాధారణముగా "కాస్టిక్కు" అనిచెప్పుదురు. ఇది కారము గలది యగుటచేత శీఘ్రముగా మానని కురుపు గాయములకు దీనిని బహుతరముగా పట్టింతురు. చిన్నకంతులను కాల్చి రూపుమాపుటకు సహితము యిది ఉపయోగించును. మఱియు యీ కడ్డీని నీళ్లలో కరగించి నేత్రరోగములయందు ఆనీరును వాడుదురు.

కుంకుడుకాయలు.—చర్మము చీడవారి యుండునపుడుగాని లేక పేనుబట్టియుండునపుడుగాని కుంకుడుకాయలతోటి దేహమును కడుగుట బహుప్రయోజనకారియైయుండును.

కొవ్వు లేక పందిచమురు.—(Fat or Lard) పొక్కిన ప్రదేశముల మీదపూయుటకున్ను కోమలమైన భాగములకు గాలి తగలనివ్వక రక్షించుటకున్ను యిది మిగుల నుపయోగించును. ఇది మలాములలో ముఖ్యముగా కలిసెడివస్తువు.

గంజాయి ఆకు.—అభినివలెనే యిదికూడా నొప్పులను నివారించుటయందు అమోఘమయిన అవుషధము. అభిని దొరకని సమయమందు అభినికి మారుగాదీన్నినే ఉపయోగింపవచ్చును.

అ॥ ప్ర. నాలుగు మె॥ యెనిమిదివరహాలయెత్తు.

గంధకము.—జ్వరము, వాతరోగములు, చర్మరోగములు, వీటియందు దీనిని వాడుదురు. చర్మరోగములయందు దీనిని కడుపులోనికి యిచ్చుటయేగాక లేపనముగా సహితము ఉపయోగింతురు.

అ॥ ప్ర. రెండున్నర మె॥ యేడున్నర రూపాయలయెత్తు



చింతపండు.—మాడలకున్ను దుర్బల జంతువులకున్ను మృదువిరేచనమగుట కొరకు చింతపండును అవుషధముగా వాడుదురు. మఱియు జ్వరకాలమందు దేహము చల్లనగుట కొరకు దీనినిత్తురు.

అ॥ ప్ర. అయిదు మె॥ పది రూపాయిలయెత్తు.

చిట్టాముదము.—ఇదివిరేచనకారియగుటచేత పేడను మెత్తగిలజేయును. అజీర్ణము, నాము (విషవస్తువులను తినుటచేత గలిగెడుసంకటము), కడుపుబ్బు మొదలగు సంకటములయందున్ను మలబంధమువల్ల గలిగెడు పలువిధములగు రోగములయందున్ను చిట్టాముదము మహాప్రయోజనకారియయియుండును.

అ॥ ప్ర. అర్థ మె॥ ఒకటిన్నరబుడ్డెడు.

ధనియాలు.—అవుషధగుణమందున్ను ప్రమాణమందున్ను సోపుగింజలతోటి తుల్యము.

నవాసాగరము.—(Ammonium Chloride). ఇది కాలేజసంబంధమగు జాడ్యములకు బహుఅనుకూలమగుమందు. సాధారణముగా దీనిని నేలవేము, సూరాకారముతోటిచేర్చి వాడుదురు.

అ॥ ప్ర. రెండున్నర మె॥ అయిదురూపాయలయెత్తు

నువ్వునూనె.—ఇదిబలకరమగు పదార్థము. పశువులు కొవ్వుపట్టుటకుగా ఒకపలముమొదలు పలమున్నర వరకు యివ్వవలయును. మఱియుగాయములకు సహితము పూయుదురు.

నెయ్యి.—నేతితోటిగాయములకు ఉపయోగించెడి ఒకదినుసు మలాము చేయబడును. మఱియునిది సులభముగా జీర్ణమయ్యేదై బలమునుగలుగజేయునదియయి యుండుటబట్టి దీనిని విశేషముగా పశువులకుత్రాగింతురు. జ్వరసమయమందు దీనిని త్రాగించుట ఉచితముగాదు.

అ॥ ప్ర. పాతికెబుడ్డెడు.

నేపాళాలు.—ఇవి బహుతీవ్రమయిన విరేచనకారులగుటబట్టి అతిజాగ్రతతోటి వీటిని వాడవలయును. మలబంధ సంకటమందు త్వరగా భేదిఅగు

టకునై ముప్పయిమొదలు యెనభై విత్తనములవరకు యివ్వవచ్చును. ఒక్కొక్కనేపాళపువిత్తు ఒకటిన్నర గురిగింజలయెత్తు తూగును.

నేలవేము.—(Chiretta) అవుషధగుణమందు అన్నభేదిని పోలియుండును.

అ॥ ప్ర. నాలుగు మొ॥ యెనిమిది వరహాలయెత్తు.

పటిక్కి.—ఇదివగరుగానుండును. దీనిని అంతర రక్తస్రావమందున్ను అతిసారమందున్ను పాలుయెండగట్టుటకు పాడి ఆవులకున్ను వాడుదురు. పటికినీరు గాలికుంట్లు అనెడుజాడ్యమందున్ను, కురుపులు, గాయములు-వీటికిన్ని ఉపయోగించును.

అ॥ ప్ర. రెండు మొ॥ నాలుగువరహాలయెత్తు.

పసపు.—ఇది ఉద్రేకకారియు బలకారియున్నైయుండునది.

అ॥ ప్ర. రెండు మొ॥ నాలుగువరహాలయెత్తు.

పాషాణము—ఈ అవుషధము విషవస్తువు అగుటచేత బహుజాగ్రతతోటి ఉపయోగింపవలయును. అల్పప్రమాణముగా నిచ్చుటవలన నాడికా వుద్రేకకారి (Nerve Stimulant) యగును. దేహముమీద పూయుటచేత చర్మగతచీడపురుగులు చచ్చిపోవును. ఈ అవుషధమును దేహముమీద పూసినపుడు చర్మముద్వారారక్తములో ప్రవేశించి తన విషచేష్టను కనుపరచును కాబట్టి "ప్రమాణమునకంటె మించకుండా" చర్మముమీదలేపనము చేయవలయును.

అ॥ ప్ర. రెండున్నర మొ॥ అయిదు గురిగింజలయెత్తు.

పిచ్చ్.—(Pitch). దీనితోటి ఒకవిధమయిన పెళాస్తిరిచేయుదురు. ఈపెళాస్తిరి బెణుకుడుసంకటములకున్ను వికలాస్థిబంధనమునకున్ను ఉపయోగించును.

పొక్కుటీగలు.—(Cantharides). ఇవిస్పెయిన్ దేశపుయీగలనియు (Spanish Fly), చీనాదేశపుయీగలనియు (Chinese Fly)



రెండువిధములయియుండును. పొక్కుమందులలో కలిపెడి దినుసులయందు యిదిప్రధానవస్తువు. వెంట్రుకలు తీవ్రముగా పెరుగునటుల చేయుశక్తి సహితము యీ ఔషధమునకు గలదుగాని యిట్టికార్యముకై యీవస్తువును ఉపయోగపరచినపుడు చాలామట్టుకు గాటును తగ్గించి శాంతపరచివాడవలయును.

పోక.—ఇది వగరుగానుండును కాబట్టి అతిసారమందున్ను పారుకొను దూడలకున్ను దీనినివాడుదురు.

అ॥ ప్ర. నాలుగు మొ॥ యెనిమిదివరహాలయెత్తు.

బంక.—ఇది వెలగ, తుమ్మ మొదలగు వృక్షజాతులవల్లఉత్పత్తియగునది. మితముతప్పిభేదిమందు యిచ్చుటచేతను, విషవస్తువులదినుటచేతను కలిగెడు విరేచనములను నిలుపుటకు బంకనీళ్లను త్రాగించుదురు. ఇట్లుచేయుట బహుప్రయోజనకారియైయుండును.

అ॥ ప్ర. అయిదు మొ॥ పదిహేను వరహాలయెత్తు.

బెల్లము.—ఇది రుచికి యింపుగాను బలకరముగాను ఉండును. ఆకలి మందముగానుండునపుడు ఆహారవస్తువులతోటిచేర్చి దీనినిచ్చుటచేత రోగికి హితవుగానుండును.

అ॥ ప్ర. పది మొ॥ యిరువైరూపాయలయెత్తు.

బొగ్గు.—ఇది నిర్గంధకారియు పాగవాయువులను పీల్చుకొను శక్తిగలదియున్నైయుండును. దీనిని మెత్తగాపొడిచేసి గాయములకు పట్టించినయెడల అట్టిగాయములు మానును.

అ॥ ప్ర. పదిరూపాయలయెత్తు.

మిరపకాయలు.—ఇవి జీర్ణకారియగుటచేత తినిన పదార్థములను చక్కగా పచనముచేయును.

అ॥ ప్ర. ఒకటి మొ॥ రెండువరహాలయెత్తు.

మిరియాలు.—మిరపకాయలకు గలిగియుండు ఔషధగుణమే వీటికిని గలదు గాని మిరియాలకంటె మిరపకాయలు మహాగాటుగానుండును.

అ॥ ప్ర. ఒకటింపావు రూపాయయెత్తు.

మెర్క్యురి రెడ్ అయోడైడ్.—(Mercury Red Iodide) వాపులనుతగ్గించుటయందును, † నెరి సంకటములయందును యీ ఔషధము మిగులనుపయోగించును. దీనిని ప్రత్యేకముగాగాని మరియొకవస్తువుతోటి చేర్చిగాని పొక్కుమందుగాగాని వాడవచ్చును. పొక్కుటీగలపొడితోటి దీనిని మిశ్రమముచేసి ఉపయోగపరచుట శ్రేష్ఠము.

ముసాంబ్రము.—(Aloes) ఇది విరేచనకారి. విరేచనమగునపుడు స్వల్పముగా నొప్పిబుట్టించును, గనుక నొప్పిహరించుటకునై అర్ధవరహాయెత్తు శొంఠిని దీనితోటి చేర్చి యివ్వనగును. ఈ ఔషధము గుఱ్ఱములకు సాధారణముగా వాడుట గలదుగాని పశువులకంతగా వాడుక చేయుటలేదు.

గుఱ్ఱములకు.—అ॥ ప్ర. నాలుగు మొ॥ ఆరువరహాలయెత్తు.

ముష్టి.—(Nux Vomica Seeds) ఈవిత్తనములు నాడికా ఉద్రేకకారులు (Stimulant to the Nerves) అగుటచేత దేహమందెచ్చటనయినా చచ్చువాయువు ప్రాప్తించియుండెనా అట్టిసమయములయందు యీగింజలు చూర్ణముచేసి పదిమొదలు యిరువైగురిగింజలయెత్తు యిచ్చుచుండినయెడల అట్టి వాత జాడ్యము నిమ్మళమగును.

మైనము.—ఇది జుంటీగలవల్ల ఉత్పత్తి అయ్యేడిది. దీనితోటి ముఖ్యముగా పెళాస్త్రిల్లుచేయుదురు.

మైలతుత్తము.—దేహపటుత్వకారిగాను వగరుగాను కారముగాను ఉండును. అతిసారము, రక్తాతిసారము, నురుగుదబ్బలరోగము-వీటియందు యిది ఉపయోగపడును. అన్నభేదిన్ని యిదిన్ని ఔషధగుణమందు సమానములు.

అ॥ ప్ర. ఒకటి మొ॥ మూడువరహాలయెత్తు.

* ఇది పాదరస విశేషము. సిందూరమువలె యెఱ్ఱగానుండును.

† ఏ భాగమయినా మితముతప్పి పెరుగుట "నెరి" యనబడును.



రసభస్మము.—(Calomel). ఇది విరేచనకారియు సుఖస్థాపకముచేయునదియునైయుండునుగాని దీనిని పశువులకు అంతగా వాడుటలేదు. కాలేజసంబంధమయిన జాడ్యములయందున్ను రక్తాతిసారమందున్ను యిది ఉపయోగించును.

అ ॥ ప్ర. అర్ధ మొ ॥ ఒకవరహాయెత్తు.

రోజనము.—(Resin). ఇది మూత్రవృద్ధిచేయునది కాబట్టి మూత్రము ధారాళముగా వెడలుటకొరకు దీనినిచ్చెదరు. దీనిని గాయములకు వ్రణములకు పట్టించినయెడల వాటిని ఉద్రేకపరచి త్వరగా మాన్పును. పెళాస్త్రిల్లు మలాములుచేయబడు దినుసులలో యిదియొకదినుసైయున్నది.

అ ॥ ప్ర. నాలుగు మొ ॥ ఆరువరహాలయెత్తు.

లవంగాలు.—ఇవి ఉద్రేకకారిగాను వాయుహర్మముగాను ఉండును. భేదిమందులతోటిచేర్చి యిచ్చుటచేత కడుపులోని నులినొప్పిని హరించును. కడుపునొప్పిమొదలగు రోగములకు యిదిబహు అనుకూలమగుమందు. మూత్రసంబంధములగు రోగములున్నయెడల వీటిని వాడకూడదు. దుర్బలమందున్ను నిస్త్రాణయందున్ను వీటిని నేలవేముతోటి చేర్చియిచ్చుట మహాఉత్తమము.

† లెడ్ అసిటేట్ లేక షుగర్ ఆఫ్ లెడ్.—(Lead Acetate or Sugar of Lead). ఇదివగరుగానుండుటబట్టి దీనిని నీళ్లలో కరగించి ఆనీరుచేతగాయములనూ పురుపులనూ కడుగుచూవచ్చినయెడల అవిత్వరగా ఆరిపోవును. నేత్రరోగములయందు సహితము యీనీటిని ఉపయోగింపవచ్చును.

నిరియబోయని సున్నము.—(Quick or Unslaked Lime). ఇది కారముగలదియగుటచేత గాయములనుండికారెడు రశికను నివారించును. మఱియు సరకు, బొమ్మమొదలగు అంటుజాడ్యములు ఆరంభమయినప్పుడు పశువులకొట్టములలో దీనినిచల్లుటచేతగాని గోడలకు పూతవేయుటచేతగాని ఆ జాడ్యముల సోకనీయక ఆపుజేయును.

* దీనిని బహుజాగ్రతతోటి వాడవలయును, మితముతప్పించి అధికముగాని, చాలాకాలమువరకుగాని దీనిని యివ్వకూడదు. దీనినివాడవలసివచ్చినపుడు మరియొకమందుతోటి చేర్చియివ్వవలయును.

† సీసపుముక్కలను కాడీపులుసులో పడవేసి కొంతకాలము అట్టేయుంచినయెడల ఆసీసము అందులోజీర్ణమయి ఒక విధమయిన తెల్లనిఉప్పవేయును. ఆ ఉప్పే "లెడ్ అసిటేట్" అందురు.

విరియబోసిన సున్నము.—(Slaked Lime). ఇది ఆమ్లవైరియగుటచేత అన్నకోశమందుగాని (Stomach) పేగులలోగాని చేరియుండుపులుసును విరుచుటకుగా దీనిని ఉపయోగింతురు. మఱియు అజీర్తియయున్ను కడుపుబ్బు సంకటమందున్ను దీనిని వాడుటగలదు.

విరేచనలవణము.—(Epsom Salts or Sulphate of Magnesia). ఈలవణము పశువులకు సాధారణముగా నివ్వబడెడు మేలుతరమయిన భేదిమందు. దీనిని వేడినీళ్లతో కలిపియివ్వవలయును.

అ ॥ ప్ర. పంద్రెండు మొ ॥ యిరువయినాలుగుపలములు,

వెలితుత్తము ——(Sulphate of Zinc). దీనినినీళ్లలో కరగించి ఆనీరును కురుపులనున్ను వ్రణములనున్ను కడుగుటకు ఉపయోగింతురు. మఱియు నేత్రరోగములయందు సహితము ఆనీరు మిగుల నుపయోగించును.

వేప ఆకు, చెక్క, చమురు.———ఏభాగమయినా వాచి నొప్పి గలిగియుండెనా అట్టివాపును తగ్గించి నొప్పిని నివారించుటకుగా వేప ఆకు పట్టు వేయుదురు. మఱియు కురుపులుచక్కగా మానక బాధగలుగ జేయునపుడు యీఆకులోనుండి కషాయముదించి దానిచేత కురుపులను కడుగుచువచ్చినయెడల అవి ఆరి మానిపోవును. వేపచెక్క దేహమునకు పటుత్వమును గలుగజేసి పుష్టిని యిచ్చును. రోగి దుర్బలపడియుండు సమయమందు వేపచెక్కను కడుపులోనికి యివ్వవచ్చును. వేపచమురును గాయములకు పట్టించిన యెడల గాలిని లోపల చొచ్చునివ్వక యీగల మూగనివ్వక కాపాడును, కాబట్టి ఆగాయములు త్వరగా మానును.

శతపుష్పివిత్తులు లేక సదాపవిత్తులు.—(Dill Seed) ఇవి జీర్ణకారిగానుండును. వాతసంబంధమగు కీళ్లవాపులకు యీగింజలు బహు అనుకూలమయిన ఔషధము దీని ఆకులకు చమురుపూసి వాడ్చి గాయములమీద వేసినయెడల ఆగాయములు చక్కగా చీముపట్టును.

అ॥ ప్ర. రెండున్నర మొ॥ అయిదు రూపాయలయెత్తు.

*సబ్బు.——(Soap). ఇది ఆమ్లవైరిగాను మూత్రవృద్ధిచేయునది

* దుకాణములలో విక్రయింపబడెడు గట్టి చెక్క-సబ్బు.



గాను ఉండును. పుల్లనివిషవస్తువులను విరుచుటయందు యిది మిగుల నుపయోగించును. మఱియు మూత్రవృద్ధిచేయదలచితిమా దీనిని వాడవచ్చును. మలబంధము కలిగినపుడు దీనిని వేడినీళ్లలో కలిపి ఆనీరును ఆసనమూలముగా లోపటికి యెక్కించిన యెడల మలము బయలు వెడలి రోగికి నిమ్మళము గలుగజేయును.

అ॥ ప్ర. రెండున్నర మొ॥ అయిదు రూపాయలయెత్తు.

సారాయము.———ఇది ఉద్రేకకారి. ఏకారణముచేతనయితేనేమి పశువు జబ్బుగా కనుపడిన తత్క్షణమే ఆలస్యము చేయక సారాయమును త్రాగింపవచ్చును. ఇట్లుచేయుటచేత రాబోవు జాడ్యము నివారితమగును.

అ ॥ ప్ర. పాతికెబుడ్డెడు.

సింకోనాచెక్క.—(Cinchona Bark). దేహపటుత్వకారిగాను జ్వరహారిగాను ఉండునదియయియున్నది. జ్వరమునునిలుపుటకు తెలుచుగావాడబడెడు అమోఘమగు ఔషధము సింకోనాచెక్క. ఏకారణముచేతనయినాసరే పశువుదుర్బలపడియుండు సమయమందు యీమందును యివ్వవచ్చును.

అ ॥ ప్ర. రెండు మొ ॥ నాలుగువరహాలయెత్తు.

సీమసున్నము.———ఇది వగరుగానుండుటచేత భేదులను నిలుపును, మఱియు గాయములకు పట్టించినయెడల అవిమానును.

అ॥ ప్ర. అయిదు మొ॥ పదిరూపాయలయెత్తు.

సూరాకారము.———ఇదిరుచికి యింపుగానుండునది గనుక జ్వరముగలిగియుండు సమస్తజాడ్యములయందును సురక్షితముగా దీనిని యివ్వనగును. దీనిని నీళ్లలోగాని గంజిలోగాని కరగించిదాహముగొనియుండుపశువుయొద్ద పెట్టినయెడల ఆనీటిని బహుప్రియముతోటి త్రాగును. ఇది మూత్రవృద్ధిచేయునది, కాబట్టి దేహమందు విస్తరించిచేరియుండు నీటిని మూత్రరూపముగా బయటవెడలించి వాపులనున్ను నంజు సంకటమునున్ను స్వస్థపరచును.

అ ॥ ప్ర. ఒకటింపావు మొ ॥ రెండున్నర రూపాయయెత్తు.

సోపు.—(Aniseed). ఇదిరుచికియింపైన ఉద్రేకకారి. కడుపులో శీతలమును చేరనివ్వదు గనుక ప్రతిజాడ్యమునకున్ను అనుకూలించును.

అ ॥ ప్ర. రెండున్నర మొ ॥ అయిదురూపాయలయెత్తు.

## ఔషధపట్టీలు.

ఇకనుసలురోగములకు అనుకూలించెడు అవుషధదినుసులను పట్టీలు పట్టీలుగా వ్రాయనగుచున్నవి. పానయోగ్యములగు మందులవిషయమయి దినుసులు మాత్రమే పట్టీలలో కనుపరచబడియున్నవి, కాబట్టి ఆదినుసులను నూరి సిద్ధపరచి రోగికియిచ్చునపుడు కనీసపక్షం ఒకబుడ్డెడుగాని రెండుబుడ్లు గాని వేడిగంజిలోనయినా లేక వేడినీళ్లలోనయినా కలిపి త్రాగింపవలయును. కడుపులోని పురుగులను నివర్తిచేయుటకు యివ్వదలచుకొను అవుషధమును పరగడుపున (అనగా మేతమేయుటకుగాని నీరుత్రాగుటకుగాని పూర్వము) యివ్వవలయును.

## చూర్ణములు

## (Powders.)

---

నంజుకు చూర్ణము.—(Powder for Dropsy).

సూరాకారము. ... రెండువరహాలయెత్తు.
రసభస్మము (Calomel). ... ఒకవరహాయెత్తు.

అతిసారమునకు చూర్ణము.—(Powder for Diarrhœa)

సీమసున్నము... ... ...ఆరువరహాలయెత్తు
కాచు... ... ...రెండువరహాలయెత్తు

కారపుచూర్ణము.

(Caustic Powder.)

మైలతుత్తము.
సీమసున్నము. } ప్రతిదినుసు రెండున్నరరూపాయియెత్తు.



సుఖస్థాపకచూర్ణము.

(Alterative Powder)

గంధకము.
సూరాకారము. } ప్రతిదినుసు ఒకటింపావు రూపాయియెత్తు

## తైలములు.

## (Liniments).

---

ఉద్దీపనతైలము.—(Stimulating Liniment)

కొబ్బరిచమురు... ... ...పావుబుడ్డి

కర్పూరతైలము.
శుద్ధజలము. } ప్రతిదినుసురెండేసిచటాకులు.

అఘ్రాణద్రావకము (గాటుగలది)... ఒకచటాకు.

సబ్బుతైలము (Soap Liniment).

సబ్బు... ... ఏడున్నరరూపాయియెత్తు
కర్పూరము... ... ...రెండున్నరరూపాయియెత్తు
గాటయినసారాయము ... ...ఒకబుడ్డెడు
గాటయినఅఘ్రాణద్రావకము... ...ఒకటిమ్ముప్పావుచటాకు
శుద్ధజలము... ... ...మూడున్నరచటాకు

కర్పూరపుతైలపుతైలము

(Liniment of Turpentine).

సబ్బు... ... మూడుముప్పావురూపాయియెత్తు
కర్పూరము.... ... రెండున్నరరూపాయియెత్తు
కర్పూరతైలము ... ... ఎనిమిదిచటాకులు (అర్ధశేరు).

## నీరులు.

## (Lotions.)

---

### ఆరు నీరు. (Healing Lotion).

వెలితుత్తము (Sulphate of Zinc) } ప్రతిదినమును ఒకటింపావురూపాయయెత్తు
షుగర్ ఆఫ్ లెడ్ (Sugar of Lead) }
శుద్ధజలము... ... ...ఒకబుడ్డెడు

### చలవనీరు. (Cooling Lotion).

సూరాకారము. } ప్రతిదినమును అయిదురూపాయలయెత్తు
నవాసాగరము. }
శుద్ధజలము... ... ...ఒకబుడ్డెడు

### వగరునీరు. (Astringent Lotion).

మైలతుత్తము... ... } ...రెండువరహాలయెత్తు
శుద్ధజలము... ... ...ఒకబుడ్డెడు

రసికకారుచుండెడు కురుపులను యీనీటిచేత కడుగుటవలన రసికద్రవించుట నిలిచి కురుపులు అంచుగట్టును.

### గాయములకునీరు (Lotion for Wounds).
లేక
### కార్బాలిక్ నీరు. (Carbolic Lotion).

కార్బాలిక్ ఆసిడ్... ... అర్ధచటాకు
వేడినీరు... ... అర్ధశేరు

ఈరెంటినియొక సీసాయందుంచి నీళ్లుచల్లన్నాటకుముందే సీసానుచక్కగాకుదిలింపవలయును. గాయముల గడుగుటకు యీనీరు ఉపయోగించును.



### గాలికుంట్లుఅనువ్యాధియందు కాళ్లమీదలేచే పుండ్లకునీరు.
### (Lotion for Sores on feet in Foot-and Mouth Disease)

మైలతుత్తము... ... ఒకటింపావురూపాయయెత్తు
శుద్ధజలము... ... అయిదుచటాకులు

## నూనెలు.

## (Oils.)

---

### పొక్కునూనె. (Blistering Oil).

స్పేయిన్ పొక్కుటీగలుగాని } రెండున్నరరూపాయయెత్తు
చీనాపొక్కుటీగలుగాని }
కొబ్బరిచమురు... .... ...పావుశేరు

కొబ్బరిచమురును వెచ్చజేసి యీ యీగలపొడిని అందుబోయవలయును.

### గాయములకుపట్టించేనూనె.
### (Oil for Wounds)

కార్బాలిక్ ఆసిడ్... ... అర్ధచటాకు
కొబ్బరిచమురు... ... అర్ధశేరు

ఈరెంటిని యొకసీసాలోబోసి సీసానుచక్కగా కుదిలింపవలయును. గాయములకు పట్టించబోవునపుడంతా ముందుగా సీసాను కుదిలించి పిమ్మట వాడుకొనవలయును.

## పానములు.

## (Drinks.)

---

### దేహపటుత్వమునకుపానములు (Tonic Drinks).

1. సోపుగింజలు... ... రెండున్నరరూపాయయెత్తు
శొంఠి... ... } ప్రతిదినమును ఒకటింపావురూపాయయెత్తు
నేలవేము... ... }
బెల్లము... ... అయిదురూపాయలయెత్తు

2. అన్నభేది } ప్రతిదినమును రెండువరహాలయెత్తు,
నేలవేము }
శొంఠి ... ఒకవరహాయెత్తు

3. సింకోనాచెక్క } ప్రతిదినము ఒక్కొక్కవరహాయెత్తు
కర్పూరము
శొంఠి... ... రెండువరహాలయెత్తు

కాళ్లవాపునకు పానము.

### (Drink for Swollen Legs).

సూరాకారము... ... రెండువరహాలయెత్తు
రసభస్మము... ... ... పదిగురిగింజలయెత్తు

చర్మరోగమునకు పానము.

### (Drink for Skin Disease)

నవాసాగరము ... ఒకటింపావు రూపాయయెత్తు
ఉల్లిపాషాణము ... రెండున్నర గురిగింజయెత్తు

మృదువిరేచనానకు పానము.

### (Laxative Drink).

విరేచనలవణము...పదిహేనురూపాయలయెత్తు
గంధకపుపొడి ... పదిరూపాయలయెత్తు
నేలవేము ... } ప్రతిదినము రెండున్నర రూపాయయెత్తు
శొంఠి ...

జ్వరమునకు పానములు.

### (Drinks for Fever).

1. కర్పూరము ... } ప్రతిదినము రెండేసివరహాల యెత్తు
అఘ్రాణలవణము ...
నేలవేము ...
శొంఠి ... } ప్రతిదినము ఒకటింపావురూపాయయెత్తు.
సోపుగింజలు ...



2. సింకోనాచెక్క ... రెండువరహాలయెత్తు
సూరాకారము ... ఒకటింపావురూపాయియెత్తు
గంధకము ... అయిదురూపాయలయెత్తు

### దగ్గుకుపానములు (Drinks for Cough).

1. కర్పూరము ... రెండువరహాలయెత్తు
సూరాకారము ... } ప్రతిదినము ఒకటింపావురూపాయయెత్తు
శొంఠి ... ...
సోపుగింజలు... ...
నేలవేము ... ... రెండువరహాలయెత్తు

2. సూరాకారము ... } ప్రతిదినము ఒక్కొక వరహాయెత్తు
కర్పూరము... ...

పురుగులకుపానములు.

### (Drinks for Worms).

1. రసభస్మము (Calomel... ఒకవరహాయెత్తు
కర్పూరతైలము... ... ఒకచటాకు
ఆలిశెనూనె... ... అర్థబుడ్డెడు

2. కర్పూరతైలము... ... ఒకచటాకు
ఆలిశెనూనె... ... అర్థబుడ్డెడు

### కడుపునొప్పికిపానము (Drink for Belly Pain)

అభిని... ... ఒకవరహాయెత్తు
అఘ్రాణలవణము } ప్రతిదినము రెండేసి వరహాలయెత్తు
కర్పూరము
సారాయము... ... పావుశేరు

సంజ్ఞ. అభినిన్ని కర్పూరమున్ను సారాయములో కరిగించి అఘ్రాణలవణమును పొడిచేసి, వీటినన్నిటినిన్ని ఒకబుడ్డెడు గంజితోటి మిశ్రమము చేసి తక్షణమే త్రాగింపవలయును.

### కాలేజసంబంధమయిన రోగమునకు పానములు.

### (Drinks for Liver Disease)

1. నవాసాగరము... ... రెండున్నరరూపాయియెత్తు
విరేచనలవణము... ... అయిదురూపాయలయెత్తు
సోపుగింజలు... } ప్రతిదినును ఒకటింపావు రూపాయియెత్తు
శొంఠి...

2. రసభస్మము(Calomel) ... ఒకవరహాయెత్తు
విరేచనలవణము ... పదిహేనురూపాయలయెత్తు
ఉప్పు ... రెండువరహాలయెత్తు
సోపుగింజలు ... } ప్రతిదినును ఒకటింపావు రూ
శొంఠి ... పాయయెత్తు

### దొమ్మరోగమునకు పానము

### (Drink for Anthrax).

కార్బాలిక్ ఆసిడ్ (అప్పటం) ... అరున్నై బొట్లు
ఉప్పు ... ఒకటింపావురూపాయియెత్తు

### సరకురోగమునకుపానము.

### (Drink for Rinderpest).

కార్బాలిక్ ఆసిడ్ (అప్పటం) ... అరున్నై బొట్లు
ఉప్పు ... ఒకటింపావురూపాయియెత్తు

### సరకురోగపు అతిసారమునకు పానము

### (Drink for Diarrhœa in Rinderpest)

మాచికాయలచూర్ణము ... ఒకవరహాయెత్తు
సీమసున్నము ... ఒకటింపావురూపాయియెత్తు
అభిని ... ఒకవరహాయెత్తు



### విరేచనమగుటకు పానములు.

### (Purgative Drinks.)

1. విరేచనలవణము ... అర్ధశావీశె
బెల్లము ... ... అయిదురూపాయలయెత్తు
శొంఠి ... ... } ప్రతిదినును ఒకటింపావురూపా
సోపుగింజలు ... ... యి యెత్తు

2. చిట్టాముదము... ... ముప్పాతిక బుడ్డెడు
సారాయము ... ... రెండుచటాకులు
సోపుగింజలు ... ... ఒకటింపావురూపాయియెత్తు.

### నురుగుదబ్బలజాడ్యమునకుపానము

### (Drink for Lung Disease.)

ఆఘ్రాణలవణము... ... రెండువరహాలయెత్తు
శొంఠి... ... నాలుగువరహాలయెత్తు
సారాయము... ... పావుశేరు.

### కడుపుబ్బుకుపానములు

### (Drinks for Tympanitis.)

1. గంజాయిఆకు... ... ఒకటింపావురూపాయియెత్తు
బొగ్గుపొడి... ... అయిదురూపాయలయెత్తు
సారాయము... ... రెండుచటాకులు
లవంగాలు ... } ప్రతిదినును ఒకటింపావురూపాయియెత్తు.
మిరపకాయలపొడి

2. ఆఘ్రాణలవణము ... } ప్రతిదినును ఒకటింపావు రూపా
లవంగాలు ... యి యెత్తు.
మిరపకాయలపొడి ...
అభిని ... ... ఒకవరహాయెత్తు
సారాయము ... ... రెండు చటాకులు

### చప్పువాయువునకు పానము.
### (Drink for Paralysis.)

ముష్టిగింజలపొడి ... అర్ధవరహాయెత్తు
అన్నభేది ... ... ఒకవరహాయెత్తు
విరేచన లవణము ... పదిరూపాయలయెత్తు
మిరపకాయలపొడి ... } ప్రతిదినును ఒకటింపావు రూ
లవంగాలు ... ... } పాయ యెత్తు

### ఊలతెగులుకుపానము. (Drink for Rot)

ఉప్పు ... ... ఒకవరహాయెత్తు
కర్పూరతైలము ... నూటయిరువై బొట్లు
అన్నభేది ... ... అయిదు గురిగింజలయెత్తు
శొంఠి ... ... అర్ధవరహాయెత్తు

ఇదిఒక గొఱ్ఱెకు యివ్వవలసిన ప్రమాణము అని తెలియునది.

### వాయురోగమునకు పానము.
### (Drink for Rheumatism:)

గంధకము ... ... } ప్రతిదినును రెండున్నర రూపా
నవాసాగరము... ... } య యెత్తు
సారాయము ... ... మూడు చటాకులు

### రక్తాతిసారమునకు పానములు.
### (Drinks for Dysentery.)

1. మైలతుత్తము ... ... } ప్రతిదినును ఒక్కొక వరహా
అభిని ... ... } యెత్తు
సీమసున్నము ... ... రెండున్నర రూపాయయెత్తు
శొంఠి ... ... రెండువరహాలయెత్తు
సోపుగింజలు ... ... ఒకటింపావురూపాయియెత్తు



2. ఇపికాక్ వేరుపొడి ... రెండువరహాలయెత్తు
కార్బాలిక్ ఆసిడ్ ... ముప్పై ఎబొట్లు
సోపుగింజలు ... ... ఒకటింపావురూపాయియెత్తు
శొంఠి ... ... రెండువరహాలయెత్తు

### అతిసారమునకు పానము.
### (Drink for Diarrhœa)

అభిని ... ... ఒకవరహాయెత్తు
సీమసున్నము ... ... రెండున్నరరూపాయయెత్తు
సోపుగింజలు ... ... రెండున్నరరూపాయయెత్తు

### కడుపులోని వైకల్యమునకు పానము
### (Drink for Stomach Derangement)

మిరపకాయలపొడి ... ఒకవరహాయెత్తు
శొంఠి ... ... }
మిరియాలు ... ... } ప్రతిదినును ఒకటింపావు రూ
లవంగాలు ... ... } పాయి యెత్తు
సోపుగింజలు ... ... }

### పిండికట్లు.
### (Poultices=పోల్టీసులు)

---

1. గోధుమతవుడు ... ... రెండుమొదలు మూడుపాళ్లు
అలిశెగింజల పిండి ... ఒకపాలు

చాలినన్ని నీళ్లుపోసి యీరెంటిని మెత్తగా పిసికి ముద్దగాజేయవలయును.

2. అలిశెగింజలపిండి ... పదిరూపాయలయెత్తు
నువ్వులనూనె ... ... పావుచటాకు
హాంగులు వారేనీళ్లు ... అయిదు చటాకులు.

3\. ఆవాలపిండి ... ... ఆరుంపావురూపాయయెత్తు
అలిశెగింజలపిండి ఆరుంపావురూపాయయెత్తు
వేడినీళ్లు ... ... అయిదుచటాకులు

4\. ఆవాలపిండి ... }
అలిశెగింజలపిండి... } ప్రతిదినుసు పదేసిరూపాయలయెత్తు
గాటుగలఅఘ్రాణద్రావకము ... ఒకటిన్నరచటాకు
వేడినీళ్లు... ... ... మూడుచటాకులు

5\. బొగ్గుపొడి ... ... ఒకటింపావురూపాయియెత్తు
అలిశెగింజలపిండి ... ... ఎనిమిదింముప్పావురూపాయయెత్తు
పొంగులువారేనీళ్లు ... అయిదుచటాకులు

## పూతచికిత్సలు.
## (Dressings)

---

### పొక్కులుపొక్కినచోటపూతచికిత్స.
### (Dressing for Blistered Surface)

సున్నపుతేట... ... రెండుచటాకులు
కొబ్బరిచమురు... ... పావుశేరు

### గుంటవ్రణములకు పూతచికిత్స.
### (Dressing for Deep Ulcers)

సారాయము... ... ఒకచటాకు
షుగర్ ఆఫ్ లెడ్ (Sugar of Lead } ... మూడువరహాలయెత్తు

### అమ్మవారుపోసినప్పుడు కలిగేపుండ్లకు పూతచికిత్స.
### (Dressing for Sores in Pox)

నువ్వులనూనె... ... పావుశేరు
కార్బాలిక్ ఆసిడ్ అరువైబొట్లు



### పురుగులు (క్రిమి) పట్టినందుకు పూతచికిత్స
### (Dressing for Maggots)

కార్బాలిక్ ఆసిడ్ ... నూటయిరువైబొట్లు
కర్పూరము... ... రెండువరహాలయెత్తు
వేపచమురు... ... రెండుచటాకులు

## పెళాస్త్రిరి.
## (Plaster)

---

### బెణుకుడుమొదలగు సంకటములకుపెళాస్త్రిరి
### (Plaster for Sprains Etc)

పిచ్చ్ (Pitch)... ... యాభైరూపాయలయెత్తు
రోజనము... }
మైనము ... } ప్రతిదినుసు నలభైఅయిదురూపాయలయెత్తు
నువ్వులనూనె }
శుద్ధజలము } ప్రతిదినుసు అర్ధచటాకు

ఈదినుసులను ఒకచట్టిలోనుంచి పొయిమీదబెట్టి గట్టిపడేవరకు కాచవలయును.

## మలాములు.
## (Ointments)

---

### సొరిసంకటమునకుమలాము
### (Ointment for Mange)

ఓడకిలు... ... ఇరువైఅయిదురూపాయలయెత్తు
కర్పూరతైలము ... ఒకచటాకు
కొబ్బరిచమురు ... అర్ధచటాకు
గంధకము... ... ఏడున్నరరూపాయియెత్తు

### పొక్కుమలాములు (Blistering Ointments)

1. మెర్క్యురి రెడ్ అయొడైడ్ Mercury Red Iodide } రెండువరహాలయెత్తు
క్రొవ్వు... ... అయిదురూపాయలయెత్తు

2. సెయిదుపొక్కుటీగలుగాని చీనాపొక్కుటీగలుగాని } ఒకటింపావురూపాయియెత్తు
క్రొవ్వు... ... పదిరూపాయలయెత్తు

### వ్రణములకుమలాము (Ointment for Ulcers)

రోజనపుపొడి... ... పదిరూపాయలయెత్తు
క్రొవ్వు... ... ఏడున్నరరూపాయయెత్తు
కర్పూరతైలము... ... వాపుచటాకు
మైనము... ... ఒకటింపావురూపాయియెత్తు

క్రొవ్వునున్ను మైనమునున్ను కరిగించి కరుగుచుండగా పొడిచేయబడియుండు రోజనమును దానిలోబోసి ఆవిచల్లారుసమయమప్పుడు కర్పూరతైలమును చేర్చవలయును.

### డెక్కలు లేక గిట్టలకుమలాములు (Hoof Ointments)

1. ఓడకీలు... ... పదిహేనురూపాయలయెత్తు
క్రొవ్వు... ... పదిరూపాయలయెత్తు
మైనము... ... ఒకటింపావురూపాయియెత్తు

2. ఓడకీలు... రోజనము... క్రొవ్వు } సమభాగములు.



## మాత్రకట్లు. (Balls)

### కడుపులోవైకల్యమునకుమాత్ర. (Ball for Stomach Derangement

అమ్మూణలవణము
నేలవేము
శొంఠి } ప్రతిదినుసు రెండేసివరహాలయెత్తు

### నురుగుదబ్బల జాడ్యమునకుమాత్ర (Ball for Lung Disease)

అభిని...
కర్పూరము
రసభస్మము (Calomel) } ప్రతిదినుసు ఒక్కొక్కవరహాయెత్తు

### నంజుకుమాత్ర (Ball for Dropsy)

అన్నభేది... ... ఒకవరహాయెత్తు
రోజనము...
నూరాకారము } ప్రతిదినుసు రెండేసివరహాలయెత్తు

ఈదినుసులను చూర్ణముగానూరి చెమ్మగించి మాత్రకట్టవలయును.

## శుద్ధిజలములు. (Washes)

### గాలికుంట్లు అనెడురోగమందు నోరుగడుగుటకు శుద్ధిజలము (Wash for mouth in Foot and Mouth Disease)

పటికి... ... రెండువరహాలయెత్తు
శుద్ధజలము ... పావుశేరు

## కండ్లుగడుగుటకు శుద్ధిజలములు (Eye Washes)

1. షుగర్ ఆఫ్ లెడ్ (Sugar of Lead) } అయిదుగురిగింజలయెత్తు

శుద్ధజలము ... అయిదుచటాకులు

2. వెలితుత్తము ... (Sulphate of Zinc) } రెండున్నరగురిగింజయెత్తు

శుద్ధజలము ... రెండున్నరచటాకు

## సున్నపుతేట (Lime Water) నుచేయువిధము.

విరియబోసినసున్నము ... అయిదురూపాయలయెత్తు
శుద్ధజలము... ... అయిదుశేర్లు

ఈరెండు పదార్థములను ఒకబానలోపోసి మూతబెట్టి రెండుమూడుగంటలసేపు అట్టేయుంచి పిమ్మట పయితేటను శుభ్రమయిన సీసాలలోకి వంచుకొని వాటికిబిరడాలుపెట్టి యుంచుకొనవలయును.

## ఊటకషాయములు (Infusions).

---

ఏ అవుషధదినుసులోనుండి ఊటదీయదలచెదరో అట్టిపదార్థమును ముక్కలుముక్కలుగా ఖండించి ఆఖండములను ఒకపాత్రయందుంచి ఆపయిన పొంగులువారెడు నీళ్లనుపోసి మూతబెట్టికొన్నిగంటలసేపు అట్టేయుంచి పిమ్మట వాడుకొనవచ్చును.

### కాచుఊట (Infusion of Catechu)

కాచు... ... ఆరువరహాలయెత్తు
సోపుగింజలు ... పదిరూపాలయెత్తు
పొంగేనీళ్లు ...అర్థబుడ్డెడు

కాచునున్ను సోపుగింజలనున్ను నలియగొట్టి ఒకచట్టియందుంచి ఆపయినపొంగేజలమునుపోసి వెంటనేమూతబెట్టి అర్థగంటసేపు ఉంచవలయును.



అవుషధగుణము ... కాచునుబోలియుండును
అవుషధప్రమాణము ... రెండుమొదలుమూడుచటాకులు

### సింకోనాఊట (Infusion of Cinchona)

సింకోనాచెక్క ... రెండున్నరరూపాయలయెత్తు
పొంగేజలము ... అర్థబుడ్డెడు

సింకోనాచెక్కను నలియగొట్టి యొకచట్టియందుంచి ఆపయినపొంగేజలముపోసి తోడనేమూతబెట్టి రెండుగంటలసేపు అట్టేయుంచవలయును.

అవుషధగుణము ... సింకోనాచెక్కనుబోలియుండును
అవుషధప్రమాణము ... రెండుమొదలుమూడుచటాకులు

### అలిశెగింజలఊట (Infusion of Linseed or Linseed Tea)

అలిశెగింజలపిండి ... రెండున్నరరూపాయలయెత్తు
పొంగేజలము ... అర్థబుడ్డెడు

పొంగేజలముపోసి వెంటనేమూతబెట్టి నాలుగుగంటలసేపుఅట్టే యుంచవలయును.

అవుషధగుణము ... మూత్రజాడ్యములకు అనుకూలము.
అవుషధప్రమాణము ... రోగిత్రాగునంత యివ్వవచ్చును.

---

## 6-వ

# అధ్యాయము.

### పశుసంతానప్రవృద్ధి- సంరక్షణ.

పశుసంతానమును వృద్ధిచేయుటయు వాటిని సంరక్షించుటయు, మొదలగు కొన్ని అంశములు సాధారణముగా అందరకు దెలిసి యుండునే గాని అట్టి మార్గములను తప్పక అవలంబించుచున్నారనుట అరుదు. కాబట్టి అట్టి అంశములన్నియు సమస్తజనులకు చక్కగా తెలియుటకొరకు యీ అధ్యాయమందు వివరించెద. పశుసంతతిని వృద్ధిచేయు వాడుక యీదేశమందు బహుకాలమునుండి జరుగుచున్నదిగాని అందుకొరకయి తగు నిర్ణయముల నేర్పరచికొని అట్టి నిర్ణయములచొప్పున జరుపుకొనక బొత్తుగా దైవికమునే నమ్మియుంటూ వచ్చిరి. కాబట్టి యీవిషయమై సర్కారువారి శ్రద్ధ పుచ్చుకొనక పోవుటచేతను, పసులఖావందులు అజాగరూకులయి యుండుటచేతను పశువులయొక్కయు, గొఱ్ఱెలయొక్కయు, గుఱ్ఱములయొక్కయు సంతతి దేహపరిమాణమందును విలువయందును సన్నగించి హీనదశకువచ్చినవి. సర్కారువారు గుఱ్ఱములయొక్కయు కంచరగాడిదెలయొక్కయు సంతానమును మాత్రము వృద్ధిచేయ బూనుకొన్నారుగాని పశుసంతానమును వృద్ధిపరచ యత్నించినవారుకారు. "సంతానము తల్లిదండ్రుల బోలియుండుట సిద్ధము" గనుక యేయే పశువుల సంతానము దేహపరిమాణమందును స్వరూపమందును ఆయాపశువుల బోలియుండును. ఏపశువుల సంతానమును వృద్ధిచేయగోరెదరో అట్టి పశువులు ఆజిల్లాకు అనుకూలించినవై ఆప్రదేశమునకు నప్పి యుండవలయును. ఆరబ్బీదేశములో పశుసంతానవృద్ధి ప్రశస్తముగా జరిగెడు ప్రదేశములనుండి ఆవులను ఆబోతులను యీదేశమునకు తెప్పించుకొని యిచ్చటి ఆవులను ఆదేశపు ఆబోతులచేతను, ఆదేశపు ఆవులను యిచ్చటి ఆబోతులచేతను దాటించినయెడల వాటికి జన్మించెడు సంకరసంతానము మంచిపాడి పశువులుగానున్ను కష్టపాటుచేయునవిగానున్ను యేర్పడునుగాని ఆంగిలేయదేశములోబుట్టిన పెద్దయెద్దులను యీదేశమునకు తెప్పించుకొనుటచేత నేమిప్రయోజనము! అట్లు చేయుటచేత అవి యీదేశపు యెండలకు తాళజాలక జాడ్యగ్రస్థులయి సంతానప్రదానమునకు అ



యోగ్యములగును. ప్రాయమురాని కోడెలను దాట్లకు నుపయోగింపకూడదు అను నిబంధనను యేమరక జరుపుకొనవలయును. ఈదేశములో చాలా పశువులు అల్పకాయములు గలవయియుండుట యీనిబంధనను అశ్రద్ధచేసినందుచేత ననుటకు సందేహములేదు; గిటకవారిన దూడలు జన్మించి వాటి సంతానము క్రమక్రమముగా కేవలము అల్పశరీరములు గలవయియుండుటంతా పయి నిబంధనను నిర్లక్ష్య పెట్టినందుకు ఫలమని తెలియవలయును. ఈదేశమందు ప్రస్తుతపు పశునిర్వాహకపద్ధతి కీడుకు మూలమయియున్నది. చిన్న పెయ్యదూడలు యెద అయ్యీకాక మునుపే ఆబోతుచేత దాటింతురు అందుచేత ఆపెయ్య తన గర్భస్థమగు దూడను మోయ శక్తిలేక పోవుటయే గాక యీనినపిదప దూడకు చాలినన్ని పాలుండనేరవు. కాబట్టి గర్భస్థమయియుండు దూడ తన పోషణార్థమయి మాతృభుక్తాన్న సారమును తా గ్రహించుటచే తల్లి గిటకవారిపోవును. ఇదిగాక కోడెలకు తగుప్రాయము రాకముందే విచ్చలవిడిగా పెయ్యలనుదాట నిచ్చుటచేత వాటివలన పిండోత్పత్తియగుట అనిశ్చయము. మఱియు నట్టి కోడెలు పిందెలోనే పండిపోవుటచేత పెంపుచెడి ఆవులను దాటించిరేని అట్టి ఆవులకు జన్మించెడు దూడలు గిటకవారి నకనకలాడుచుండును. అంగవికారముగల పశువులు సంతానవృద్ధికి పనికిరావు. చేతిసొమ్ము వ్రయపరచి కురూపములుగల పశుసంతతినివృద్ధి చేయుటకంటె ఆసొమ్మునే మేలుతరమగు వాటిని వృద్ధిచేయుటయందు వినియోగించుట దొడ్డబుద్ధిగదా. వికారమయిన పశుసంతతిని వృద్ధిపరచుట యెంతటి వెఱ్ఱితనము! ఇట్లు చేయుటచే ధనవ్రయమున్ను కాలవ్రయమున్ను వృధాప్రయాసయున్ను గలుగుటయేగాని లాభమేమియులేదు. దాట్లకు యోగ్యములుకాని కోడెలచేత గలిగెడు చెఱుపును నివారించుటకు తగినసాధకము బాల్యమందే వాటికి విత్తనములు తీసివేయుటయని యెఱుగవలయును. ఇట్లు చేయుటచేత అవి చక్కగా యెదిగి పనిపాటులకు నుపయోగించును. కాబట్టి దాటుప్రాయము రాకమునుపే అప్రయోజకములగు కోడెలకు విత్తనములు తీసివేయవలయును. శస్త్రమూలముగా అండములను తీసివేయుపద్ధతి యీదేశమందు కొందరకు మతవిరుద్ధమయినను దీనివలని లాభమిట్టిదియని గుర్తెఱిగి యీపద్ధతిని బహుమంది చాలాప్రదేశములయందు అవలంబించియున్నారు. విత్తనములను తీసివేయుపద్ధతిని తగువిచారణతోటిన్ని వివేచనతోటిన్ని జరుపుకొనినయెడలఆజిల్లాలోనిపశువులు మేలుతరమయి

వృద్ధియగును. కాబట్టి సర్కారువారు లోకోపకారము చేయదలచి కొందరకు విద్యగఱపి యిట్టి ఘనకృత్యమును నిర్వహింప సమర్థులగాజేసి వారలను జిల్లాలకు పంపుచున్నారు. లోకులు వివేకులయినయెడల అట్టి యుద్యోగస్థుల సహాయ్యమును పొందగోరవలయును.

అబోతు వికారస్వరూపముగలది యయ్యెనేని దాని సంతానము సహితము యెట్లు వికారముగానుండునో తల్లిదండ్రులు రోగపీడితములయి యుండునెడల అట్టి రోగములు చాలామట్టుకు బిడ్డలకు వచ్చుటగలదు. దూడ పుట్టినపుడే ఆరోగము కనుపడకపోయినను వయస్సువచ్చుకొలది సంభవింపవచ్చును. కాబట్టి "ఆడుపశువుగాని అబోతుగాని యేవిధమయిన జాడ్యములేక ఆరోగ్యముగా నుండవలయును" ఈనిబంధన ముఖ్యముగా దాటే, కట్టే, యీనే మృగములన్నిటియందును చెల్లుబడి కావలయును. మఱియు తల్లిదండ్రులు కేవలము ముసలివయి పెంపుచెడియుండినయెడల వాటికి ఉత్పత్తియయ్యెడు దూడలు అల్పగాత్రములుగలవయి బక్కవారియుండును. అందుచేత ఖావందుపడిన ప్రయాసకున్ను వానికి అయిన పట్టుబడికిన్ని యీడు రాజాలదు. కాబట్టి మంచిప్రాయముగలిగి బలిష్ఠమయి జాడ్య రహితమయి పూర్ణగాత్రముగలవయి ఆజిల్లాకు ననిపియుండెడు పశువులే సంతానప్రవృద్ధికి అర్హములైనవి.

మగపశువుమంచి ప్రాయముగలదై చక్కగా దాటగలిగి యుండవలయును. మగపశువునందుండు దుర్లక్షణములు ఆడుపశువునందుండు దుర్లక్షణములకంటె అధికముగాకీడు కలుగజేయును. ఏలననగా, ఆడుపశువు తనశోణితము చేత ఒకదూడను ఉత్పాదనచేయునంతలో మగపశువుయొక్క శుక్లము పెక్కుయోనులయందు పర్శిల్లి పెక్కుసంఖ్యలుగల దూడలు ఉత్పత్తి యగుచున్నవి. కాబట్టి ఆడుపశువుయొక్క దుర్లక్షణములు తనదూడయందుమాత్రమే తోపవచ్చును గాని మగపశువుయొక్క దుర్లక్షణములు యేకకాలమందు పెక్కుసంఖ్యలుగల దూడలయందు కనుపడును. అబోతులమూలముగా ఆడుపశువులకు అంటెడుజాడ్యములు కొన్నిగలవు. పసిమిజాడ్యముగల అబోతు ఒకఆవును దాటినయెడల అట్టిఆవునకు ఆజాడ్యమంటవచ్చును. మఱియుమగపశువులకు అంటుసంబంధమైన అంగజాడ్యములున్నయెడల అట్టిజాడ్యములు తాముదాటెడు ఆడుపశువులకు సహితము అంటగలవు. (పశువులకుగలిగెడు అంగజాడ్యములు మనుష్యులకుసంభవించెడు "సొప్పు" జాడ్యములవంటివి



కావు). కాబట్టి ఆవులను దాటించుటకు అబోతును తెచ్చుకొనువారు ముందుగా ఈవిషయమును యోచించి పిమ్మట దాటింపవలయును.

ఆడుపశువు మంచిప్రాయమున్ను శాంతమానసమున్ను గలిగి కడుపారమేతతినునదియై సంతానాంగములు గొప్పలయి చక్కగాయేర్పడి యుచితకాలమందుపయిరగునదియు, గర్భస్థమయి యుండునపుడున్ను భూస్థమయినయనంతరమున్ను దూడనుపోషించికొనశక్తిగలదయియుండవలయును. ఇట్టిలక్షణములు గల పశువుపయిరయిన పిమ్మట శ్రద్ధబుచ్చుకొనిదానిని చక్కగా కాపాడుచు అల్లరిపరచే జంతువులను దగ్గరరానివ్వక తగు బందోబస్తు చేయవలయును. ముఖ్యముగా ఈతకు నెలలు సమీపించినపుడు అల్లరికోడెలను సమీపింపనివ్వకూడదు. మఱియు చూలుపశువులను యీనేపశువుల సమీపమందుంచుటగాని, వాటిచేత అతిపాటుచేయించుటగాని, వాటికి మిక్కుటముగా తిండివేయుటగాని యుక్తముగాదు. అట్లుచేసినయెడల చూలు పశువులు * ఈచుకపోగలవు. క్షామకాలములయందుగాని కసవుదినుసులకు కాటుక, బూజుపట్టినపుడుగాని చూలుపశువులు యీచుకపోవుటగలదు. ఇట్టి కారణములచేత కొన్నిసంవత్సరములయందు ఖావందులకు నష్టము గలుగుచున్నది. జాడ్యవ్యాపకము నివారణయగునని తలచి కొన్నిసమయములయందు పశువులమావిని చెట్లకువ్రేలగట్టుదురు. అట్లువ్రేలుచున్నమావిని యయినాసరే, ఊరకే నేలబడియుండు మావినియయినాసరే చూలుపశువులు ఆఘ్రాణించినయెడల తత్క్షణమే చూలుదిగబడును. పశువులు యీనేటప్పుడు ఖావందులు గమనింపవలయు నంశములు రెండుగలవు. అవియెవ్వియనిన - మొదటిది, సాధ్యమయినవరకు పశువుయొక్కబలము తగ్గనివ్వక కాపాడవలయును. రెండవది- పశువునుముట్టుకొనకుండా దానికికావలసినసహాయము చేయవలయునేగాని అంతకుమించి తాముయెంతమాత్రము దానిజోలికిపోక దయివికమును నిరీక్షించుచుండవలయును. దూడ సులభముగాబయటరానియెడల ఆదూడ సమపాటున యున్నదాలేదాయని బహునిష్కర్షముగా పరీక్షింపవలయును. దూడయొక్క ముందటికాళ్లున్ను తలయున్ను ముందుకు నెట్టుకొనివచ్చియుండుట సమపాటు. అట్లుండినయెడల తల్లిపశువు ముక్కుటచేత తిన్నతిన్నగా దూడ

* పశువులలో గర్భస్రావము "ఈచుకపోవుట" యందురు.

బయటబడును. తఱుచుగా దూడెనుఱ్ఱియానినపిమ్మట మావివేయుటకు కొంత సేపుపట్టును గనుక తల్లి పశువునకుకొంతబలము గలుగుటకొరకు సారాయము నిచ్చుట మేలు. దూడ తప్పుపాటున్నయున్నయెడల దానినిసమపాటుకు త్రిప్పుట అవశ్యముగాని దూడత్వరగా బయటవచ్చుననే ఆశతోటి బలవంతముగా యెంతమాత్రము లాగగూడదు. అట్లులాగుటచేత *యోనీకమలసహితముగా సర్వముజారీ చెరుపుగలుగజేయును ఇటులసంభవించినయెడల వెంటనే యోనీకమలమును స్వస్థానముజేర్చి ఆపశువునకుబలకరమగు మేతబెట్టి కాపాడవలయును. తల్లిపశువు బలహీన దశయందుండినపుడు బలవంతముగా చేతితోటిలాగుటచేతయిట్టివిపత్తు సంభవించును. దూడ యోనీకమలమందుండునపుడు దానిచుట్టు కొన్నిపొరలుచుట్టుకొని యుండును. దూడబయటరాగానే దానితో కూడా ఒకపొరమాత్రమువచ్చును. తక్కినవి మరికొంత సేపటికి వెలియగును.

సంరక్షణ.—దూడలకు మేత మట్టుపరచి వాటినివిచ్చలవిడిగా తిరుగులాడనిత్తురు. ఇదిమహాతప్పు. ఇట్లుచేయుటచేత అవి గిటకవారిరోగములపాలయి చెడును. పశువులుగాని, గుఱ్ఱములుగాని యీనెడికాలము మంచిపచ్చికదినములుగానుండినయెడల వాటికి చక్కగా మేతచిక్కి దూడలకు లెస్సగా పాలివ్వగలవు. మఱియు దూడలు మేతనందునపుడు సహితము లేతపచ్చికపుష్కలముగా దొరక గలదు. కాబట్టి ఖావందులు తమ పశువులు పచ్చిక కాలములలో యీనునట్లు సాధ్యమయినంతవరకు ముందుగా తగుజాగ్రతపడియుండవలయును. దూడలు పాలుత్రాగుకాలమందె వాటిని నిరాటంకముగా పరుగులెత్తనివ్వవలయును. అట్లుపేరెములెత్తుటచేత దూడలు కండబట్టి యెముకపుష్టి గలిగియుండును. ఈదేశమందు దూడలకాళ్లకు బంధములువేయుట పశుసంరక్షణ లోపములయందు యిదియొకపాపిష్టిలోపము, ఇట్లుచేయుటచేతవాటికికాళ్లువంకరపోయి బలహీనమయి బహుపనులకు అనుకూలింపక చెడును. గుఱ్ఱములయినయెడల అట్టివాటిమీద సవారిచేయుట మేలుగాదు. ద్రింమరిజంతువులను విచ్చలవిడిగా తిరుగులాడకుండా మాన్పుటకు తగుసాధకము చేసికొనవలయును. మఱియు మొగవాటికి విత్తనములుతీసివేయుటచేత వాటిదుష్టతనమునివారితమగును.

---

* దీనినేపింఛకోశమనియు, సాధారణముగా గర్భమనియువాడెదరు.

# 7-వ

# అధ్యాయము.

## మనుష్యులకు ఆహారముగానుపయోగించెడు

## మాంసము - పాలు.

మాంసమును ఆహారముగా వినియోగించుటయందు హిందువులకును మహమ్మదీయులకును మతాభిమానము గలదుగాని క్రీస్తువులకు అట్టిదిలేదు. అయినను యీదేశమందు వేటమాంసము యెద్దుమాంసము మిగుల నుపయోగింపబడుటచేత యిట్టి మృగములను వధించి భక్షించెడు జనులకు అందువలన నేవిధమయిన సౌఖ్యహాని గలుగకుండా దానిని సంపాదించుకొని పక్వపరచుకొనుటకు కొన్నిమార్గములను వివరించెద. వధశాలలున్ను తత్సంబంధములగు పదార్థములున్ను పరిసరములున్ను శుచిగానుంపుట అవశ్యము. అట్టి శాలలయందు సోకుడు పరిహారకృత్యములను మెండుగా సలుపుచు అందలి పేడపెంట మొదలగు అశుద్ధ వస్తువులను దూరముగా గొనిపోయి పారవేయవలయును. సాధ్యమయినంతవరకు యీ అశుద్ధవస్తువులను చేలకు యెరువుగాగాని మరి యితరకార్యములకుగాని వినియోగించుట యొప్పును. వధార్హములగు జంతువు లెట్టివనగా, (౧) కేవలము వయస్సు చెల్లినవిగాక, (౨) కేవలము కందుకూనలుగాక, (3) జాడ్య గ్రస్తములయినవిగాక. (౪) చూలుధరించి యుండునవిగాక, (౫) కేవలము బక్కచిక్కినవిగాక అన్యములుగానుండవలయును. అట్టిజంతువులు వధించుటచేతగాక సహజముగా మరణము నొందినవయినయెడల వాటి మాంసము భక్షణార్హముగానేరదు. వధచేయుమార్గము సాధ్యమయినవరకు క్రూరముగానుండకూడదు. ఈదేశస్థులయొక్క మతసంబంధములగు అభిమానములనుపాటించి వాటిని దురారోపణచేయక జరుపుకొనుట అందుకు అనుకూలమగుమార్గమయి యుండును. మహమ్మదీయులు జంతువులను వధించుమార్గము నిస్సందేహముగా బహుబాధ పూర్వకమయినది. ఇట్టి పద్ధతికంటె కుఠారము (దీనినే గండ్రగొడ్డలియందురు) చేత వధించుట జంతువునకంత బాధకరముగానేరదు. ఇట్లు చేయుట మహమ్మదీయ మతవిరుద్ధమగుటచేత యీపద్ధతి వారియెడల నొప్పదు. వయస్సు చెల్లినట్టియు బక్కచిక్కినట్టియు జంతువు

నిర్ణయింపబడి అట్టి వధశాల సంబంధమయిన పనులను నిర్వహించుటకు చాలి, మాంసముయొక్క మంచి శ్రేష్ఠతలనున్ను వధించుటకు సులభోపాయములనున్ను గుర్తెఱిగిన యొకఉద్యోగస్థుడు నియమితమయి యుండవలయును. వధశాల మూడుభాగములుగలదిగా నుండవలయును. మొదటిది.—జంతువులు లోపలికివచ్చి నిలుచుటకునై గులకరాళ్లుపరచి దిమ్మిసచేయబడిన చప్పటయున్ను ఉన్నతమయిన గోడలున్ను ద్వారములున్ను గలిగిన యొకదొడ్డి. ఈ దొడ్డిని రెండుగదులుగా భాగించి లోపలవచ్చిన జంతువులను వేర్వేరుగా ఆగదులలో నుంచవలయును. గదులలో నుండగానే వాటిని తనఖీచేసి త్రాగను నీళ్లు పెట్టవలయును. ఒక జంతువుయొద్దనుండి మరియొక జంతువునకు చుట్టుకొనెడు స్వభావముగల జాడ్యములచేత బాధపడుచుండెడు జంతువులయొక్కగాని యితరకారణములవలన వధార్హములుగాని జంతువులయొక్కగాని మాంసము భక్షణకు యోగ్యముగాదు. కాబట్టి వధార్హములుగాని జంతువులను తక్షణమే బయట దోలించి వాటి స్వంతదారుయొద్దనుండి దుకాణమునకు చేరవలసిన పన్నును పుచ్చుకొని రోగపు జంతువులను సుఖజంతువులయొద్ద నుంచక ప్రత్యేకించి వాటిని వధించి ఆశవములను దహనము చేయవలయును, లేదా అట్టి జంతువులు నిమ్మళపడువరకు తగు బందోబస్తులోనుంచి అందుకయ్యెకడి సొమ్మును స్వంతదారునియొద్దనుండి వసూలుచేయవలయును. ముఖ్యముగా ఈదొడ్డియందు సోకుడుపరిహార కృత్యములను శ్రద్ధగలిగి సాగింపుచుండవలయును. రెండవది.—వధదొడ్డి.—ఇదిసహితము గులకరాళ్లుపరచి చక్కగా దిమ్మిసచేసి జలదారుల నేర్పరచి యుంచవలయును. ఈజలదారులగుండా ఆప్రదేశమందుపడిన రక్తము మొదలగు ద్రవపదార్థములు గారతోటికట్టబడిన గోతులలోనికిపారును. ఆగోతులలో జేరెడు విసర్జనవస్తువులను అచ్చటనుండికొనిపోయి పూడ్చివేయవలయును. ఈదొడ్డి మొదటిదొడ్డితోటి కలిసియుండి దీనికిమఱియొక ప్రక్కన ద్వారముండవలయును. ఒకద్వారముగుండా తయారుఅయియుండు మాంసమును మూడవనంబరుగల చల్లటింటి లోనికి పట్టుక వెళ్లుటకున్ను తక్కినద్వారములగుండా విసర్జనపదార్థములను బట్టీ యొద్దకుకొనిపోవుటకును ఒనరుగానుండును. అసాధ్యములగు అంటుజాడ్యములచేత భాధపడుచున్నందున నిషేధింపబడిన జంతువులను బట్టీయొద్దకు తీసుకవెళ్లుటకు మొదటినెంబరుదొడ్డికి నొకద్వార మేర్పరచియుంచవలయును. ఇందుతోటి జతపరచబడియుండు నక్షినిబట్టి వధశాల



నిర్మాణ మిట్టిదియని యూహింపనగును. శవములు కాల్పబడెడు బట్టీని సర్వజనులున్ను ధారాళముగా వాడుకొనవచ్చును. జాడ్యపుపశువులను చేర్చుకొనుటకు ని[illegible]యమయియుండు దొడ్డి ఆసుపత్రి ఆవరణములో యుండును. అట్టి ఆసుపత్రి (వైద్యశాల) 1886 సం॥ చెన్నపట్టణరాజధాని నెం 2 రు శాసనములో విధింపబడిన మేరకు పశువులఖానందులకు ఉపయోగపడును. వధశాలయందు చేరెడి విసర్జన వస్తువులనున్ను, రోగపీడితములయిన మాంసఖండములనున్ను, మామూలుగా వధశాలకుగాని వైద్యశాలకుగాని తోలుకరాబడి అసాధ్యములగు అంటుజాడ్యములచేత బాధపడుచుండునట్లు యేర్పడే జంతువుల కళేబరములనున్ను, అట్టిజంతువులకు వాడుచూవచ్చిన పడకగడ్డి పాత్రసామగ్రులు మొదలగువాటినిన్ని, మఱియు అగత్యమయినయెడల అట్టిజంతువులకు ఆహారాదులు విచారించుచువచ్చిన శేవకులయొక్క బట్టలు మొదలగు సామగ్రులను సహితము, బట్టీలోవేసి దహనము చేయవలయును.

పాలు.—పాలు సాధారణముగా ఆహారపదార్థములలో నొకటియైయుండుటవలనే యిట్టిపదార్థమును పానముచేయుటచేత కొన్నిసమయములయందు గలిగెడు ఆపాయములగురించి కొంతవివరించెద. ఈదేశపుఆవుపాలు, ఆంగ్లేయదేశపు ఆవుపాలు - యీరెంటెని తరచిచూడగా యీదేశపుపాలు బహు నిస్సారముగానుండును. ఆంగ్లేయదేశపు ఆవుపాలు మీగడపరకలతోటి గలసి చిక్కగానుండును. మఱియు యీదేశమందు కొన్నిసమయములలో పాలలో నీళ్లు గలిపి చాలాపలచగాచేయుటేగాక మీదుమిక్కిలిగా పనికిమాలిన గేదపాలను తెచ్చి ఆవుపాలని విక్రయింతురు. ఇందుచేత ప్రాణోపద్రవము యేమియులేదుగాని ఆపాలలో చేర్చబడునీళ్లు శుద్ధమయిన జలాశయములనుండి తేబడినవిగాకపోవచ్చును; మఱియు పశువులు మేసెడిపదార్థములగుణమే వాటిపాలయందుండును గనుక బట్టెలు అశుద్ధపదార్థములను భక్షించెడివగుటచేత వాటిపాలుపానమునకుయోగ్యములు గావు. సన్నిపాతజాడ్యసంబంధమగు వస్తువులుకొన్ని జలాశయములందు చేరియుండుటు గలదు. అట్టిజలమును పాలలోకలిపినయెడల ఆపాలనుపానముచేసెడివారికి సన్నిపాతవ్యాధిసంభవింపకతప్పదు. ఇట్టిపాలమూలముగా సన్నిపాతము సంభవించియున్నట్టు దృష్టాంతములు మెండుగాగలవు—గాని పశువులకు గలుగు చీకతే మనుష్యులయందు సన్నిపాతముగా యేర్పడుచున్నదనుటకు దాఖలాలులేవు. క్షయరోగముచేత భాధపడుచుండెడి పశువులపాలను మనుష్యులుత్రాగి

కని వారికిసహితము క్షయప్రాప్తించును. పశువులలో గాలికుంట్లుతగులుచుండినా అట్టిపశువులపాలను బిడ్డలకుత్రాగించుటచేత ఆబిడ్డలకు భేదులుపుట్టును. కాబట్టి యీజాడ్యము చుట్టుప్రక్కల ప్రబలమయియుండునపుడు పశువులపాలను చక్కగాకాచి పిదపబిడ్డలకు త్రాగింపవలయునుగాని పచ్చిపాలను త్రాగింపకూడదు. పాలనుమరగబెట్టుటవలన అందలిహానికరములగు వస్తువులుసమసిపోవును. దుర్బలపరచెడి జాడ్యములచేత పీడింపబడుచుండెడుజంతువుల్లు చక్కగాపాలివ్వజాలకపోవుటయేగాక వాటిపాలు నిస్సారమైయుండును; కాబట్టి అట్టిపాలలో చమురువస్తువులున్ను శర్కరవస్తువులున్ను మాంసమును వృద్ధిపరచువస్తువులున్ను స్వల్పములయియుండును. శ్రేష్ఠతరమగుపాలు సుఖకరమయిన ఆహారపదార్థము. ఏలననగా, మనుష్యులకు జీవాధారములయిన సమస్తవస్తువులు వాటియందు పూర్ణముగానుండును. పితికినపిమ్మట పాలయందుకొన్ని * మార్పులుగలుగుట సహజముగనుక యిత్తడి పాత్రలయందు వాటినిఉంచుటచేత చిలుమెక్కును. అట్టిపాలను పానముచేసెడువారికి ఆవిషమంటె మరణమునుగాని యితరజాడ్యమునుగాని కలుగజేయును. కాబట్టి యిత్తడిపాత్రలయందు పాలుపోసి కొంతసేపు ఉంచిపెట్టుట మహాఅపాయకరము. చెన్నపట్టణమందు మరియొక దుర్వాడుకగలదు. అదియెద్దియనగా, పశువులరొచ్చుతోటినిండి మన్నుమయిలగల వసారాలయందు పాలచట్లను చాలాకాలమువరకు ఉంచిపెట్టుదురు. ఆవసారములలో నొకప్రక్కపాలవాడున్ను వానిసంసారమున్ను, మఱియొకప్రక్క కొంకులబంటి రొంపిలో పశువులున్ను వాసముచేయుటగలదు. ఇట్టివాడుకచేత ఆప్రదేశమందలి రొచ్చులోనుంచిన్ని అచ్చటవసించెడు జనులయొద్దనుంచిన్ని ఉత్పత్తియగు విషవాయువు ఆకొట్టమంతటవ్యాపించి అచ్చోటనుంచబడియుండు పాలలో గలసి వాటిగుణమును చెరుపును. అట్టిపాలను త్రాగువారికి రోగములు సంభవించును. రుగ్మతగల పశువులపాలు పానమయోగ్యములు కానేరవు; కాబట్టి అట్టిపశువులపాలను పితకకూడదు. పితికిన పాలనుపితికినట్లుగానుంచవలయునుగాని అందులోనీళ్లుకలియ్యబోయకూడదు. మఱియుపాలను దుత్తలయందుంచి అందులోమన్నుగాని, రోగమును ఉత్పాదించెడు పదార్థములుగాని పడనివ్వక మూతబెట్టవలయును. చాలాకాలము దుత్తలలోనే

* గుణభేదము, వర్ణభేదముగలుగుట. పులుసెక్కుట గుణభేదమనియు, నీలవర్ణమగుట వర్ణభేదమనియు యెఱుగునది.



యుంచినయెడల అందలిపాలు పులుసెక్కి సారము తగ్గిపోవును, కాబట్టిపాలయందిట్టి మార్పులు గలుగకమునుపే వాటిని వినియోగపరచవలయును. పట్టణప్రదేశములయందు పాలనుపితుకుట విక్రయించుట మొదలగు విషయములగురించి శాసనమొకటికేవలము అగత్యమయియున్నది. అట్టిశాసనముపుట్టేపర్యంతము పాలనుకొనెడివారు తాముకొనేపాలు వెన్న మొదలగునవి యెట్టిప్రదేశములనుండి తమకుచేరుచున్నవో చక్కగా తెలుసుకొని జాగరూకులయి యుండవలయును. పయినచెప్పబడిన అంశములన్నియు ఆవుపాలకేగాక మేకపాలకు సహితము చెల్లుచున్నవి. ఒక ఆవుయొక్కపాలు మరియొక ఆవుపాలకంటె సారవంతముగాగాని, నిస్సారముగాగాని, లేక రెండున్ను సమానములుగాగాని యుండవచ్చును. పాలు యేలాగునయుండినను విషవాయువుగల ప్రదేశమందుంచినయెడల ఆవిషవాయువును గ్రహించుటయందు అన్నియు సమానధర్మములు గలవైయుండును.

---

# 8

# అధ్యాయము.

## పశువులు విషము గొనుట.

మృగజాతులు స్వాభావికజ్ఞానముచేత విషసంబంధములగు కసవుదినుసులకడద్రోచి తమకు భక్షణయోగ్యములగు పచ్చికలనే మేయునని సాధారణముగా దలచెదరు-గాని పశువులు తెలుచుగా విషవంతములగు వస్తువులను భక్షించి దానిచేత * నాముగొని బాధపడుట గలదు. పశువులు విషముగొని మరణించుట మూడు విధములచేత గలుగును. అవియెవ్వియనిన:—

(1) ప్రారబ్ధము (Accidental.)
(2) ద్రోహము (Criminal.)
(3) అశాస్త్రీయవైద్యము (Empirical.)*

ప్రారబ్ధము.——మేతదొరకని కాలములయందు పశువులు యెండిపోయిన కంచెలయందు తిరుగులాడుచు కసవు చిక్కకపోవుట బట్టి వేంద్రమయి విషవంతములయి తమకు తినను ఉచితములుగాని ఆకలములను మేయుటచేతనున్ను, విషపుట్టలు పట్టియుండు చొప్పమొదలగు గడ్డిదినుసులను తినుటచేతనున్ను, గలిగెడు విషము ప్రారబ్ధ భోగమని యెఱుగవలయును. ఆకస్మాత్తుగా మేతతోటిగలసి పశువుల కడుపు జొచ్చెడి విషపుమొక్కలు యెవ్వియనగా:—

(1) ఉమ్మెత్త
(2) జిల్లేడు
(3) పొగాకు
} వీటిని తినుటచేత పశువు స్మారకముతప్పి మరణించును.

ద్రోహము.——మనఃపూర్వకముగా పశువులకు విషముబెట్టి చంపుటద్రోహమార్గమగును. ఇట్టి దురాచారము యీరాజధాని యందేగాదు - హిందూరాష్ట్రమందంతటను సర్వసాధారణమైయుండవలెనది. ఈదేశమందు నీచకులము వాండ్రు దుష్టతనముచేతనో, లేక ఆదాయము బొందుటకో పశువులకు విషముబెట్టి చంపుదురు. ఎందుకనగా నేమి ప్రతిసంవత్సరము యీకారణముచేత చాలాపశు నాశము కలుగుచున్నది. చచ్చిన పశువులను ఆగ్రామమాలమాదిగెలకు యిచ్చివేయుట గ్రామాచారమైయుండుటబట్టి తోళ్లగిరాకి అయ్యేకాలములయందు మాలమాదిగెలు బుద్ధిపూర్వకముగా చర్మలాభముకు ఆశించి ఆగ్రామ పశువులకు విషముబెట్టి చంపుదురు. కాబట్టి గ్రామస్థులు యికనైనా తెలిసికొని గ్రామాచారమని వాడుకలోనుండు పూర్వపద్ధతిని వదలిపెట్టినయెడల మాలమాదిగెలకు యీలాటి ద్రోహచింతన కలుగదు.

నియమితకాలమునకు నియమితసంఖ్యగల తోళ్లను తెచ్చి వర్తకులకు ఒప్పగింతపెట్టేటట్లు వాండ్లతోటి మాలమాదిగెలు ఖరారుచేసికొనియుండుట సాధారణము.

మాలమాదిగెలు పశువులకు సహజముగా వాడెడి విషవస్తువులు స్థావరవర్గ సంబంధములుగాగాని (Vegetable Kingdom) ధాతువర్గ సంబంధములుగాగాని (Mineral Kingdom) యుండును.

స్థావరవర్గసంబంధ విషములు.

(1) ఉమ్మెత్త
(2) జిల్లేడు
(3) ముష్టి
(4) అడవినేపాళము

ధాతువర్గసంబంధ విషములు.

(1) ఉల్లిపాషాణము
(2) గౌరీపాషాణము

విషముబెట్టుట పలుదెరగులయి యుండును. ఎట్లనగా:—

(౧) విషవస్తువును పిండి తోటిగాని, తవుడుతోటిగాని పిసికి ముద్దచేసి అరటిఆకులోనేమి మరియితర ఆకులోనేమి మడిచి పశువు నోటికి అందిత్తురు, లేదా పశువుముందట బడవైతురు. అంతట పశువు తినును. కొన్నిసమయములయందు పశువు తినుచుండెడు గడ్డిలో కలుపుదురు.

* విషవంతములగు ఆకలములను భక్షించుటవలన పశువులకు గలిగెడి విషజాడ్యము. ముఖ్యముగా వరుపుకాలమందు రెబిగెడు జొన్నజాడును పశువులు తినినయెడల "నాము" అనెడు విషజాడ్యము సంభవించుననియు అందుకు చింతపండు రసము విరుపునుండు అనియు వాడుక గలదు.

(౨) పశువులు మేసెడు కంచెలయందు లెస్సగా పచ్చిక పట్టియుండెడు బయిళ్లమీద పాషాణపుపొడిని చల్లుదురు.

(3) ఒకకత్తితోటి చర్మమును కొంచెముగా చీల్చి ఆగాయమందు విషమ్ము బూయుదురు - లేదా ఆసనమందుగాని, యోనియందుగాని, విషపదార్థమును యెక్కింతురు.

ఈదేశమందు కొన్ని ప్రదేశములలో బహు విచిత్రముగా పశువులకు విషము బెట్టి చంపుదురు. ఎట్లనగా - అమ్మవారుపోసి చచ్చిన జంతువుయొక్క తలను భూమిలో పూడ్చిపెట్టి అది కుళ్లిన పిమ్మట దానిలోనొక సూదిని దించి కుళ్లునీరు చక్కగా సూదికి పట్టిన తర్వాత ఆసూది తోటి యితర జంతువులను కొంచెము నెత్తురు కారునట్లు పొడుతురు. అంతట అమ్మవారు జాడ్యపు విషముయొక్క వాటికి ఆజాడ్యమే సంభవించి మృతిబొందును.

సులభమై తఱుచుగా ప్రయోగింపబడెడు విషవస్తువు జిల్లేడు. దీనిపాలను ఒకచిప్పలోకి యొడిచి మూరెడు పొడుగున్ను ఒక అంగుళము వెడల్పున్ను గల గుడ్డపేలికను ఆపాలలో తడిపి ఆరనిచ్చి మరల తడిపి యిట్లు అనేక పర్యాయములు ఆరంగా ఆరంగా తడిపి ఒకఅడుగు పొడుగు అర్ధమొదలు ముప్పావు అంగుళము వ్యాసముగల యొకపుడక కొనకు చుట్టి * మూలపేగులోకి యెక్కించి పిమ్మట పేలికను పుడకకు చుట్టినవాటము విడిచి అన్యవిధముగా పుడకను త్రిప్పుటచేత గుడ్డముక్కమాత్రము అచ్చటనే నిలిచి పుడక వెలిగావచ్చును. ఆగుడ్డముక్క తడపబడినపాలు మహోపద్రవమయిన విషము గనుక వెంటనే పేగులు వాచి పశువు బహుబాధపడి మృతి నొందును.

ప్రాణోపద్రవములగు అంటుజాడ్యములు వ్యాపించియుండెడు గ్రామాదులలో ఆగ్రామపు మాలమాదిగెలు తోళ్లకు ఆశించి † అంటుజాడ్యసంబంధములగు వస్తువులచేత తక్కిన పశువులకు సహితము ఆజాడ్యము సంభవింపజేసెదరు. అట్టిమాల మాదిగెలమీద గ్రామస్థులకు అనుమానములేక పోబట్టి యిట్టి నేరస్థులను పట్టుకొనుట దుస్తరము. కాబట్టివాండ్లు జంకులేక నిర్భయముగా యిట్టి కృత్యములు చేయుచున్నారు. మఱియు తమ గ్రామములోనే కాకుండా సరకు, దొమ్మరోగములు తగిలిన పశువులు వేసిన పేడను అన్యగ్రామములకు సహితము పట్టుకవెళ్లి ఆగ్రామ కంచెలలో మంచి పచ్చికగల ప్రదేశములమీద చల్లివత్తురు. అంతట అట్టి ప్రదేశములమీది పచ్చికను తినెడు జంతువులకు ఆజాడ్యములు సంభవించి క్రమక్రమముగా ఆగ్రామ పశువులకన్నిటికి చుట్టుకొనును.

* దీనినే పురీషపుపేగు అనియు పెంటపేగు అనియు కొవ్వుపేగు అనియు చెప్పుట గలదు.

† ధొమ్మ, సరకు మొదలగు అంటుచీడలు ప్రారంభమైనపుడు మాలమాదిగెలు యీజాడ్యములకు తోడుగా " ఉచ్చాటన " చేసి చీడలను రేపుచున్నారనిన్ని, అందుచేత మందలు మందలుగా పశువులు చచ్చుచున్నవనిన్ని యొక వెఱ్ఱివాడుక కలదు. అంటు చీడలవల్ల చచ్చిన పశువుల పేడ, మొదలగు వస్తువులను మాలమాదిగెలు పట్టుకవెళ్లి మందలలోని పశువులు మేసే పచ్చికబయిళ్లమీద పారజల్లుదురు. ఆప్రదేశములయందు మొలిచియుండు పచ్చికను పశువులు తినుటచేత అంటు సంబంధమయిన విషము కడుపులోనికి వెళ్లి వాటికి సహితము ఆచీడలు ప్రాప్తించి మందలు మందలుగా పశువులు చచ్చును. ఇదే ఉచ్చాటనగాని యింతకు మించినది, అనగా మంత్రపూర్వకమైన ఉచ్చాటనలేదు. మరియు అంటుచీడల సంబంధమయిన విషవస్తువులు, అనగా అంటుజాడ్యమువల్లచచ్చిన జంతువులపేడ మొదలగు వస్తువులను మాలమాదిగెలు తమ యిండ్లయందు దాచియుంచుట సహితము కలదు. తోళ్లుగిరాకి అయినపుడు ఆపేడను పట్టుకవెళ్లి పశువులుమేసే పచ్చికబయిళ్లమీద చల్లుదురు.



అశాస్త్రీయవైద్యము.—కొందరు తాము అభ్యసించిన ఔషధముల యొక్క గుణములనుగాని, వాటిని యుపయోగింపవలసిన తరుణమునుగాని తెలియక అట్టిమందులవలన జాడ్యనివారణ మగునని తలచి వాటిని వాడుటవలన అవివికటించి రోగికి ప్రాణాంతమును కలుగజేయును. ఇదే అశాస్త్రీయవైద్యమనబడును.

ఆలగాపరులు, గొల్లవాండ్రు, పాలముకాపులు—వీరు తాము నేర్చుకొనిన ఔషధములయొక్క గుణములు యిట్టివని బొత్తుగా తెలియకనే పశువులకు వారిమాదులను వాడుచుండగా మహాప్రసిద్ధినొందిన యొకమృగరోగచికిత్సకుడు (Veterinary Surgeon) చూచి యున్నాడు. అట్టిమందుల సేవించిన పశువులు జాడ్యములచేతగాక యితరకారణములవల్లగతించుచున్నవి. ఈకారణములు జాడ్యస్వభావలక్షణములని విభ్రాంతిపడి రోగి

# 9-వ

# అధ్యాయము.

## శవములను దహనముచేయుటకు నుపయోగించెడు

## బట్టీలు—ఆరోగ్యవిషయము.

ఈదేశమందు గృహకృత్యజంతువులు పెక్కులుగలవు. అట్టిజంతువులలో మృతినొందినవాటి కళేబరములను యెట్లుపరిష్కరింపవలయునో విచారించుట మహాయెక్కువయిన విషయము. ఇట్టివిషయములనుగురించి స్వదేశీయులు శ్రద్ధపుచ్చుకొనినవారుకారు.

శవములను యెంతలోతున భూస్థాపితముచేసినను ఆప్రదేశమందు కొన్నాళ్లకు జాడ్యసంబంధములగు వస్తువులుపోకి అచ్చోటవాయువు అశుద్ధమయి అసౌఖ్యకరమయి ఆప్రాంత్యములయందు వసించెడిమనుష్యులకున్ను మృగములకున్ను హానిగలుగజేయును.

శవములను భూస్థాపనచేయుట నిస్సందేహముగా సుఖకరముకాదు. కాబట్టి సర్కారువారున్ను వైద్యశాలసంఘమువారున్ను కఠినమయిన నిబంధనలను పుట్టించి సాధ్యమయిన ప్రదేశములయందు యిట్టివాడుకను నిలుపుదలచేయవలయును. భూస్థాపనచేయువాడుకను నిలుపుదలచేయుటవలన జనాదాయమునకు కొంతవిరుద్ధము సంభవింపవచ్చును. అయినను ఆరోగ్యవిషయములుచక్కగా జరగనియెడల మనుష్యులకు ప్రాణాపాయములు కలుగుచుండును—కాబట్టి యిట్టివాడుకను నిలుపుదలచేయుటవలన జనాదాయమునకు విరుద్ధమని యెంతమాత్రముతలచగూడదు.

ఇందుతోటి జతపరచబడిన నక్షిప్రకారము బట్టీని నిర్మాణముచేయవలయును. దొమ్మమొదలగు అంటుజాడ్యములచేత మృతిబొందిన జంతువుల కళేబరములనుగాని అశ్వక్షయ అనురోగముచేత బాధపడుచుండెడు జంతువులను సంహరించి వాటికళేబరములనుగాని దహనముచేయుటకున్ను, గాయములకును కురుపులకును చికిత్సచేయునపుడు వాడబడిన కట్టుగుడ్డలు మొదలగు వ

స్తువులను సహితము కాల్చిబూడిదచేసివేయుటకున్ను యీబట్టీలు ఉపయోగించును. మఱియు లాయములలోని పడకగడ్డి, లద్దిమొదలగు విసర్జనవస్తువులను చేలకుయెరువుగా నుపయోగింపబడక రాసులుగాయేర్పడి జనసౌఖ్యమునకు విరోధము గలుగజేయునని తోచునెడల అట్టివస్తువులను సహాబట్టీలో వేసి కాల్పవలయును.

ఈవిషయమును యింతకుపూర్వమే సమస్తజనులకు యెరుకపరచియుండిన యెడల బట్టీలవలనిప్రయోజనమిట్టిదియని యిప్పటికి వారుకనుగొనియుందురు. ఇప్పటికయినను కాలముమించిపోలేదు. జాడ్యాంకురములను నిర్మూలముచేయుటకు అగ్నిసహాయ్యమునకంటె మించినమార్గము మరియొకటిలేదు. కాబట్టి అంటుజాడ్యవ్యాపకమును నివారించుటకు సూటియగు మార్గము దహనకృత్యమునకంటె అన్యములేదని విశుద్ధముగా తెలియుచున్నది. ఈదేశమందు జంతువులకుసంభవించెడి అంటుజాడ్యములు యెన్నివిధములయి యుండునో అట్టివిషయమునున్ను అవివ్యాపించెడు రీతినిన్ని ఆమూలముగా యిచ్చట వివరింపనక్కరలేదు. అట్టిచీడలు ప్రబలి పశునాశము గలుగజేసి దేశమునుచాలా నష్టిపరచుచున్నదనుట యీగ్రంథమును చదువువారలందరు సమ్మతింపవలయును.

దొమ్మజాడ్యసంబంధములగు అంకురములు(ఈదేశమందు యీచీడచేత పశుధ్వంసము మెండుగా గలుగుచున్నది. యీరోగముతగిలి చచ్చినజంతువులను దహనముచేయక పూడ్చివేయుటచేతనే యీచీడ నానాటికి వృద్ధియగుచున్నది. ఇందుకుసందేహములేదు. భూమిలోని యెర్రలమూలముగా బహుదూరము వ్యాపించి తమవిషపటుత్వమును బహుకాలమువరకు నిలుపుకొనగలవనుటకు దృష్టాంతములుగలవు. కాబట్టి యిట్టిజాడ్యాంకురములను మొదలంట వినాశమునొందించుట యెంతటిఅవశ్యకార్యమో మీరేయోచించిచూడుడు! అగ్నిసహాయ్యముచేత జాడ్యోత్పత్తికారణముల నివారింపప్రయత్నింపుడు! ఏలననగా, జాడ్యోత్పత్తికారణము నివారితముకానిది జాడ్యప్రాబల్యము తగ్గదుగదా.

ఈదేశమందు సకలప్రదేశములలో మనుష్యసంతతియందును మృగసంతతియందును జాడ్యములు ఉత్పత్తియగుట మనమువింటున్నాముగదా. అట్లుగో

గములు త్వన్నములగుటకు కారణములుండునుగాని యుండకపోవు. సోకుడు సంబంధములగు వస్తువులను నివర్తించుటకు తగిన సాధనములను చేయకపోవుటయే జాడ్యోత్పత్తికి కారణము. పదింటిలోతొమ్మిది యీకారణముచేతనే ప్రాప్తించుచున్నవనుటకు సందేహములేదు. కాబట్టి సకలజనహితార్థముగా శవములను బట్టీలో దహనముచేయు పద్ధతిని జనులుయికనవలంబింతురని కోరెదను.

జాడ్యమును ఒకచోటనుండి మరియొకచోటునకు కొనిపోదగిన వస్తువులనన్నింటిని దహనముచేయుటకొరకు ఆసుపత్రులసమీపమందును కరడీజాడ్యకాలములయందును రోగపుపశువులుండుశ్రేణులయొద్దను పశువైద్యశాల ఆవరణమందును దుకాణములయొద్దను బట్టీలను కట్టియుంచవలయును.

దహనాదికృత్యములకు కట్టెలుకావలసియుండును—గాని గుఱ్ఱపు మకాములయందు లాయములలోచేరెడి పడకగడ్డి, లద్దిమొదలగువాటితోటి దహనము చేయవచ్చును. నక్షీలోకనుపరచబడిన పరిమితిగల బట్టీని మంటితోటిగాని యిటికెతోటిగానికట్టదలచితిమా అయిదు ఆరురూపాయలకంటె అధికముకానేరదు. భారీపరిమితిగల బట్టీని నిర్మించుటకు పదునారు లేక పదునెనిమిది రూపాయలు పట్టును. కాబట్టి బట్టీనికట్టుటకు అయ్యెడిసొమ్ము స్వల్పమేగాని యెక్కువయినదిగాదు. బట్టీనిబంకమంటితోటి కట్టుటశ్రేయము. బంకమంటి గోడలు బహుగట్టిగానుండును ; మరియు యీమన్ను బురదమంటివలె వానలకుకరగిపోనేరదు. కాబట్టిబంకమన్ను చిక్కునెడలదానితోటి బట్టీనికట్టుట మహాశ్రేష్ఠము. మూడుసంవత్సరముల అనుభవమును పట్టిచూడగా బురదమంటితోటి నిర్మింపబడిన బట్టీలు సమస్తకార్యములకున్ను అనుకూలించుచు వచ్చినవి. ఈబట్టీలను యెవ్వరయినను సాధారణముగా నిర్మించికొనవచ్చును. వెలసులభము ఫలమధికమన్నట్లు యీబట్టీలకు పట్టుబడి సహితముచులకనయియుండును. శవములను దహనముచేయుటకు బట్టీలు బహుఅనుకూలముగానుండునని నాకుతోచి ప్రచురముచేసినమీదటయీరాజధాని చాలాప్రదేశములయందు వాడుకలోకి వచ్చియున్నవి. మఱియు బంగాళా కోస్తాలోసహితము బట్టీలు అములులోనుండియున్నవి.

బట్టీలను యెట్లువాడుకపరచుకొనుటకున్ను వాటివలని ప్రయోజనమును



న్ను కొంతవివరించెద. చెన్నపట్టణమునకు సమీపమందుండెడు పరంగికొండ అనుప్రదేశమందు అశ్వక్షయ ఫార్సి అనెడుజాడ్యములు వ్యాపించియుండినపుడు యీజాడ్యములుతగిలిన పదునెక్కుగుఱ్ఱములను సంహరించి బట్టీలయందు దహనముచేసియున్నాను. మఱియు సికందరాబాదులో జ్వరదొమ్మయనెడు రోగమువలన మృతిబొందిన యొకగుఱ్ఱమును సహితము ఆలాగే బట్టీలోదహనముచేసితిని. లాయములలోనిపేడపెంట వేసి ఒక్కొక్కగుఱ్ఱమును కాల్చి బూడిదచేయుటకు సరాసరి పండ్రెండుగంటలు పట్టినది. ఇట్లుకాల్పక ఆశవములను పూడ్చివేసినయెడల ఆచోటజాడ్యాంకురములు నిలిచియుండి మరల ఆజాడ్యములే వ్యాపకమయి జంతునాశమును కలుగచేసియుండును. కాబట్టి సర్కారువారికినష్టిలేకుండా లాయపుచెత్తతోటి ఆశవములనుబట్టీలోవేసికాల్చివేయుటచేతగదా నిర్భయముగానుండగలిగెను. బట్టీలవలని ప్రయోజనమును తెలుపుటకు యిదేమంచి నిదర్శనము. ఆరోగ్యవిషయమయిన లోపములు చాలాగలవుగాని శ్రద్ధపుచ్చుకొనేయెడల మనుష్యుని శక్తికిమీరిపోజాలవు.

వాస్తవముగా కట్టెలసహాయముచేత దహనము మహావేగముగా కాగలదు అయినను, లాయపుచెత్తచేత సాధ్యమయినంత త్వరలో శవమునుదహనముచేయవచ్చును గనుక కట్టెలంతగా అక్కరలేదు.

దహనముచేత జాడ్యాంకురములు భస్మమయిపోవును. కాబట్టి సౌఖ్యమును కాపాడుకొనుటకున్ను చీడలవ్యాపకమును అపుటకున్నుయీపద్ధతి వివేకవిసిష్టమయినది.

బట్టీనిర్మాణప్రదేశము.—పొగవలన జనసౌఖ్యమునకు విరుద్ధము గలుగక గాలి నిరాటంకముగా వీచెడుప్రదేశములయందు బట్టీలను నిర్మింపవలయును.

నిర్మాణము.—బంకమన్ను చిక్కకపోబట్టి బురదమంటితోగాని యిటికెరాళ్లతోగాని బట్టీలనుకట్టవలసి వచ్చెనేని గోడలుమిక్కిలి మందముగానుండవలయును. ముఖ్యముగాగోడల అడుగుభాగము చాలాదళముగా గట్టవలయును. ఇటికె, బురదమంటి గోడలు-బంకమంటిగోడలకంటె రెండంతలు దళముగానుండేనేగాని దృఢముగానుండవు.

బట్టీలనునిర్మాణముచేయునపుడు అస్తిభారము నేర్పరచినపిమ్మట అదిగట్టిప

డేవరకు కొన్నాళ్లునిదానించి ఆవలగోడలుకట్టుటకు పూనవలయును. తొలుత ఒకగజముయెత్తునగోడగట్టి అది ఆరి గట్టిపడినపిమ్మట పైకమానుగోడను నిర్మింపవలయును. ఈపని పూర్తిఅయినవెనుక తక్కినపనులను తీరుబాటుకొలది మెల్లమెల్లగాచేసికొనవచ్చునుగాని తొందరపడకూడదు. పావంచాల అస్తిభారమునకు చెక్కరాళ్లనుగాని గుండురాళ్లనుకాని ఉపయోగింపవచ్చును.

బట్టీపూర్తిఅయి చక్కగా యెండినపిదప ఆవుపేడతోటి పూతవేయవలయును. పగుళ్లువాసియుండెనేని అవి పూడువరకు వారమునకొకతూరి ఆవుపేడతోటి అలుకుచుండవలయును.

బట్టీని వాడుకపరచుకొనుటకయిన నిబంధనలు.

(1) తొలుత శవమును దహనముచేయవలసినపుడు దొరికినంతగడ్డిని బట్టీలోవేసి నిమ్మళముగా సగము బట్టీకనింపిగాలికన్నములోని గడ్డిని అగ్నిచే ముట్టింపవలయును. గోడలు చక్కగా కాకయెక్కినపిమ్మట బట్టీలోదేనినివేసినను తక్షణమే దహనముకాగలదు.

(2) గాలిగూండ్లలో బుగ్గిచేరి మూసుకపోనివ్వక అప్పుడప్పుడునొక దంతెతోటి బుగ్గినిబయట లాగివేయుచుండవలయును.

(3) పదిహేను రోజులకు ఒక పర్యాయము బట్టీని శుభ్రముగా తుడిచి శిథిలమయిన భాగములను బాగుచేయవలయును.

(4) శవమును కాల్పవలసి వచ్చినపుడు బట్టీలో మూడువంతులు నిండునటుల చెత్తవేసి (నక్షీలో కనుపరచబడిన నెం III రు గీతవరకు) దానిమీద శవమును అట్టేగాని ముక్కలుముక్కలుగా ఖండించిగాని ఉంచి పయిన గడ్డిగేదములు పేర్చి గాలిగూండ్ల ద్వారా నిప్పు ముట్టింపవలయును. చక్కగా కాలి బూడిదె కాగలందులకు అప్పుడప్పుడు దుగ్గవేయుచుండవలయును.

(5) వర్షము కురియుచుండెనేని చెట్ల కొమ్మలతోటి యొక తడక గట్టి వర్షము కొట్టెడు వయిపున దానిని ఆనించి బట్టీ చుట్టూ పల్లము త్రవ్వి చీలు కాలువల నేర్పరచి బట్టీని కాపాడవలయును.



షరా. బట్టీలోని బుగ్గిగాని బొగ్గుగాని లాయములలో జంతువులు మూత్ర విసర్జనముచేసి యుండెడు ప్రదేశములయందు చల్లుటచేత మూత్రమును పీల్చికొని అచ్చటి దుర్వాసనను నివారించును. గుఱ్ఱపువాండ్రు కోరినపుడు చేతికి అందునటుల లాయములలో అచ్చటచ్చట రాసులుపోసి యుంచవలయును. బట్టీలలోని బూడిదెను బొగ్గులను యిట్లు వినియోగించుటచేత మనుష్యులకుగాని మృగములకుగాని యేలాటి అపాయములు కలుగనేరవు. ఎట్టి జాడ్యాంకురములుగాని అగ్నిలో పడిన పిమ్మట అగ్ని శక్తికిమీరి జీవింపజాలవు. ఈఅంకురములు తాము పట్టిన జంతువును యెట్లు మరణము నొందించెనో అట్లు తాము సహితము ఆజంతువు కళేబరముతోటి అగ్నియందు మాడి మసి బొగ్గులాయెను.

ఖావందు ఖుద్దునయుండి బట్టిని కట్టించి, శవమును కాల్పవలసి వచ్చినపుడు తాను స్వతహాగా అచ్చట నిలిచి దహనము జరిగించినయెడలనే బట్టీవలని ప్రయోజన మిట్టిదని సర్వజనులకు దెలిసి వారువారు యీపద్ధతిని అవలంబింప పూనుకొందురు. అగాట్లుక యీకార్యముల నిర్వహింప తమ సేవకులను పంపి ఖావందులు కదలకుండాయింట గూర్చొనియుండిన యెడల శేవకులు అశ్రద్ధచేతురు. శేవకుల అశ్రద్ధచేత దహనము చక్కగా జరుగకగాని, బట్టీని కట్టుటయందు లోపముగలిగి బట్టీ బద్దలయి పోవుటవల్లగాని యీ అగణ్యమగు పద్ధతి తుదకు హాస్యాస్పదమగును. బట్టిల విషయమయి నేను మూడు సంవత్సరములు కష్టపడి తుదకు ప్రస్తుతపు పద్ధతి మహా శ్రేష్ఠతరమయినదని అనుభవ పూర్వకముగా దృఢపరచు కొన్నాడను. కాబట్టి యిందుతోటి జతపరచిన నక్షీప్రకారము బట్టీలను నిర్మించుకొని పయి నిబంధనల మేరకు జరుపుకొనినయెడల ఆరోగ్యవిషయమునకు అమూల్యమగు సాధకమగునని నమ్మవలయును.

బట్టీలనుగురించి నేను వ్రాయనలచినది మొదలుకొని మనుష్యశవములను పిడకలతోటి పుటంవేసి దహనముచేయుచుండుట చూచియున్నాను. ఈపద్ధతిమేలుతరమయి సులభమయియుండుటయేగాక అంతసొమ్ముకూడాపట్టదు. బట్టీలు కట్టుటకు వీలులేని కాలమందున్ను కట్టవలసినంత అక్కరలేనప్పుడున్ను బట్టీ హాజరుగాలేకుండి అకస్మాత్తుగా చీడలుపుట్టినసమయమందు

న్ను పశువులశవములు సహితము పిడకలతోటిపుటంపెట్టుట మహాలాభకారియయి యుండును. ఒకటిన్నరఅడుగుయెత్తున పిడకలజేర్చి దానిపయిశవమును ఉంచి అందుమీద మరికొన్నిపిడకలను పేర్చెదరు. శవమనితెలియనివారు పిడకలరాశి యని అనుకొందురు- అంతటక్రింద అగ్నిప్రయోగముచేయుదురు. మరికొంతసేపటికంతా బుగ్గి మాత్రము కనుపడును గాని మరియేమిన్నియుండదు. ఇట్లుచేయుచుండగా నేనుదగ్గిరనుండి చూచియున్నాను.

పశుశవమును చితిమీద నుంచుట మహాదుర్లభము, కాబట్టిశవమును నేలమీదనుంచి మీద పిడకలనుపేర్చి నిప్పుతగిలింపవచ్చును. ఇట్లుచేయుటచేత సహితముదహనము త్వరగాకాగలదు. శవమునకు అగ్నిచక్కగా సోకినవెనుక దానియొక్క కొవ్వు, యెమ్ములు మొదలగువాటి సహాయ్యముచేత బహుత్వరగా దహనమగును. ఆరుఅడుగులనిడివి నాలుగుఅడుగులవెడల్పు రెండు అడుగులలోతు గల యొక గుంటత్రవ్వి శవమును దానిలోబడవేసి మీదపిడకలనుచేర్చి దహనముచేయుటవలన యెక్కువపిడకలు పట్టనేరవు.

వాహినీవిడిదల ప్రదేశములకు సమీపమందు విసర్జనవస్తువులను పారవేయుటకుగా గోతులుత్రవ్వబడి అందుయెముకలు మొదలగునవి చేరి ఆచుట్టుపట్ల అనారోగ్యమయియుండుట బట్టి ఆప్రాంత్యములు వాసయోగ్యములు కావు. అచ్చటి వాయువు వేసవి కాలములయందు అసహ్యమయి వర్షాకాలమపుడు నిలువను యింపితముగాక యుండును. కాబట్టి యిట్టిప్రదేశములయందు బట్టీలుతప్పక యుండవలయును. అచ్చటియెముకలు, చెత్తమొదలగువస్తువులు దహనమునకు కంపగా నుపయోగించును.

---

1 - టి

# అనుబంధము.

1867 సం॥ చెన్నపట్టణ రాజధాని యెనిమిదోశాసనములో జంతువులయెడల క్రూరత్వమునుగురించి నంతవరకు సదరు శాసనమును దిద్దుబాటుచేయగలందులకు పుట్టిన 1879 సం॥ నాలుగోశాసనము.

పీఠిక.

చెన్నపట్టణము పహరు పోలీసు 1867 సం॥ యెనిమిదోశాసనములోని 55 సెక్షన్ ప్రకారం నేరము జరిగించబడిన యేజంతువునయినా అటంకపెట్టుటకుగాని అట్టిజంతువు కుదరనిజాడ్యముచేత బాధపడుచుండినయెడలదానిని సంహరించుటకుగాని మేజస్త్రేటుగార్లకు అధికారముయివ్వగలందులకు సదరుశాసనమును దిద్దుబాటుచేయుట యుక్తముగావున్నందున నిర్ణయించడమేమనగా;—

సర్కారువారువైద్యశాలను యేర్పరచివిడదల సరిటిపికేట్లు యిచ్చుటకు తగు ఉద్యోగస్తులను నియమింపవచ్చును.

1. సభాసీనులయిన శ్రీ గవర్నరుగారు, 1867 సం॥ యెనిమిదోశాసనములోని 55 దో సెక్షన్ ప్రకారము నేరముజరిగింపబడినజంతువులవిషయమై తగుశ్రద్ధపుచ్చుకొని చికిత్సచేయుటకుగా అప్పుడప్పుడు ఒకటిలేక అధికస్థలములయందు వైద్యశాలలను యేర్పరచి అట్టివయిద్యశాలనుండి విడదల అయినజంతువులకు సరిటిపికేట్లుయిచ్చుటకుగా తగు ఉద్యోగస్థులనునియమింపవచ్చును.

ఒక జంతువునుసంహరించుటకుగాని, చికిత్సచేయుటకు వైద్యశాలలోనుంచుటకుకాని, అట్టిజంతు

2. 1867 సం॥ యెనిమిదో శాసనములోని 55 దో సెక్షన్ ప్రకారం మేజస్త్రేటుగారి యెదట నేరస్థాపన చేయబడిన వెంటనేఆమేజస్టేటుగారు విచారణచేసి సదరు సెక్షన్‌లో విధించబడిన శిక్షకు తోడుగానయినా, లేక యీడుగానయినా, నేరముజరి

పునరుఅయిన ఖర్చులను స్వంతదారుని యొద్దనుండి వసూలు చేయించుటకు మేజస్ట్రేటుగారికి అధికారముగలదు.

గింపబడిన జంతువు కుదరని జాడ్యముచేత బాధపడుచుండే యెడల దానిని సంహారింపమనిగాని యీ శాసనము 1 టో సెక్షన్‌లో కనిన మేరకు వయిద్యశాలకుచికిత్స కొరకు పంపమనిగాని తీర్మానింపవచ్చును. అట్టి జంతువుయొక్క సంరక్షణార్థము పట్టినసొమ్ము పూరాగానికొంతభాగముగాని స్వంతదారునియొద్దనుండి వసూలు చేయవలసినట్టు మేజస్ట్రేటుగారు తలచేయెడల ఆప్రకారం చేయవచ్చును.

తగు అధికారపూర్వకముగా విడదలచేయబడేవరకుజంతువు వయిద్యశాలలోనే నిలిపియుంచబడును. పట్టుబడిసొమ్మును చెల్లించి జంతువునుతోలుక పొమ్మని స్వంతదారునకు నోటీసుజారిచేయించ వలయును.

3. చికిత్సకొరకు వయిద్యశాలకు పంపబడిన జంతువును 1 టో సెక్షన్ ప్రకారం నియమింపబడిన ఉద్యోగస్థుని వుత్తర్వు మేరకువిడదల అయ్యేవరకు అచ్చట నేనిలుపుకొనవచ్చును. మేజస్ట్రేటుగారి వుత్తర్వుప్రకారం ఆజంతువుయొక్క సంరక్షణార్థము పట్టుబడి అయిన సొమ్మును చెల్లించమనిన్ని నోటీసు అందిన 48 గంటలలో సదరు జంతువును వయిద్యశాలనుండి తోలుక వెళ్లమనిన్ని స్వంతదారునకు వయిద్యశాలాధికారి నోటీసు జారీ చేయవలయును.

పట్టుబడిసొమ్మునుస్వంతదారుడు చెల్లింపనిపక్షమందు ఆజంతువునువిక్రయించి విక్రయపయికమునుపట్టుబడికియీడుగాపుచ్చుకొను టకుఅధికారము.

4. స్వంతదారుడు తానుచెల్లించవలసిన సొమ్మును చెల్లించనన్నా లేక చెల్లించుటకు అశ్రద్ధ చేసి 3డో సెక్షన్‌లో నిర్ణయింపబడినమేరకు వుచితకాలములో జంతువునుతోలుకవెళ్లనిపక్షమందు యేమేజస్ట్రేటుగారుగాని సదరు జంతువునువిక్రయించి విక్రయఖర్చులు మినహాతక్కినసొమ్మునుస్వంతదారుడు చెల్లించ వలసినబాకీక్రింద జమకట్టుకోవలసినట్టు వుత్తర్వుచేయవచ్చును.

శేషముస్వంతదారునకు చెందవలసినది.

స్వంతదారుడు చెల్లింపవలసిన బాకీపోగా యేమయినా పయికం మిగతయుండి విక్రయ తారీఖు మొదలుకొని రెండుమాసములలోగా స్వంతదారుడు సదరు మిగత పయికం తనకు యిప్పించమని దరఖాస్తు చేసికొ



న్నయెడల అట్టి పయికమును స్వంతదారునకు యిప్పించవలయును. అలాగు దరఖాస్తు చేసుకొననియెడల సదరు సొమ్ము సర్కారుకు చేరిపోవును.

విక్రయ సొమ్ముకంటె అధికము స్వంతదారుడు చెల్లింప వలసినదిలేదు.

5. ఈశాసనప్రకారం విక్రయింపబడిన జంతువుయొక్క స్వంతదారుడు విక్రయ ఖర్చులుపోను నిలవయుండు పయికం కంటె అధికము యివ్వవలసిన బాధ్యతలేదు.

జంతువును స్వంతదారుని పరంచేయుటకు మేజస్ట్రేటుగారికి అధికారము కలదు.

6. ఏమేజస్ట్రేటుగారు గాని యెప్పుడయితేనేమి తనకు యుక్తమనితోచే షరత్తులమీద యీశాసనము మేరకు అటంకపెట్ట బడియుండు జంతువును దాని స్వంతదారుని పరంచేయవచ్చును.

ఖర్చులను వసూలుచేయడము.

7. ఈశాసనము 2 డో సెక్షన్‌లోకనినమేరకు విచారణఖర్చులను, జుల్మానాలువిధించడమునకుగా పుట్టిన 1877 సం॥ నాలుగోశాసనప్రకారమే వసూలుచేయవచ్చును.

ఈశాసనము 1867 సం॥ యెనిమిదో శాసనములో ఒకభాగము.

8. ఈశాసనము చెన్నపట్టణం 1867 సం॥ యెనిమిదోశాసనములో ఒకభాగముగా యెంచుకొని చదువవలయును.

## 1867 సం॥ యెనిమిదో శాసనము

### 55 డో సెక్షన్

జంతువులయెడ క్రౌర్యము.

ఎవ్వడుగాని యేజంతువునయినా కొట్టినాలేక దౌర్జన్యపరచినాలేక దుర్వినియోగ పరచినా లేక హింస పెట్టినా, లేదా కొట్టమనిగాని దౌర్జన్య పరచమని గాని దుర్వినియోగ పరచమనిగాని సలహాయిచ్చినాలేక చేయించినా, అట్టిమనిషిపైప్రతినేరమునకున్ను నూరు రూపాయలకు మించని జుల్మానాకు పాత్రుడగుచున్నాడు. జుల్మానా చెల్లించలేకపోయిన యెడల హిందూదేశపు శిక్షాస్మృతిలో విధింపబడియున్న మేరకుమూడుమాసములకు మించని రెండుతరహాలలో ఒకతరహా ఖయిదుకు పాత్రుడగుచున్నాడు.

# 2-వ

# అనుబంధము.

## చెన్నపట్టణరాజధాని 1866 సం॥ 2 వ శాసనము.

—o—

### చెన్నపట్టణరాజధాని యిలాకా పశువులకుసంభవించే రోగమువ్యాపించకుండా ఆపడముకొరకు పుట్టినశాసనము.

పీఠిక.

చెన్నపట్టణరాజధాని యిలాకాను జంతువులకు సంభవించెడు అంటులేక సోకుడు రోగములు వ్యాపించకుండా ఆపడము కొరకు తగుబందోబస్తుచేయడమున్ను అట్టివుద్దేశముతో న్యాయశాస్త్రముద్వారా, అప్రకారమురోగముకగిలిన జంతువుల విషయమయి జరిగించవలసిన పద్ధతి నిర్దేశించడమున్ను యుక్తముగానున్నందున నిర్ణయించడముయేమనగా :—

సభాసీనులయిన శ్రీగవర్నరుగారికి యుక్తమనితోచే స్థలములయందున్ను కాలములయందున్ను శాసనము వ్యాపింపచేయబడవలసినది.

1. ఈశాసనము ఫోర్టుసెంటుజార్జి గెజెట్లో యిస్తిహారుద్వారా సభాసీనులయిన శ్రీగవర్నరుగారు అప్పుడప్పుడు హుకుము చేసే జిల్లాలయందున్నులేక జిల్లాలతాలూకు భాగములయందున్ను కాలములయందున్ను అములులోకి తేబడవలసినది.

అర్థము.

2. ఈక్రిందవచ్చేమాటలకున్ను వాక్యములున్ను, సంగతిలో, లేక సందర్భములో అట్టి అర్థమునకు విరోధముగా యేదిన్ని వుండనియెడల వాటికియిందువల్ల కలుగజేయబడిన అర్థము కలిగియుండవలసినది.

మేజస్ట్రేటు.

“మేజస్ట్రేటు” అనేమాట ఒకమేజస్ట్రేటుగారి అధికారములలో అన్నిటినిగాని యేవయినాగాని చెలాయించేదరో బస్తుమంది మనుష్యులను కలుపుకొంటున్నది.

వచనము.

ఏకవచనార్థద్యోతకములయిన శబ్దములు బహువచనమును కలుపుకోవలసినది. బహువచనార్థద్యోతకములయిన శబ్దములు ఏకవచనమును కలుపుకోవలసినది.

లింగము.

పుంలింగ ద్యోతకములయిన శబ్దములు స్త్రీలింగములను కలుపుకోవలసినది.

జంతువు.

“ జంతువు” అనేమాటకు, యేదయినా లొటిపిట, దున్నపోతు, గుఱ్ఱము, తట్టున, గాడిదె, వృషభము, ఎద్దు, ఆవు, పెయ్యదూడ, దూడ, గొఱ్ఱె, గొఱ్ఱెపిల్ల, మేక మేకపిల్ల, లేకపంది అని అర్థముకావలసినది.

ఆసుపత్రీ పశువుల దొడ్లు యెక్కడస్థాపించబడవలసినది.

3. పయిన నిబంధన కలుగచేయబడిన ప్రకారము యేదయినా జిల్లా, జిల్లాతాలూకూ భాగముకు యీశాసనము వుపయోగపరచబడిన పక్షమందు ఆజిల్లాతాలూకూ మేజస్ట్రేటుగారు నిర్ణయించేస్థలములయందు ఆసుపత్రీ పశువులదొడ్లు స్థాపించబడి అట్టిఆసుపత్రీపశువుల దొడ్లకు సంరక్షకులు సదరహీ మేజస్ట్రేటుగారివల్ల నిర్ణయింపబడవలసినది. ప్రతిఆసుపత్రీ పశువులదొడ్డి యేగ్రామపువారివల్ల లేకగ్రామములవారివల్ల వుపయోగపరుచుకోవలసినదిన్ని మేజస్ట్రేటుగారివల్ల నిర్ణయింపబడి యిస్తిహారుచేయబడవలసినది.

పశువుల ఖావందుగాని వాటిస్వాధీనదారుడుగాని యేదయినా అంటురోగమువాటికి తగిలినప్పుడు అందునగురించి తెలియచేయవలసినది.

4. పయిన నిర్ణయింపబడినప్రకారము యీశాసనము వ్యాపింపజేయబడ్డ యేదయినా జిల్లాయందు లేక జిల్లాతాలూకూ భాగమందు యేజంతువునకయినా యేదయినా అంటులేక సోకుడు రోగముతగిలినప్పుడు అందుల ఖావందుగాని స్వాధీనదారుడుగాని ఆకాలమందు ఆజంతువు వుంటూవున్న గ్రామమునకు లేక షహరుకు నిర్ణయింపబడిన ఆసుపత్రీపశువుల దొడ్డి సంరక్షకునికి తక్షణమే తెలియచేయడము అతనికి పనిగావుండవలసినది.

పశువులదొడ్డి సంరక్షకుడు జంతువును తనఖీచేయవలసినది.

5. పయినచెప్పబడినప్రకారం సమాచారము తెలియచేయబడిన మీదట సాధ్యమయినంతత్వరలో ఆనుపత్రీపశువుల దొడ్డి సంరక్షకుడు ఆజంతువును తనఖీచేసి చికిత్సకుగాను దానిని ఆనుపత్రీపశువుల దొడ్డిలో వుంచడము జరూరు అవునాకాదా అనేసంగతి పరిష్కరించవలసినది.

జరూరు అయినయెడల ఆసుపత్రీ పశువులదొడ్డికి తీసుకొనిపొయ్యేలాగున హుకుము చేయవలసినది.

6. ఆజంతునకు అంటులేకసోకుడు సంబంధమయిన యేదయినా రోగమున్నట్టు ఆనుపత్రి పశువులదొడ్డి సంరక్షకుడు అభిప్రాయపడినయెడల ఆయన, ఆపయిన జంతువుయొక్క ఖావందుగాని అందులస్వాధీనదారుడుగాని దానిని ఆసుపత్రీపశువుల దొడ్డిలోవుంచేలాగున కోరవలసినది. పయిగా జరూరుఅయినయెడల ఖావందుగాని స్వాధీనదారుడుగాని సదరు జంతువు వుంచబడియున్నకొట్టముకు, లేకయితర స్థలముకు రోగముసోకకుండా చేయడముకొరకు తానుహుకుముచేసె బందోబస్తులు చేసేలాగున కోరవలసినది.

ఏదయినా అంటులేక సోకుడు రోగము తగిలియుండేటట్టు సంశయము కలిగియుండే యేదయినాజంతువు వుండేస్థలములను తనఖిచేయడము.

7. ఆనుపత్రి పశువుల దొడ్డితాలూకూ ప్రతిసంరక్షకుడు, లేక అందుకుగాను డిస్ట్రిక్టుమేజస్ట్రేటుగారివల్ల అధికారము కలుగజేయబడిన మనిషి, తానునిర్ణయించబడియుండే సరిహద్దుకులోపుగా యేదయినా అంటు లేక సోకుడురోగము తగిలియుండేటట్టు తనకు సంశయము కలిగియుండే యేదయినా జంతువు, లేకజంతువులు వుండేయేదయినా లోగిలిగాని స్థలముగాని ప్రవేశించి చూడడమునకున్ను అట్టి రోగము తగిలియుండేటట్టు తనకు సంశయము కలిగియుండేయేదయినా జంతువును, లేకజంతులను తనకు జరూరుఅనితోచే యేకాలమందయినాగాని యేస్థలముదయినాగాని తనఖిచేసి చూడడమునకున్ను అట్టిజంతువును, లేక జంతువులను ఆసరిహద్దుతాలూకూ ఆనుపత్రిపశువులదొడ్డికి తీసుకొనిపొయ్యేలాగున కోరడమునకున్ను అధికారము కలిగి యుండవలసినది.



ఏదయినా అంటులేక సోకుడు రోగముతగిలిన యేదయినాజంతువు వుంటూవున్న లేక వుండే లోగిలి శుభ్రపరచడము.

8. ఆసుపత్రీపశువులదొడ్డి తాలూకూ ప్రతిసంరక్షకుడు, లేక అందుకుగా డిస్ట్రిక్టుమేజస్ట్రేటుగారివల్ల అధికారము కలుగచేయబడిన మనిషి, తన సరిహద్దుకులోపుగా యేదయినా అంటులేకసోకుడు రోగముతగిలిన యేదయినా జంతువు వుంటూవున్న, లేకవుండే యేదయినా లోగిలిని తనకు యుక్తమనితోచే యేతరహాగానయినా శుభ్రపరచి రోగముసోకకుండా చేయించడమునకున్ను సదరురోగమును వ్యాపింపచేసేలాగు తనకుతోచే యేదయినా మేత, పేడ, లేకపెంట, వీటి వల్ల రోగముసోకకుండా చేయించడమునకున్ను జరూరు అయినయెడల వాటిని నశింపచేయడమునకున్ను అధికారముకలిగియుండవలసినది.

ఖావందు మేతయున్ను అవుషధములున్ను తెచ్చి యివ్వనియెడల మేతకున్ను చికిత్సకున్ను అయ్యేఖర్చులు పశువులదొడ్డి మూలధనములోనుంచి చెల్లింపబడవలసినది.

9. జంతువుయొక్క ఖావందుగాని స్వాధీనదారుడుగాని తానే మేతయున్ను అవుషధములున్ను యిచ్చేలాగున కోరనియెడల, పయినసమూదుచేయబడిన ప్రకారము రోగముతగిలిన యేదయినాజంతువు ఆసుపత్రీపశువులదొడ్డి సంరక్షకునివల్ల స్వాధీనపరచుకోబడిన కాలము లగాయతు సదరుజంతువునకు మేతకొరకున్ను అవుషధచికిత్సకొరకున్ను తగులుబడి అయినదరోబస్తు ఖర్చులున్ను, 1857 సం॥ 3 డో శాసనముబట్టి స్థాపించబడిన పశువులదొడ్డిమూలధనములోనుంచి చెల్లించబడవలసినది. అయితేఖావందుయిచ్చె మేతయున్ను అవుషధములున్ను ఆసుపత్రిపశువులదొడ్డి సంరక్షకుడు మంజూరుచేసేవిగా లేక నిర్ణయించేవిగావుండవలసినది.

చంపివేయబడిన జంతువులు పాతివేయబడవలసినది. పయిగా ఖావందుపడ్డనష్టద్రవ్యముకు దావాచేయబడకూడదు.

10. ఆసుపత్రీ పశువులదొడ్డి సంరక్షకుడు, లేక అందుకుగా డిస్ట్రిక్టుమేజస్ట్రేటుగారివలన అధికారము కలుగచేయబడిన యితర మనిషి, అంటులేక సోకుడురోగము వ్యాపించకుండా ఆపడమునకు తమకు జరూరు అనితోచేటప్పుడు పయిన చెప్పబడిన ప్రకారము దొడ్డిలో వుంచ బడకముందు అయినా

సరే వుంచబడిన తర్వాతనయినాసరే యేదయినా జంతువును చంపివేయడమునకు అధికారము కలిగియుండవలసినది. ఏదయినా జంతువు ఆప్రకారము చంపివేయబడిన యెడలగాని ఆసుపత్రీ పశువులదొడ్డి సంరక్షకుని స్వాధీనమందుండగా చనిపోయినయెడలగాని సదరు జంతువుతాలూకు కళేబరమును భూమి పయిమట్టసమునకు అధమం ఆరుఆడుగులకు క్రిందుగా పాతిపెట్టించడము సదరు సంరక్షకుని పనిగావుండవలసినది. పయిగా ఆప్రకారము చేయడమువల్ల తగిలిన యేదయినా ఖర్చు, పశువులదొడ్డి మూలధనములోనుంచి చెల్లించ బడవలసినది. ఈ సెక్షనువల్ల అధికారము కలుగచేయబడిన యేదయినా కార్యమును పట్టి సంభవించిన యేదయినా నష్టమునకుగాను యే పరిహారద్రవ్యమునకున్ను దావా చేయబడకూడదు.

రుసుములు కట్టబడవలసినది. పయిగా చెల్లించబడనియెడల ఖర్చులను గురించి జంతువు విక్రయింప బడవలసినది.

11. పయిన చెప్పబడ్డ ప్రకారము దొడ్డిలో వుంచబడ్డ యేదయినా జంతువుకు తగిలి యుంటూవచ్చిన రోగము స్వస్థమయిపోయిన పక్షమునకు అందుల ఖావందు, లేక దానిని స్వాధీన మందుంచుకొని యున్న మనిషి, పశువులదొడ్డి మూలధనపు లెక్కలో జమపెట్టబడేలాగున అట్టి జంతువుయొక్క మేతకున్ను చికిత్సకున్ను తగిలిన ఖర్చు ఆసుపత్రీ పశువులదొడ్డి సంరక్షకునియొద్ద చెల్లించవలసినది. అతనుపయిన చెప్పబడ్డఖర్చులను చెల్లించక తప్పిపోయిన పక్షమునకు అప్పుడు సదరు జంతువుయేలము ద్వారా విక్రయింపబడి ఆవిక్రయమువల్ల వసూలు అయిన మొత్తములో ఖర్చుల తాలూకు సొమ్ము వజాచేసికొన్నమీదట శేషించిన సొమ్ము అందుల ఖావందుకుగాని దానిని స్వాధీనమందుంచుకొనియున్న మనిషికిగాని చెల్లించబడవలసినది. అయితే, ఆఖావందు లేక స్వాధీనమందుంచుకొనియున్న మనిషి మేతయున్ను అవుషధమున్ను తానేయిచ్చేలాగున యేర్పాటుచేసుకొనిన సంగతులలో యేఖర్చులున్ను అతను చెల్లించేలాగున కోరబడకూడదు.

ఏదయినా అంటురోగము తగిలిన యేదయినా జంతువు వుండే కొట్టములోగాని అట్టి జంతువుతోటి కూడాగాని వున్న యేదయినా జంతువును వకస్థలములోనుంచి మరియొకస్థలమునకు లయిసెన్సు లేకనే తీసుకొనిపోకుండా నిషేధము.

12. ఏదయినా అంటు, లేక సోకుడు రోగము తగిలిన యేదయినా జంతువు యున్న కొట్టములో, లేక లాయములోగాని, మందలో లేక సమూహములోగాని అట్టి



జంతువుతోటి కూడాగాని వున్న యేదయినా జంతువును తనస్వాధీనమందు లేక తనపరమందు వుంచుకొనియుండే యేమనిషిన్ని ఆసరి హద్దు తాలూకు ఆసుపత్రి పశువులదొడ్డి సంరక్షకుని యొక్కగాని లయిసెన్సు యివ్వడమునకు డిస్ట్రిక్టుమేజస్ట్రేటుగారివల్ల అధికారము కలుగజేయబడిన యొకమనిషియొక్కగాని లయిసెన్సు లేకుండా అట్టి జంతువును తనభూమిలోనుంచి లేక లోగిటిలోనుంచి ప్రాణముతో వుండగా మరియొక చోటికి తీసుకొనిపోకూడదు. అట్టిప్రతి లయిసెన్సున్ను లిఖితరూపముగా వుండవలసినది. పయిగా ఆలయిసెన్సుద్వారా ఆసుపత్రీ పశువులదొడ్డి సంరక్షకునికిగాని పయిన చెప్పబడిన ప్రకారము అధికారము కలుగచేయబడిన యితరమనిషికిగాని అట్టిజంతువువల్ల ఆరోగము వ్యాపించనేరదని తగిన హేతువులమీద సమాధానకరముగా తోచేవరకు దరోబస్తుయితర జంతువులలోనుంచి అనుకూలముగా ప్రత్యేకమయిన వకస్థలమునకు అట్టిజంతువును తీసుకపొయ్యేలాగున మాత్రము శెలవు యివ్వబడవలసినది.

జంతువుకురోగము తగిలి నప్పుడు ఆసంగతి తెలియచేయకుండా తప్పిపోయిన యెడల శిక్ష.

13. ఏదయినాయొక జంతువునకు అంటులేక సోకుడు రోగము తగిలియుండే కాలమందు దానిని స్వాధీనమందు వుంచుకొనియుండే యేమనిషి అయినా 4 - గో సెక్షనులో నిర్ణయించబడిన ప్రకారము ఆగ్రామసంబంధమయిన ఆసుపత్రీ పశువులదొడ్డి సంరక్షకునికి ఆసంగతి తెలియచేయక తప్పిపోయిన యెడల సదరు మనిషి వక మేజస్ట్రేటుగారియెదట నేరస్థాపన చేయబడిన మీదట అట్టి అశ్రద్ధను గురించిన ప్రతిసంగతిలోనూ అయిదు రూపాయలకు మించని జుల్మానాకుగాని ఆజుల్మానా చెల్లించబడనియెడల పదిరోజులకు మించనియేకాలము వరకయినా సాధారణమయిన ఖయిదుకుగాని పాత్రుడు కావలసినది.

పశువులదొడ్డి సంరక్షకుని హుకుముల ప్రకారము జరుపుకోకుండా తిరుగుబాటు చేసినయెడల శిక్ష.

14. రోగము తగిలిన యేదయినా జంతువును ఆనుపత్రీ పశువుల దొడ్డిలో వుంచడమును గురించిగాని, రోగము తగిలిన యేదయినా జంతువు వుంచబడియున్న యేదయినాలోగిలివల్ల లేక స్థలమువల్లరోగము సోకకుండా బందోబస్తుచేయడమును గురించిగాని, రోగము వ్యాపింపచేయగూడిన యేదయినా మేత, పేడ, పెంట, వీటివల్లరోగము సోకకుండా బందోబస్తుచేయడమును గురించి, లేక వాటిని నశింపచేయడమును గురించిగాని, ఆనుపత్రీ పశువులదొడ్డి సంరక్షకునియొక్క లేక అందుకుగాను డిస్ట్రిక్టుమేజస్ట్రేటుగారివల్ల క్రమముగా అధికారము కలుగజేయబడిన వక మనిషియొక్క హుకుముప్రకారము జరుపుకోక తప్పిపొయ్యే, లేక యేదయినా అంటులేక సోకుడు రోగము తగిలిన యేదయినా జంతువున్న కొట్టములో, లేక లాయములోగాని మందలో లేక సమూహములోగాని అట్టిజంతువుతోటికూడాగానివున్న యేదయినా జంతువును లయిసెన్సు లేకుండా మరియొక చోటికి తీసుకపొయ్యే యేమనిషి అయినా వక మేజస్ట్రేటుగారియెదట నేరస్థాపనచేయబడిన మీదట యిరువయి రూపాయలకు మించని జుల్మానాకుగాని ఆజుల్మానా చెల్లించ బడనియెడల పదిరోజులకు మించని యేకాలముపరకయినా సాధారణమైన ఖయిదుకుగాని పాత్రుడు కావలసినది.

రోగము తగిలినజంతువులను పట్టకోకుండాను దొడ్డిలోవుంచకుండానున్ను యెదిరించిన యెడల శిక్ష.

15. ఈశాసనము అములులోవుండే యేదయినా జిల్లాలో లేక జిల్లాతాలూకా భాగములో ఆనుపత్రీ పశువులదొడ్డి సంరక్షకులుఅందరున్ను వక హెడ్ కన్ స్టేబిల్ దర్జాకు తక్కువకాకుండాయుండే పోలీసు ఆఫీసర్లు అందరున్ను డిస్ట్రిక్టుమేజస్ట్రేటుగారు విశేషముగా అధికారముగలుగజేసే యితరమనుష్యులున్ను అంటులేకసోకుడురోగమువల్ల శ్రమపడుతూవుండే దరోబస్తుజంతువులను పట్టుకొని దొడ్డిలోవుంచడము వారిపనిగావుండవలసినది. పయిగా అట్లాపట్టుకొనే సంగతిలో బలవంతముగా యెదిరించే లేక అట్లాపట్టుకొన్నతర్వాత ఆజంతువులను బలవంతముగా విడిపించే యేమనిషి అయినా యిండియాదేశపు శిక్షాస్మృతి తాలూకు 186 రో సెక్షనును పట్టి శిక్షించబడతగ్గ నక నేరముజరిగించినట్టు యెంచబడవలసినది.



ఖావందు, తనజంతువులు పట్టుకోబడ్డ పదిరోజులకులోపుగా మేజస్ట్రేటుగారివద్ద పిర్యాదు చేసుకోవచ్చును.

16. ఎవరి జంతువులకు రోగముతగిలివున్నది అని పట్టుకోబడ్డవో అట్టి యేమనిషిఅయినా, పట్టుకోబడ్డ తారీఖులగాయతు పదిరోజులకులోపుగా యేకాలమందయినా అందునగురించి యెవరయినా మేజస్ట్రేటుగారివద్ద పిర్యాదుచేసుకోవచ్చును. అపిర్యాదునోటిమాటలుగానయినా వుండవచ్చును. అట్టిసంగతిలో అందులసారాంశము మేజస్ట్రేటుగారివల్ల లఖితరూపముగా వ్రాసుకోబడవలసినది, లేక వట్టికాకితముమీద వ్రాయబడి ఖుద్దున ఫిర్యాదివల్లగాని ఆసంగతులను స్వతహాగాయెరిగియుండే వకయేజెంటువల్లగాని దాఖల్ చేయబడవచ్చును. ఫిర్యాదీనిలేక యేజెంటును విమర్శించినమీదట ఫిర్యాదుకు మంచిఆధారము కలిగివున్నది అని నమ్మడముకు మేజస్ట్రేటుగారికి కారణము కనుపడ్డ పక్షముకు యెవరిమీద ఫిర్యాదుచేయబడినదో ఆయా ఆసామీని తలబుచేయించి ఆసంగతినిగురించి సంగ్రహముగా విమర్శచేయడముకు ప్రారంభించవలసినది. ఆపట్టుకోవడమనేది అక్రమమని తీర్పుచేయబడ్డ పక్షముకు మేజస్ట్రేటుగారుఅక్రమముగా పట్టుకోవడమువల్ల గలిగిన యేదయినా నష్టముకుగాను, లేక హానికిగాను న్యాయమయిన పరిహారద్రవ్యముగా వుండేలాగున తనకు తోచే నష్ట ద్రవ్యము ఆజంతువులను విడదలచేసుకోవడమందు తగిలిన దరోబస్తుఖర్చులతోటికూడా ఆఫిర్యాదీకియిచ్చేటట్టు తీర్పు చేయవలసినది, లేక ఆజంతువులు విడదల చేయబడి యుండనియెడల మేజస్త్రేటుగారు నష్టములను గురించిన ద్రవ్యము యిచ్చేటట్టు తీర్పుచేయడమేగాకుండా అవి విడదలచేయబడేలాగున హుకుముచేసి యీశాసనమునుబట్టి వసూలు చేయబడవలసిన ఖర్చులు జంతువును పట్టుకొన్న ఆసామీవల్ల చెల్లించబడేలాగున తీర్పుచేయవలసినది. ఆప్రకారము తీర్పు చేయబడ్డ దరోబస్తు నష్టములను గురించినటువంటిన్ని ఖర్చులను గురించి నటువంటిన్ని మొబల్లగు, 1859 - సం॥ 24 గో శాసనపు అధికారమును పట్టి విధించబడిన అచ్చుదలలు లేక జుల్మానాలు రాబట్టుకోవడము కొరకు 1865 సం॥ (మదరాస్) 5-దో శాసనములోనిర్దేశించబడ్డ చర్యప్రకారము వసూలు చేయబడవలసినది.

17. ఈశాసనమును బట్టి వసూలుచేయబడ్డ దరోబస్తు జుల్మానాలు 1857 సం॥ 3-డో శాసనము తాలూకూ నిబంధనలను బట్టి స్థాపించబడిన పశువులదొడ్డి మూలధనములో జమపెట్టబడవలసినది. ఆమూలధనము యీశాసనము తాలూకూ నిబంధనలనుబట్టి తగులుబడి అయిన దరోబస్తు ఖర్చులు చెల్లించడమందు వుపయోగపరచబడతగియుండవలసినది. అయితే యీశాసనమునుబట్టి వకజుల్మానావిధించే ఆఫీసరుగారు, సగముకుమించకుండా ఆజుల్మానాలోయే భాగమయినా సమాచారము చెప్పినమనిషికి యివ్వబడేటట్టు హుకుము చేయడమునకు అధికారము కలిగియుండవలసినది.

రుసుములున్న జుల్మానాలున్న పశువుల దొడ్డి మూలధనములో జమపెట్టబడవలసినది.

18. సభాసీనులయిన శ్రీగవర్నరుగారు, జంతువులలో సోకుడులేక అంటురోగములు వ్యాపించకుండా యింకాయెక్కువప్రయోజనకరముగా ఆపడముకొరకు ఆప్పుడప్పుడుజరూరనితోచే వుపనిబంధనలు ఫోర్టుసెంటుజార్జిగెజట్లో ప్రసిద్ధపరచబడవలసిన యిస్తిహారు ద్వారాచేయడమునకున్ను విధించడమునకున్ను అధికారము కలిగియుండవలసినది. అయితే అట్టి వుపనిబంధనలు యీశాసనము తాలూకూ, లేక యేదయినా యితరశాసనము తాలూకూ నిబంధనలకు విరోధముగా వుండకూడదు. ఏదయినా అట్టివుపనిబంధనకు భంగముకలుగజేసినయెడల అట్టిమనిషి వకమేజస్ట్రీటుగారియెదట నేరస్థాపనచేయబడినమీదట పదిరూపాయీలకు మించని జుల్మానాకుగాని పదిహేనురోజులవరకు సాధారణమయిన ఖయిదుకుగాని పాత్రుడుకావలసినది.

సభాసీనులయిన శ్రీగవర్నరుగారు వుపనిబంధనలుచేసి వాటికిభంగము కలుగచేసినయెడల శిక్షలున్ను విధించవచ్చును.

---

# శబ్దసూచిక.


| | | | | పుటసంఖ్య. |
|---|---|---|---|---|
| అశాస్త్రీయవైద్యము | ... | ... | ... | 113 |
| అపసవ్యరక్తనాడి | ... | ... | ... | 55 |
| అన్నభేది | ... | ... | ... | 70 |
| అభిని | ... | ... | ... | 70 |
| అలిసెనూనె | ... | ... | ... | 71 |
| అలిసెవిత్తులు | ... | ... | ... | 71 |
| అన్నకోశము | ... | ... | ... | 80 |
| అశ్వక్షయ | ... | ... | ... | 9,34 |
| అతిసారము | ... | ... | ... | 14-15 |
| అమ్మవారు | ... | ... | ... | 33-34 |
| అండకోశము | ... | ... | ... | 60 |
| అంటువలన | ... | ... | ... | 6 |
| అంతర్గత చీడపురుగులు | ... | ... | ... | 24-26 |
| ఆరునీరు | ... | ... | ... | 51 |
| ఆసన్నప్రయోగములు | ... | ... | ... | 66 |
| ఆమ్లవైరి | ... | ... | ... | 69 |
| ఆఘ్రాణద్రావకము | ... | ... | ... | 71 |
| ఆఘ్రాణలవణము | ... | ... | ... | 71 |
| ఆవాలు | ... | ... | ... | 71 |
| ఇపికాకు | ... | ... | ... | 72 |
| ఇండెకోలుగుట | ... | ... | ... | 54 |
| ఇంగువ | ... | ... | ... | 72 |
| ఈడ్పులు | ... | ... | ... | 23,31 |
| ఉద్రేకకారులు | ... | ... | ... | 69 |
| ఉచ్చాటన | ... | ... | ... | 120 |
| ఉప్పు | ... | ... | ... | 72 |

ఉమ్మెత్త ... ... ... 72
ఉబ్బు ... ... ... 17-18
ఉడుకు కాపడము ... ... ... 30
ఉల్లిపాషాణము ... ... ... 111
ఊటకషాయములు ... ... ... 96-97
——, కాచు ... ... ... 96
——, సింకోనా ... ... ... 97
——, అలిసెగింజలు ... ... ... 97
ఊదుమట్టలు ... ... ... 16-17
ఊలతెగులు ... ... ... 24-25
ఎండదెబ్బ ... ... ... 18
ఓడకీలు ... ... ... 56,72
ఓమము ... ... ... 73
ఔషధపట్టీలు ... ... ... 82-97
కదుము ... ... ... 56
కట్లు ... ... ... 63
కట్టుదారము ... ... ... 64
కర్పూరము ... ... ... 73
కర్పూరతైలము ... ... ... 73
కడుపుబ్బు ... ... ... 16-17
కందనగాయ ... ... ... 17
కంతులు ... ... ... 54
కాయ ... ... ... 56
కాపడం ... ... ... 64
కారపువత్తులు ... ... ... 65
కారపుసూది ... ... ... 65
కారపుమందులు ... ... ... 70
కాచు ... ... ... 73
కాడీపులుసు ... ... ... 73
కార్బాలిక్ ఆసిడ్ ... ... ... 74



కారపుకడ్డీ ... ... ... 74
కాస్టిక్కు ... ... ... 74
కామెరలు ... ... ... 19
క్రిమి ... ... ... 58
కుళ్లు ... ... ... 56
కురుపులు ... ... ... 59
కుట్లు ... ... ... 66
కుత్తుకవాపు ... ... ... 28
కుక్కపిచ్చి ... ... ... 35
కొడుపులు ... ... ... 62
కొవ్వు ... ... ... 74
గవాక్షులు ... ... ... 5
గంజాయిఆకు ... ... ... 74
గంధకము ... ... ... 74
గాలిబుడ్డ ... ... ... 54
గాలికుంట్లు ... ... ... 32
గాయములు ... ... ... 50-52
——పోటుగాయము ... ... ... 50
——చీలుగాయము ... ... ... 50
——వ్రేటుగాయము ... ... ... 50-51
——శస్త్రగాయము ... ... ... 50
——గుంటిగాయము ... ... ... 50
గిరసకీలు ... ... ... 52
గిరసగాలి ... ... ... 52
గుదిపెట్టు ... ... ... 28
గురక ... ... ... 28
గొలుసునరము ... ... ... 52
గొంతుపట్టు ... ... ... 15-16
గౌరీపాషాణము ... ... ... 111
చలిదొమ్మ ... ... ... 27-28

చచ్చువాయువు ... ... ... 18-19
చిర్తలు ... ... ... 64
చింతపండు ... ... ... 75
చిట్టాముదము ... ... ... 75
చీనాదేశపుపొక్కుటీగలు ... ... ... 62-76
చూర్ణములు ... ... ... 82-83
——,నంజుకు ... ... ... 82
——,అతిసారమునకు ... ... ... 82
——,కారపు ... ... ... 82
——,సుఖస్థాపక ... ... ... 82
జ్వరహరులు ... ... ... 69
జ్వరదొమ్మ ... ... ... 28
జబ్బవాపు ... ... ... 28
టీకాలువేయునేర్పు ... ... ... 42
టీకా ... ... ... 9
తలపిడుగు ... ... ... 18
తారు ... ... ... 56,72
తామర ... ... ... 26-27
తిరుగుడు జాడ్యము ... ... ... 25-26
త్రికినోయి ... ... ... 105
తులామానములు ... ... ... 68-69
తుట్టెపురుగులు ... ... ... 25
తేలుకుట్టుట ... ... ... 58
తైలములు ... ... ... 83
—,ఉద్దీపన ... ... ... 83
—,సబ్బు ... ... ... 83
—,కర్పూరతైలపు ... ... ... 83
దండె ... ... ... 57
దుశ్శల్యవృద్ధి ... ... ... 65
దొమ్మ ... ... ... 27-30





ద్రోహము ... ... ... 110
దేహపటుత్వకారులు ... ... ... 70
ధనుర్వాయువు ... ... ... 23,52
ధనియాలు ... ... ... 75
ధాతువర్గసంబంధనిషము ... ... ... 111
నంజు ... ... ... 17-18
నవాసాగరము ... ... ... 75
నాడికావుద్రేకకారులు ... ... ... 76,78
నాలుకశెల ... ... ... 13
నాడికా ... ... ... 23
నీరులు ... ... ... 84-85
—,ఆరు ... ... ... 84
—,చలవ ... ... ... 84
—,వగరు ... ... ... 84
—,గాయములకు ... ... ... 84
—,కార్బాలిక్ ... ... ... 84
—,గాలికుంట్లుఅనుజాడ్యమందు కాళ్లమీదలేచేపుండ్లకు ... ... 85
నీడ ... ... ... 4,12
నీరు ... ... ... 4,12
నీరుదొమ్మ ... ... ... 29
నువ్వునూనె ... ... ... 75
నూనెలు ... ... ... 85
—,పొక్కు ... ... ... 85
—,గాయములకుపట్టించే ... ... ... 85
నెయ్యి ... ... ... 75
నెరి ... ... ... 78
నెరడిదొమ్మ ... ... ... 27-28
నెరడిగుండె ... ... ... 28
నేపాళాలు ... ... ... 75

నేలవేము ... ... ... 76
పట్టుడు నరము ... ... ... 52
పందిచమురు ... ... ... 74
పటిక ... ... ... 76
పక్కశెల ... ... ... 14
పసిరికలు ... ... ... 19
పాముకాటు ... ... ... 57
పాషాణము ... ... ... 76
పాలశెల ... ... ... 13
ఫార్సి ... ... ... 34
ప్రారబ్ధము ... ... ... 110
ప్రాకెడిజాడ్యములు ... ... ... 6,29,31,35
ప్రాకెడిజాడ్యములకు అంటక చికిత్స ... ... 37-40
పానములు ... ... ... 85-91
—, దేహపటుత్వమునకు ... ... 85-86
—, కాళ్లవాపునకు ... ... ... 86
—, చర్మరోగమునకు ... ... 86
—, మృదువిరేచనానకు ... ... 86
—, జ్వరమునకు ... ... 86-87
—, దగ్గుకు ... ... 87
—, పురుగులకు ... ... 87
—, కడుపునొప్పికి ... ... 87
—, కాలేజరోగమునకు ... ... 88
—, దొమ్మరోగమునకు ... ... 88
—, సరకురోగమునకు ... ... 88
—, సరకురోగపు అతిసారమునకు ... 88
—, విరేచనమగుటకు ... ... 89
—, నురుగుదబ్బల జాడ్యమునకు ... 89
—, కడుపుబ్బునకు ... ... 89
—, చచ్చువాయువునకు ... ... 90
—, ఊలతెగులుకు ... ... 90
—, వాయురోగమునకు ... ... 90
—, రక్తాతిసారమునకు ... ... 90-91
—, అతిసారమునకు ... ... 91
—, కడుపులోనివైకల్యమునకు ... 91
పిచ్చికారీలనుశుభ్రముచేయువిధము... ... 46
పిచ్ ... ... 76
పిండికట్లు ... ... 91-92
పుష్పి ... ... 55
పుండు ... ... 56
పుండ్లు ... ... 59
పురుగులు ... ... 58
పూతచికిత్సలు ... ... 92-93
—, పొక్కులుపొక్కినచోట ... 92
—, గుంటవ్రణములకు ... ... 92
—, అమ్మవారుపోసినపుడుకలిగేపుండ్లకు ... 92
—, పురుగుపట్టినందుకు ... ... 93
పెళాస్తిరి ... ... 93
—, బెణుకుడుకు ... ... 93
పెద్ద-చీడ ... ... 30-31
పేడులు ... ... 66
పొక్కుమందులు ... ... 62
పొక్కుటీగలు ... ... 76
పోల్టీసులు ... ... 65
పోక ... ... 77
పోషణ ... ... 12
బద్దలు ... ... 66
బంక ... ... 77
బట్టీనిర్మాణము ... ... 119
బహిర్గత చీడపురుగులు ... ... 26-27

బాలింతజన్ని ... ... 20
బీజనిర్మూలనము ... ... 60
బెణుకుడు సంకటములు ... ... 52
బెల్లము ... ... 77
బొగ్గు ... ... 77
బొడ్డుపుండు ... ... 21
బొబ్బలతెగులు ... ... 33
బోరెము ... ... 66-94
మలాములు ... ... 93
—, సొరిసంకటమునకు ... ... 93
—, పొక్కు ... ... 94
—, వ్రణమునకు ... ... 94
—, డెక్కలులేక గిట్టలకు ... ... 94
మస్టుపారుట ... ... 21
మరణానంతరపరిశోధన ... ... 36
మగ్డొగల్సుపౌడర్ ... ... 7
మాంసపిండము ... ... 52
మాత్రకట్లు ... ... 95
—, కడుపులో వైకల్యమునకు ... 95
—, నురుగుదబ్బలజాడ్యమునకు ... 95
—, నంజుకు ... ... 95
మావివేయక పోవుట ... ... 20
మిరపకాయలు ... ... 77
మిరియాలు ... ... 78
మురుగుముడుసు ... ... 55
ముసాంబ్రము ... ... 78
ముష్టి ... ... 78
ముసర ... ... 30-31
మృదువిరేచనకారులు ... ... 70
మూత్రవర్ధనులు ... ... 70



మెర్క్యురిరెడ్ అయోడైడ్ ... ... 78
మేత ... ... 3,12
మేకసొరి ... ... 26
మైలతుత్తపునీరు ... ... 56
మైలతుత్తము ... ... 78
మైనము ... ... 78
మోరశెల ... ... 22-23
రసభస్మము ... ... 79
రక్తాతిసారము ... ... 14-15
రక్తమూత్రము ... ... 19
రాచకురుపులు ... ... 28-29
రోజనము ... ... 79
లవంగాలు ... ... 79
లెడ్ అసిటేట్ ... ... 79
వగరునీరు ... ... 51
వాతలువేయుట ... ... 61
వాయుహరములు ... ... 70
వామ్ము ... ... 73
వాయువు ... ... 19-20
విరుగుటలు ... ... 53
వికలత్వములు ... ... 53
విరియబోసినసున్నము ... ... 56,80
విరియబోయనిసున్నము ... ... 79
విరేచనలవణము ... ... 80
విషపురుగులకాట్లు ... ... 57
విరుగుడుమందులు ... ... 114
వెలితుత్తము ... ... 80
వేపఆకు-చెక్క-చమురు ... ... 80
వేపివెట్టి ... ... 35
శతపుష్పివిత్తులు ... ... 80

| | |
|---|---|
| శుచిత్వము | 12 |
| శృంగద్రావకము | 71 |
| శుద్ధజలములు | 95-96 |
| —, గాలికుంట్లుఅనెడుజాడ్య మందునోరుగడుగుటకు | 95 |
| —, కండ్లుగడుగుటకు | 96 |
| షుగర్ ఆఫ్ లెడ్ | 79 |
| సవ్యరక్తనాడి | 31,55 |
| సద్యోనొప్పులు | 64 |
| సదాపవిత్తులు | 80 |
| సబ్బు | 80 |
| సరకు | 30-31 |
| సారాయము | 81 |
| స్థావరవర్గసంబంధవిషములు | 111 |
| సింకోనాచెక్క | 81 |
| సీమసున్నము | 81 |
| సుఖస్థాపకములు | 70 |
| సున్నపుతేట | 96 |
| సూరాకారము | 81 |
| స్పెయినుదేశపు పొక్కుటీగలు | 62,76 |
| సోరి | 26 |
| సోకుడుపరిహారులు | 70 |
| సోపు | 82 |
| సోకుడు | 8 |
| క్షయ | 21-22 |


# INDEX.


| | Page. |
|---|---|
| Abrasion | 57 |
| Accidental Poisoning | 110 |
| Acetate of Lead | 79 |
| Actual Cautery | 61 |
| Acute Pains | 64 |
| Aloes | 78 |
| Alteratives | 70 |
| Ammoniæ Carbonas | 71 |
| Ammonium Chloride | 75 |
| Ammonia Liquor Strong | 71 |
| Aniseed | 82 |
| Antacid | 69 |
| Anthrax.—Its Forms:— | 27—30 |
| Anthrax Fever | 28 |
| Braxy | 29 |
| Carbuncles | 28—29 |
| Malignant Sore Throat | 28 |
| Quarter-ill | 28 |
| Splenic Apoplexy | 27 |
| Antidotes | 114 |
| Artery | 55 |
| Astringent Lotion | 51 |
| Bandages | 63 |
| Balls | 95 |
| —— for Stomach Derangement | 95 |
| —— for Lung Disease | 95 |
| —— for Dropsy | 95 |
| Bites of Venomous Animals | 57 |
| Blown | 16—17 |
| Blister | 62 |

Bony Enlargement ... ... ... 65
Braxy ... ... ... 29
Calomel ... ... ... 79
Cantharides ... ... ... 76
Carminatives ... ... ... 70
Carbolic Acid ... ... ... 74
——— Lotion ... ... ... 84
Carbuncles ... ... ...28—29
Castration ... ... ... 60
Caustic Potash ... ... ... 35
Caustics ... ... ... 70
Caustic, Lunar ... ... ... 74
Chinese Fly ... ... ...62, 76
Chlorine ... ... ... 24
Choking ... ... ...15—16
Cinchona Bark ... ... ... 81
Clamps } Clams } ... ... ... 64
Communicable Diseases ... 6, 29, 31, 35
Copper Lotion ... ... ... 56
Cow Pox ... ... ...33—34
Deodorizers ... ... ... 70
Diarrhœa ... ... ...14—15
Dill Seed ... ... ... 80
Dislocation ... ... ... 54
Diuretics ... ... ... 70
Drachm ... ... ... 68
Dressings ... ... ...92—93
——— for Blistered Surface ... ... 92
——— for Deep Ulcers ... ... 92
——— for Sores in Pox ... ... 92
——— for Maggots ... ... 93
Drinks ... ... ...85—91
——— for Anthrax ... ... 88
——— for Belly Pain ... ... 87
——— for Coughs ... ... 87
——— for Diarrhœa ... ... 91
——————— in Rinderpest ... 88



Drinks for Dysentery ... ...90—91
——— for Fever ... ...86—87
———, Laxative ... ... 86
——— for Lung Disease ... ... 89
——— for Liver Disease ... ... 88
——— for Paralysis ... ... 90
———, Purgative ... ... 89
——— for Rheumatism ... ... 90
——— for Rinderpest ... ... 88
——— for Rot ... ... 90
——— for Skin Disease ... ... 86
——— for Stomach Derangement ... 91
——— for Swollen Legs ... ... 86
———, Tonic ... ... ...85—86
——— for Tympanitis ... ... 89
——— for Worms ... ... ... 87
Dropsy ... ... ...17—18
Dropping after Calving ... ... 20
Dysentery ... ... ...14—15
Enemas ... ... ... 66
Epizootic Aphtha ... ... ... 32
Epsom Salts ... ... ... 80
External Parasites ... ... ...26—27
Farcy ... ... ... 34
Fat ... ... ... ... 74
Fetlock-joint ... ... ... 52
Febrifuges ... ... ... 69
Firing Irons ... ... ... 62
Fomentation ... ... ... 64
Foot Rot ... ... ... 56
Foot and Mouth Disease ... ... 32
Foul ... ... ... 55
Fractures ... ... ... 53
Gall ... ... ... 56
Garget ... ... ... 13
Gid ... ... ...25—26
Glanders ... ... ... 9,34

Hæmaturia ... ... ... 19
Healing Lotion ... ... ... 51
Heart ... ... ... 17
Hernia ... ... ... 54
Hoose ... ... ... 24
Hot Fomentation ... ... ... 30
Hoven ... ... ...16—17
Husk ... ... ... 24
Hydatids ... ... ... 25
Inflammation of the Lungs ... ... 14
——— ——— Tongue ... ... 13
Infusions ... ... ...96—97
——— of Catechu... ... ... 96
——— of Cinchona ... ... 97
——— of Linseed ... ... 97
Internal Parasites ... ...24—26
Ipecacuanha ... ... 72
Jaundice ... ... ... 19
Lard ... ... ... 74
Laxatives ... ... ... 70
Lead Acetate ... ... ... 79
Ligament ... ... ... 52
Ligature ... ... ... 64
Lime Water ... ... ... 96
Liniments ... ... ... 83
———, Stimulating ... ... 83
———, Soap ... ... ... 83
———, Turpentine ... ... 83
Linseed ... ... ... 71
Linseed oil ... ... ... 71
Lotions ... ... ...84—85
———, Astringent... ... ... 84
———, Carbolic ... ... ... 84
———, Cooling ... ... ... 84
———, Healing ... ... ... 84
——— for Sores in Foot and Mouth Disease 85
——— for Wounds ... ... 84
Macdougals Powder ... ... 7

